# వైశాఖ పురాణము

- శ్రీ జయంతి జగన్నాథశాస్త్రి



ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# వైశాఖపురాణము

(స్కాందపురాణాంతర్గతము)

## వచనము

గ్రంథకర్త:

శ్రీ జయంతి జగన్నాథశాస్త్రి



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి.

1955

 [ వెల 1—8—0




# భూమిక

ఆర్యావర్త దేశము ఋషిపుంగవ భూషితమై వేదశాస్త్ర పురాణేతిహాస చోదితమై సనాతన ధర్మవిరాజితమై, సద్వ్రత ధర్మాచరణాసక్త సంయుతమై వలరారుచుండును. అందు వత్సరమునకు గల పండ్రెండు మాసములకు గూడ దగురీతి నాచరింపవలసిన విధులు, ధర్మములు, వ్రతములు భగవదంశాసంభూతులగు ఋషిపుంగవులు వివరించియున్నారు. అష్టాదశపురాణములు కూడ నీరీతిగనే వ్యాసుడు విరచించి మానవకోటికి ప్రసాదించినాడు. అందు స్కాందపురాణమున సమస్త ధర్మములును, వ్రతవిధులును, సనాతనధర్మములును, ఆస్తికతాబోధనలును, అగతానాగతవిశేషములును నిర్వచింపబడియున్నవి. యీ స్కాందపురాణమునందు బ్రహ్మమానసపుత్రుడైన నారదమహర్షి అంబరీషమహారాజునకు అనేకవిధ ధర్మములను నిర్వచించినాడు. అవి సూతుడు శౌనకాదులకు వీనుల విందగునట్లు వినిపించినాడు. యీ పొత్తమునందు వైశాఖమాసము యొక్క మహిమ, వ్రతమహాత్మ్యము—ఫలితము లోనగు పెక్కు విషయములు జనసామాన్యమున కందుబాటగు నట్లుల్లేఖింపబడినది. ధర్మాసక్తులగు పాఠకలోకము దీనిం బఠించి తాము తరించుటయే గాక యితరులను కూడ తరింపజేయుదురని నా తలంపు.

రాజమండ్రి
30—3—54

ఇట్లు
విద్వజ్జన విధేయుడు
జయంతి జగన్నాథశాస్త్రి

# విషయసూచిక

# ప్రార్థన శ్లోకములు

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే 1

శ్లో. యాకుందేందు తుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా
యావీణావరదండ మండిత కరా యా శ్వేత పద్మాసనా
యాబ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభి ర్దేవైస్సదాపూజితా
సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా 2

శ్లో. వందే లక్ష్మీం పరమశివ మయీం శుద్ధజాంబూనదాభాం
తేజోరూపాం కనకవసనాం స్వర్ణభూషోజ్జ్వలాంగీం
బీజాపూరం కనకకలశం హేమ పద్మం దధానా
మాద్యాం శక్తిం సకల జననీం విష్ణువామాంక సంస్థామ్ 3

శ్లో. వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ 4

శ్లో. గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరం బ్రహ్మా తస్మై శ్రీగురవేనమః 5

శ్లో. జ్ఞానానంద మయం దేవం నిర్మల స్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే. 6

శ్రీరస్తు

# వైశాఖపురాణము




## మొదటి అధ్యాయము

సూత పౌరాణికుండు శౌనకాది మహామునులకు చెప్పు చున్నాడు—సమస్తభూతజాలమును సృజించిన బ్రహ్మదేవుని మానస కుమారుడగు నారదమహర్షి అంబరీషచక్రవర్తికి అనేకవిధ ధర్మములను వినిపించగా ఆతడు అమితానందమును పొంది యింకను విశేషములను వినగోరి మహానుభావా! నారదా! మీరు నాకు పండ్రెండు మాసముల మాహాత్మ్యమును గురించి చెప్పియున్నారు నేనును బహుశ్రద్ధతో విని యానందించితిని. మాసములన్నిటిలో వైశాఖ మాసము మిక్కిలి శ్రేష్ఠమైనదని నా మనస్సున నిశ్చయపరచు కొంటిని. గాన ఆ మాసమాహాత్మ్యమును వినుటకు కుతూహలము కలిగియుంటిని. అందువలన యీ వైశాఖమాసము శ్రీ మహావిష్ణువునకు యెట్లు మిక్కిలి ప్రీతికరమైనది? యీ మాసమందు మనుజులాచరింపదగిన వ్రతవిధులు, ధర్మములు యేవిగలవు? యీ మాసమందు చేయదగిన విష్ణుప్రీతిని కలిగించు కార్యములెవ్వి? ఏవిధమైన దానములను చేయవలెను? ఆ దానాచరణమువలన గలుగు ఫలితములేమి? ఎందునిమిత్తమేధర్మము నవలంబింపవలయును? వైశాఖ మాసమున విష్ణుపూజన మేపదార్థములతో సమాచరింపవలెను? యీ విధమైన విషయములను వినుటకు కుతూహలాయత్తచిత్తుడనై యున్నాడను గాన మీరది యానతిచ్చి నన్ను కృతార్థుని చేయుడని యడిగెను.

అంత నారదముని అంబరీషమహారాజునకు చెప్పదొడంగెను. మహారాజా! పరమరహస్యమైన మాసధర్మములను గురించి పూర్వమందు నేను బ్రహ్మదేవునడిగితిని. ఆ బ్రహ్మ, యీ విషయమై ఒకానొకప్పుడు లక్ష్మీదేవి, విష్ణుమూర్తిని ప్రశ్నింపగా శ్రీ మహావిష్ణువామెకు దెల్పెననియు, ఆ విషయమునే తిరిగి చెప్పెదనని నాకు వినిపించెను. దానినే మరల నీకు చెప్పుచున్నాను. వినుము.

సంవత్సరమునకు గల పండ్రెండు మాసములలో కార్తిక మాసము, మాఘమాసము, వైశాఖమాసము మిగుల మహిమ గలవని చెప్పుదురు. వీనిలోకూడ వైశాఖము అమితఫలము గలదని చెప్పబడినది. ఈ మాసమున చేసిన దానములు, ధర్మములు, యాగములు, స్నానములు లోనగు కర్మలన్నియు సమస్తమగు పాపములను నిర్మూలముచేయును. కాబట్టి యీ వైశాఖమాసము సమస్త మానవులకును, తల్లిపిల్లలకు యిష్టవస్తువుల నొసంగి మనుచునట్లు సర్వాభీష్టములను యిచ్చును.

వైశాఖమాసము సర్వవిధ ధర్మములు కలదిగను, యజ్ఞస్వరూపము కలదిగను, సమస్తక్రియలయొక్క సారము కలదిగను, గొప్ప తపోమహిమకలదిగను, దేవతలచే పూజల నందునట్టిదిగను, తెలియబడుచున్నది. సమస్తవిద్యలలో వేదమువలెను, సర్వమంత్రములలో ఓంకారమువలెను, వృక్షజాతులలో కల్పవృక్షమువలెను, ఆవులలో కామధేనువువలెను, పాములలో ఆదిశేషువువలెను, పక్షులలో గరుత్మంతునివలెను దేవతలలో విష్ణుమూర్తివలెను, వర్ణములలో బ్రాహ్మణునివలెను, యిష్టవస్తువులందు ప్రాణమువలెను, సహచరులందు భార్యవలెను, నదులలో గంగానదివలెను, కాంతియందు సూర్యునివలెను, ఆయుధములందు చక్రమువలెను, లోహములందు బంగారమువలెను, విష్ణుభక్తులలో శంకరునివలెను, మణులలో

కౌస్తుభమణివలెను, ధర్మమహిమాన్వితమైన మాసములందు వైశాఖ మాసము మిన్నయై నలరారుచున్నది.

వైశాఖమాసమున సూర్యోదయమునకు ముందుగా మేష సంక్రమణమందు స్నానమాచరించిన మానవుడు విష్ణుప్రీతికరమగు వేరొక కార్యము నాచరింపనవసరము లేదు. రమానాథుడగు శ్రీమహా విష్ణువు వైశాఖమాసమం దాచరింపదగిన స్నానమందు ప్రీతికలవా డగుటచే, అన్నదానమువలన భూతజాలము సంతృప్తిపడునట్లు భగ వంతుడు వైశాఖస్నానమువలన సంతసించును. అట్టి స్నాన మాచ రించినవారిని, స్నానాసక్తి గలవారినికూడ ననుగ్రహించును. అంత మాత్రమున వారు జ్ఞానాసక్తులై పాపములనుండి విడువబడి విష్ణు లోకమును పొందగలరు. సూర్యుడు మేషరాశియందుండగా ఉదయ మున స్నానమాడి సంధ్యావందనాది క్రియల నిర్వహించిన వారు, సమస్తపాపములనుండి ముక్తులై విష్ణువునం దైక్యము కాగలరు. వైశాఖమాసమున నాలుగవవంతు దినములు, స్నానము చేసినను పదివేల అశ్వమేధయాగముల ఫలితమును పొందగలడు. స్నానము చేయుటకు శక్తిలేనివాడు స్థిరమైన మనస్సుగలవాడై స్నానము చేయు సంకల్పమును మనస్సున కలిగియుండెనేని, అతడు నూరు యాగములు చేసిన పుణ్యమును పొందును.

సూర్యుడు మేషరాశియందుండగా వైశాఖమాసమున ఎవడు స్నానమాచరించుటకై బయలుదేరి ధనుస్సు ప్రమాణముగల దూర మువరకు వచ్చునో వాడు సమస్తకర్మబంధములనుండి విముక్తుడై విష్ణులోకమును పొందును. ఓ అంబరీషమహారాజా! స్వర్గలోక, భూలోక, పాతాళలోకములందు గల తీర్థములన్ని బ్రహ్మాండాం తర్భూతమైన సమస్తతీర్థములన్నియు, బహిర్జలముల యందును, తటాకము కాలువ మొదలగు వానియందును ప్రసన్నమైయుండును,

కాన ఏ మానవుడు వైశాఖమాసమున బహిర్జలములయం దైనను స్నానము చేయకయుండునో వాడు యముని యానతిప్రకారము సమస్త పాపముల చేతను చుట్టబడియుండును.

అంబరీషా! తీర్థములకు అధిదేవతలగు దేవతలు వైశాఖ మాసమున చెరువులు, నూతులు, కాలువలు లోనగువానియందుగల బహిర్జలములందు సన్నిహితులై ఆశ్రయించి యుందురు. ఈ మాస మున సూర్యోదయము మొదలు ఆఱు ఘడియలవరకు మానవుల మేలుకొఱకు శ్రీమహావిష్ణువుయొక్క యానతి ననుసరించి దేవత లందరు బహిర్జలములయందు సన్నిహితులై యుందురు. కాన యీ వైశాఖమాసమున యీ ఆఱుఘడియలలోగా నెవడు స్నానమాచ రింపడో వానికి తీర్థములకు అధిదేవతలగువారు శాపమిచ్చి తమతమ స్థానములకు పోవుదురు. వైశాఖమాసమందు ప్రాతఃకాలమున ముఖ్యముగా స్నానము చేయవలయును.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖ మాహాత్మ్యమందు నారదాంబరీష సంవాదమున మొదటి అధ్యాయము.

## రెండవ అధ్యాయము

నారదుడు అంబరీషమహారాజునకు చెప్పుచున్నాడు. వైశాఖ మాసముతో సమానమగు మాసమును, కృతయుగముతో సమాన మగు యుగమును వేదముతో సమానమగు శాస్త్రమును, గంగా నదితో సమానమగు తీర్థమును లేదు. జలముతో కూడిన దాన ముతో సమానమగు దానమును, భార్యవలన గలుగు సుఖముతో సమానమగు సౌఖ్యమును, ప్రయత్నమువలన గలుగు ధనముతో

సమానమగు సంపదయు, జీవించుటకంటె యితరమైన ప్రయోజనము లేవు. ఉపవాసముతో సమానమగు తపమును, దానముకంటె యితరమైన సుఖమును, దయతో సమానమగు ధర్మమును, కండ్లతో సమానమైన కాంతియు లేదు. భోజనమువలన గలుగు సంతృప్తితో సమానమగు తృప్తియు, వ్యవసాయముతో సమానమగు వాణిజ్యము, ధర్మముతో సమానమగు మిత్రుడు, సత్యముతో సమానమగు కీర్తియు, వేఱొకటియుండనేరదు. ఆరోగ్యముతో సమమగు దేహస్థితి, విష్ణుమూర్తితో సమమగు రక్షణమును, వైశాఖమాసముతో సమమగు పవిత్రమైన వేఱొక మాసమును లేదు అని పండితులు వచింతురు.

వైశాఖమాసము సదా విష్ణుమూర్తికి ప్రియకరమైనది. అట్టి విష్ణు ప్రీతికరమైన వైశాఖ మాసమందు వ్రతశూన్యుడై స్నానమాచరింపకయేనరుడు కాలము గడుపునో అతడు సర్వపాపముల చేతను చుట్టబడి ధర్మములనుండి తప్పింపబడి, వెంటనే పశుజన్మమును పొందగలడు. ధర్మముల నాచరించు వారియందు గరిష్ఠుడవైన అంబరీష మహారాజా! మానవ జన్మమెత్తి వైశాఖమాసమున వ్రతశూన్యముగను, స్నానరహితముగను కాలము గడపిన నరుడు చేయు సమస్త యజ్ఞాది కర్మలును వ్యర్థమగును. వైశాఖమాసమందు జరుపు వ్రతము దుపయోగించు పుష్పఫలాదులు గూడ విష్ణులోకప్రాప్తిని పొందునటకు సందియము లేదు.

ఈ లోకమునందు అనేకములగు సంపదలు, అనేకములగు చరిత్రములు కలవు. అవి యన్నియు మానవునకు మరల జన్మను కలుగచేసి శరీరాయాసమును కలుగచేయునవిగా నున్నవి. వైశాఖ మాసమందు ప్రాతఃకాలమున సూర్యుడు మేషరాశియందుండగా స్నానమాచరించినవానికి తిరిగి జన్మకలుగనేరదు. అన్నిదానములందు యెట్టి ఫలితముకలదో, గంగాది సమస్త తీర్థములందును యెట్టి

పుణ్యముకలదో, అట్టి ఫలము వైశాఖమాసమున జలదానముచేసి నందువలన కలుగును. పుణ్యప్రదమగు సంపదను పొందవలెనను యాశగలిగియు, జలదానమును చేయజాలనివాడు, యితరులనైనను ప్రోత్సహించి చేయింపవలయును. జలదానము అన్నిదానములలోను మిగుల శ్రేష్ఠమైనది. పూర్వమందు త్రాసునందు జలదానము నొక ప్రక్కను, సమస్తమైన యితర దానములనూ రెండవ ప్రక్కనూ నుంచి తూచగా జలదానమే యెక్కువగా తూగెను. బాటసారులు ప్రయాణముచేయు మార్గమధ్యమందు చలివేంద్రను యేర్పరచి, వైశాఖమాసమందు యెవడు జలమును త్రాగుటకు యిచ్చి దాహమును తీర్చుచున్నాడో, అతడు సత్పురుషుడై తన వంశమందు పుట్టిన కోటితరములవారిని, యెట్టి దుర్గతులం బొందుచున్నను, తరింపచేసి, విష్ణులోకమును జెందింపగలుగును. అట్లు చలివేంద్ర నేర్పరచుట, దేవతలకును, పితృదేవతలకును, మునీశ్వరులకును, మిక్కిలి సంతోషమును కలిగించును. యిందుకు సందేహము లేదు. మార్గాయాసమున శోషించి దప్పికచే తాపముజెంది వచ్చిన బాటసారులకు జలదానము చేసి సంతుష్టులను జేసినచో, బ్రహ్మ, హరి, శివుడు లోనగు సర్వ దేవతలును సంతుష్టులగుదురు. మహారాజా! నీటియందు కాంక్షగల వాడు నీటినికోరును. నీడయందు కోరికగలవాడు నీడను అభిలషించును. విసనకఱ్ఱయందు వాంఛగలవాడు దానిని వాంఛించును. అందువలన వైశాఖమాసమునందు యెవరికి యేవిధమగు కోరిక యుండునో ఆ విధముగా నీరు, గొడుగు, విసనకఱ్ఱ, కాలిజోళ్ళు లోనగునవి యిచ్చి వారిని సంతుష్టపరచవలెను.

ఈ మాసము సమీపించుచున్న దనగా కుటుంబీకుడగు విప్రునకు పూర్ణజలములుగల ఉదకకలశమును మానవుడు దానము చేయవలెను. అట్లుచేయనివాడు యీలోకమందు చాతకపక్షిగా పుట్టును.

ఎవడు దాహపీడితుడగు వానికి చల్లని నీటినిచ్చి ఉపశమింపజేయు చున్నాడో, అట్టివా డాకర్మచేతనే అనేక వేల రాజసూయయాగము లను చేసినందువలన కలుగు ఫలితమును బొందును. ఎవడు ఎండ వేడిమిచేత తాపమును పొంది యాయాసపడుచుండునో వానికి విసన కఱ్ఱచే విసరి తాపోపశమనముగావించునో అట్టివాడు ఆకార్యము చేతనే పాపవిముక్తుడై గరుత్మంతుని స్వరూపమును పొంది మూడు లోకములందును సంచరింపగలడు. వైశాఖమాసమున బ్రాహ్మణు నకు విసనకఱ్ఱను దానముచేయనివాడు అనేకవాయురోగములచే బాధపడుచు అంత్యమున నరకమును జెందును. మార్గాయాసముచేత అలసిపోయిన విప్రునకు, వస్త్రముతోనైనను యేవరుడు విసరుచూ తాపమును తీర్చుచున్నాడో, అతడు సమస్త పాపములనుండి విము క్తుడై విష్ణుసాయుజ్యమును పొందును. ఏనరుడు పరిశుద్ధాత్మతో తాటియాకుల విసనకఱ్ఱనైనను వైశాఖమాసమున దానమిచ్చు చున్నాడో అట్టివాడు సమస్త పాపములనుండి విడువబడి బ్రహ్మలోక ప్రాప్తిని జెందగలడు.

పుణ్యవంతిమైనదియు, ఆయాసమును తాపమును పోగొట్టు నదియునగు విసనకఱ్ఱను వైశాఖమాసమున యేమానవుడు దానము చేయకుండునో అతడు నరకలోకమున పాపము ననుభవించి యీ భూలోకమందు మహాపాపియై పుట్టును. అంబరీష మహారాజా! ఆధ్యాత్మిక, ఆధిదైవిక, అధిభౌతికములను దుఃఖములను పోగొట్టు కొనుటకు సర్వవిధములచేతను, మానవుడు ప్రయత్నించి గొడుగును దానమిచ్చువలెను. విష్ణుప్రీతికరమైన వైశాఖమాసమందు గొడుగును దానమివ్వని నరుడు నీడలేనివాడై పాపయుతిమైన పిశాచమై భూలోకమున జన్మించును. వైశాఖమాసమందు కాలిజోళ్ళు దాన మును ఎవడు చేయునో ఆ పుణ్యాత్ముడు యమదూతలను త్రోసివైచి

విష్ణులోకమును చేరగలడు. మాధవప్రీతికరమగు వైశాఖమాసమందు కాలిచెప్పులు ఎవడు దానము నిచ్చునో అతడు యీలోకమందు కష్టములను పొందక పరలోకమందు సుఖమును పొంది నరకమును పొందడు. పాదుకలు కావలెనని వాంఛ కలిగిన విప్రునకు పాదుకలను దానమొసగినవాడు కోటిజన్మలవరకు భూలోకమున రాజుగా జన్మించును. అనాథులకు మార్గమందు ఆయాసమును, శ్రమను బాపునట్టి మందిరమును కట్టించి బాటసారుల శ్రమను తగ్గించు నరుడు పొందు పుణ్యావిశేషమును చెప్పుటకు బ్రహ్మకైనను అలవిగాదు. మధ్యాహ్నసమయమున అతిథిగా వచ్చిన విప్రునకు భోజనముపెట్టినవాని ఫలితము బ్రహ్మకైనను చెప్పుటకు శక్యము కాదు.

మహారాజా! అన్నదానము అన్నిదానములకంటె వెంటనే మనుష్యులను తృప్తిపరచును. కాన మూడులోకములందును అన్నముతో సమానమగు దానము లేదు. దారియందు అలసిపోయి శ్రమజెందిన విప్రుని కుశలమడిగి సమ్మానపూర్వకముగా భోజనముపెట్టిన యెడల వారి పుణ్యమును చెప్పుటకు బ్రహ్మదేవునకైనను శక్తి చాలదు. భార్య, సంతానము, ఇల్లు, వస్త్రము, భూషణములు, నగలు, యీ మొదలైనవి ప్రేమను కలిగించునవియైనను, ఆకటి బాధచే కుందువానికి పరమాసహ్యకరములుగా నుండును. భోజనము చేసి సంతుష్టుడైన వానికి మిక్కిలి ప్రీతిదాయకములగును. అందుచేత ప్రపంచమందు అన్నదానముతో సమానమగు దానము యిప్పుడు లేదు. ముందు ఉండబోదు. వైశాఖమాసమున ఎండవేడిమిచే తాపమును పొంది యలసివచ్చిన విప్రునకు అన్నమును పెట్టి ఆదరించని మానవుడు యీ లోకమందు పిశాచమైపుట్టి తన మాంసమును తానే భుజించును. కాబట్టి శక్తి ననుసరించి విప్రులకు వైశాఖ

మాసమున అన్నదానము చేయవలయును. తల్లిదండ్రుల నయినను మరువగలడుగాని అన్నముపెట్టి ఆదరించినవానిని మానవుడు మరువ జాలడు. అన్నాతురుడు అన్నమును భుజించిన సౌఖ్యము మిగుల శ్రేష్ఠముగాన మూడులోకములందును మానవులు అన్ని దానముల కంటె అన్నదానము మిక్కిలి మిన్నయైనదని కొనియాడుచుందురు. ప్రపంచమున జన్మకు కారణభూతులైన తల్లిదండ్రులు సామాన్యులు మాత్రమే యగుదురు. అన్నాతురునకు అన్నమునుపెట్టి పోషించు వారు నిజమైన తల్లిదండ్రులని విద్వాంసులు చెప్పుదురు. శత్రువులను జయింపగల అంబరీషమహారాజా! అన్నదానమును చేయువాని యందు సమస్తమైన తీర్థములు, సర్వదేవతలు, సర్వవిధ ధర్మములు నిలచియుండును.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమందు
నారదాంబరీష సంవాదమున రెండవ అధ్యాయము

## మూడవ అధ్యాయము

నారదుడు అంబరీషమహారాజునకు చెప్పుచున్నాడు. మహా రాజా! వైశాఖమాసమున తీవ్రమైన గాడ్పుల యందు చల్లనిగాలి వీచుచుండగా యేవిధమైన చక్కని సుఖశయ్యపై పరుండి మాన వుడు సుఖనిద్రను పొందునో అట్టి శయ్యాదానమును విప్రునకొసంగి వాని తాపమును బాపిన యెడల అతడు స్వర్గనివాసియై పరమసౌఖ్య మును పొందును. సమస్తమైన ధర్మములను చేయుటకు శరీరమే ప్రధానమైయున్నది. శరీరమే ఆరోగ్యవంతమై యుండవలెను. అట్టి శరీరారోగ్యమునకు, సౌఖ్యమునకు కారణభూతములు, భోజనశయ్యా

దులు. కాబట్టి భోజనమిడి శయ్య సమర్పి తాపమార్పి ఆదరించిన మానవుడు, తాపత్రయవర్జితుడై యోగీశ్వరులుకూడ పొందనేరని నాశరహితమైన వైకుంఠ ప్రాప్తిని చెందగలడు. వైశాఖమాసమున యెండవలన తాపమును పొంది అలసిన విప్రునకు తాపమార్పి, సుఖవంతమగు శయ్యనమర్పినవాడు జన్మము, మరణము, ముసలితనము లేక వైకుంఠమునందుండగలడు. విప్రుడు శయ్యను దానముగా గ్రహించి సదా సుఖమును పొందును.

మహారాజా! విప్రుడట్టి శయ్యపై విశ్రమించిన మాత్రమున, తెలిసిగాని, తెలియకగాని చేయబడిన పాపములు, దాతను విడిచి హారతికర్పూర మగ్నియందు హరించినటుల నిర్మూలమగును. విప్రుడు దానముగా గ్రహించిన శయ్యయందు నిద్రించిన యెడల దాత నాశరహితమైన బ్రహ్మానందమును పొందగలుగును. వైశాఖమాసమున సూర్యుడు మేషరాశియందుండగా ప్రాతఃకాలమున స్నానముచేసిన పుణ్యము కలుగునటుడు, విప్రునకు పరుండుటకు పరుపును దానమిచ్చిన యెడల దాత యొక్క వంశమువారందరును యేరోగమును లేక యీలోకమందు సమస్తసౌఖ్యములను పొంది దీర్ఘాయుర్దాయవంతులై, సంతతారోగ్యవంతులై, యథోచిత ధన, ధైర్య, యశస్సులను పొందగలుగుదురు. ఆవంశమందు నూరు పురుషాంతరములవరకు ధర్మములేనివాడు పుట్టనేరడు. పుట్టినను, సమస్తసుఖముల ననుభవించి అంత్యమందు స్వర్గసుఖమును పొందును. శ్రోత్రియుడైన విప్రునకు ఏమానవుడు తలగడదిండును దాన మొసంగునో, వాడు సర్వవిధపాపములనుండి విడువబడి బ్రహ్మానందమును పొందగలడు. మానవునకు సుఖము నిచ్చునది నిద్ర. అట్టి నిద్రనొసంగుటకు శయ్యసాధనము. గాన శయ్యాదాన మొసంగినందువలన దాత సర్వజీవాధారుడై భూలోకమం దఖండ సామ్రాజ్యమును పొందగలుగును.

అంబరీషమహారాజా! శయ్యను దానమిచ్చిన మానవుడు సదా సుఖవంతుడై, భోగవంతుడై, ధర్మాసక్తుడై, ఏడుజన్మలవరకు సర్వదిక్కులయందు దిగ్విజయమును పొంది జన్మాంతమందు ఏడు పురుషాంతరములవారిం గూడి బ్రహ్మలోకమున నివసింపగలడు. వైశాఖమాసమున యెండచే తపించువారికి విశ్రమించు నిమిత్తము ఎవడు తాటియాకులచే నిర్మింపబడిన చాపను అమర్చునో, అట్టి దాత మిక్కిలి గొప్పదైన పుణ్యమును పొందగలడు. ఏలననగా అట్టి చాపయందు శ్రీమహావిష్ణువు స్వతహాగా వచ్చి శయనించును.

గొడ్డివెంట్రుకలు నీటియందు పడినను; చిక్కుపడనేరవు. శయ్యాదానము చేసిన మానవుడును అట్లే సంసారసాగరమున బడి యున్నను బాధింపబడడు. శయ్యాదానము కాని ఆసనమును అమర్చుటగాని చేయలేనివాడు, చాపను దానమిచ్చిన యెడల దాత సర్వకాలములందును సుఖము ననుభవింపగలడు. వైశాఖమాసమున తాపమును పొందిన మానవుడు విశ్రమించు నిమిత్తము శయ్యను యాచించిన యెడల, శయ్య నివ్వజాలకపోయినను దృఢమైన చాపను దానమిచ్చినవాడు వెంటనే ముక్తిని పొందగలుగును. యిందు విషయమైన విచారణ చేయనవసరములేదు. లోకములో సమస్త దుఃఖములను మరపించునది నిద్రాసమయము. అట్టి నిద్రవలన సమస్త శ్రమలు నివారణ యగును. ఆ నిద్ర చాపయందు నిద్రించువానికి యెక్కువ సుఖమిచ్చును. మహారాజా! వైశాఖమాసమందు యే మానవుడు కంబళి దానము చేయుచున్నాడో వాడు అకాల మృత్యువువలనను, కాలమృత్యువువలనను కూడ విడువబడి నూఱు సంవత్సరములు ఆయుర్దాయముగలిగి జీవించును.

ఏ నరుడు యెండబాధచే తాపము పొందిన విప్రునకు పలుచగానున్న బట్టను దానముచేయునో వాడు పూర్తిగా ఆయుర్దా

యము గలవాడై అంత్యమందు పరమపద ప్రాప్తినందును. అంతర్గత మగు వేడిని నివారించునదియు, శ్రేష్ఠమైనదియు నగు హారతి కర్పూరమును బ్రాహ్మణునకు దానమిచ్చినవాడు, సర్వదుఃఖవివర్జితుడై ముక్తిని పొందగలడు. ఎవడు వైశాఖమాసమందు బ్రాహ్మణునకు పుష్పములను, కుంకుమను, దానముచేయునో వాడు చతుస్సముద్ర ముద్రితమైన భూమిని పాలింపగల చక్రవర్తియైలోకమంతయు తన స్వాధీనమందుంచుకొనగలడు. పుత్రపౌత్రాదుల పొంది భోగము లనుభవించి అంత్యమందు మోక్షపద ప్రాప్తినందగలడు. సామాన్య ముగా శరీరతాపమునుగాని అంతస్తాపమును గాని హరించుటకు మంచిగంధమును పూసికొనవలెను. కాబట్టి వైశాఖమాసమందు అట్టి చందనమును బ్రాహ్మణునకు పూసి వాని తాపమును పోగొట్టిన తాపత్రయాది దుఃఖములచే విడువబడి మోక్షసామ్రాజ్యమును పొందగలడు. మహారాజా! వైశాఖమాసమందు ఎండవేడిమిచేత పరితాపము బొందువానికి వట్టివేరు, సంపంగి, తుంగవేరు మొదలగు వానితో కలసిన నీటిని స్నానము చేయించు మానవుడు యిహలోక మందు దేవతాసహాయుడై సమస్త భోగభాగ్యములను పొంది పాప మును, విచారమును విడచి మోక్షపదప్రాప్తి నందగలడు.

వైశాఖమాసమాహాత్మ్యమును దెలిసినవాడు గోరోచనము, కస్తూరిదానము చేసిన యెడల తాపత్రయాది సంసారబంధములచే విడువబడి యుత్తమమైన బ్రహ్మానంద సుఖమును పొందగలడు. సూర్యుడు మేషరాశియందుండగా వైశాఖమాసమున ప్రాతఃకాల మున స్నానమాచరించి విప్రునకు తాంబూలము నిచ్చువాడు లోకాధి పతియై సర్వసౌఖ్యముల ననుభవించి యుత్తమమైన బ్రహ్మానంద సుఖ మును పొందగలడు. సూర్యుడు మేషరాశియందుండగా తామర పువ్వులతో నిర్మించిన దండగాని, అడవి మల్లెపుష్పములుగలదండగాని

బ్రాహ్మణునకు దాన మిచ్చిన యెడల ఆమానవుడు నాల్గుసముద్ర ములమధ్యను గల భూమండల మేలుచు అంత్యమున మోక్షమును పొందగలడు.

వైశాఖమాసము ప్రారంభించగానే మొగలిపువ్వులతోగాని, మల్లిపువ్వులతోగాని, దండలను నిర్మించి విప్రునకు దానమిచ్చినవానికి శ్రీ మహావిష్ణువు యనుగ్రహముచే మోక్షప్రాప్తినందగలడు. అంబ రీషమహారాజా! వైశాఖమాసమందు మేషసంక్రమణ కాలమున విప్రునికి పోక చెక్కలను పరిమళద్రవ్యములను దానము చేయువానికిని, కొబ్బరికాయలను దానము చేయువానికిని కలుగు పుణ్యవిశేషమును వివరించెదనువినుము. యీ విధముగా దానముచేయు మానవుడు యేడు జన్మములవరకు బ్రాహ్మణుడుగా పుట్టును. వేదశాస్త్రాది సంప న్నత్వము గలిగి జన్మాంతరమందు యేడు తరములవారితోగూడ వైకుంఠలోకప్రాప్తిని పొందగలడు. మహారాజా! విప్రమందిర మందు విశ్రాంతిమంటపమును నిర్మించిన దాతయొక్క పుణ్యవిశేష మును చెప్పుటకు నాకు శక్తిచాలదు. నీడనిచ్చునదియు, యిసుక తిన్నెలతోకూడినదియు, చలివేంద్రకలిగినదియు నగు విశ్రాంతి మంటపమును వైశాఖమాసమం దేనరుడు నిర్మించుచున్నాడో వాడీ భూలోకమందు చక్రవర్తియగును. రాజమార్గమునకు సమీపముగా తోటను నిర్మించుట చెఱువును త్రవ్వించుట, నూతిని యేర్పరచుట, మంటపమును కట్టించుట లోనగు సత్కార్యములను చేయువాడు పుత్రులు లేకుండినను, అతని ధర్మమే అతనిని రక్షించును. సప్త సంతానములు అనగా నుయ్యి త్రవ్వించుట, చెరువు నిర్మించుట, తోట నేర్పరచుట, మంటపమును కట్టించుట చలివేంద్రను బెట్టుట, సద్ధర్మముల నాచరించుట, పుత్రునిబడయుట వీనిలో నేవిజరిగించినను మానవునికి పరలోకసుఖము కలుగును. మంచి శాస్త్రవిశేషములను

వినుట, పుణ్యతీర్థములకు వెళ్ళుట, సత్పురుషులతో సహవాసము సల్పుట, నీరును యిచ్చుట, అన్నమునుబెట్టుట, రావిచెట్టును ప్రతిష్ఠ చేయుట, కుమారునికనుట యీ యేడువిధములైన సంతానములును ప్రశస్తములని వేదవేత్తలగు పండితులు చెప్పిరి. సంతానములేని వాడు అనేకధర్మము లాచరించినను, పుణ్యలోకప్రాప్తిని పొంద జాలడు. యీ యేడుసంతానములందును యేది కలిగినను పుణ్యలోక మును పొందగలడు.

పాపము, పుణ్యము అను విజ్ఞానములేని పశువులు, పక్షులు, మృగములు చెట్లు లోనగునవి సత్కర్మలను చేయనియెడల స్వర్గ సుఖమును పొందలేవు గాని జ్ఞానముగల మానవులుగానుండియు సత్కర్మల నాచరింపలేని పుణ్యలోకముల నెట్లు పొందనేర్తురు ? పోక చెక్కలు, తమలపాకులు, కర్పూరము, అగరు మొదలగు సుగంధ ద్రవ్యములతో కూడియున్న తాంబూలమును వైశాఖమాసమున ప్రాతఃకాలమున మేషసంక్రమణమందు బ్రాహ్మణునకు దానమిచ్చిన వాడు శరీరసంబంధమైన సర్వవిధపాపములచేత విడువబడుననుటకు సందియములేదు. తాంబూలదానము చేయువానికి కీర్తి, ధైర్యము, సంపద నిస్సందేహముగా వృద్ధి పొందును. రోగముగలవాడు తాంబూలదానము చేసినయెడల వానికారోగము హరించును. ఆరోగ్యవంతుడు తాంబూలదాన మాచరించినచో, వానికి మోక్ష ప్రాప్తి కలుగును.

వైశాఖమాసమందు ఎండవేడిమికి తాపము కలిగినవానికి చల్లని మజ్జిగను దాహముగా నిచ్చువానికి విద్యయు, ధనమును ప్రాప్తించును. దాహము గలిగిన సమయమందు మజ్జిగతో సమాన మైన దానము వేరొకటిలేదు. గాన మార్గాయాసమును పొంది అలసిన విప్రునకు దాహమునకు మజ్జిగనీయవలయును. ఆ మజ్జిగలో

నిమ్మపండ్ల రసమును ఉప్పును కూడా కలిపి దాహముగా నిచ్చిన, అరుచి దోషము పోవును. గాన అట్టిదానమువలన దాత మోక్షమును పొందగలడు. అంబరీషమహారాజా! వైశాఖమాసమందు మార్గాయాసమున డప్పిగొన్న విప్రునకు పెరుగును దానము చేసిన వాని పుణ్యఫలమును చెప్పుటకు నేను సమర్థుడనుకాను. విష్ణుప్రీతి యగు వైశాఖమాసమువందు ఉత్తమమైన తండులములను దానమిచ్చినవాడు పూర్ణాయుర్దాయువంతుడై అనేక యాగములు చేసినందువలన గలుగు ఫలమును పొందగలడు. కాంతిస్వరూపమైన ఆవునెయ్యి యీ వైశాఖమాసమున విప్రునకు దానమిచ్చినవాడు అశ్వమేధయాగఫలమును పొంది అంత్యమందు వైకుంఠప్రాప్తి నందును.

సూర్యుడు మేషరాశియందున్నప్పుడు వైశాఖమాసమున బెల్లము కలిపిన దోసకాయలను దానమిచ్చినవాడు అన్నిపాపముల చేత విడువబడి శ్వేతద్వీపమందు వసించును. పగటికాలమున ఎండ వేడిమిచేత తాపమును పొందిన విప్రునకు తాపోపశమనము నిమిత్తము చెఱకుగడను దానమిచ్చువాని పుణ్యము మితములేదని తెలియదగును. పానకమును దానమిచ్చినవాడు పాపముక్తుడై విష్ణుసాయుజ్యమును పొందగల్గును. మేషసంక్రమణకాలమున వైశాఖమాసమున విప్రునకు పండ్లు, పానకమును దానము చేసిన వానికి గల పితృదేవతలు అమృతమును పానముచేసిన రీతిని సంతోషింతురు. వైశాఖమాసమున బాగుగా పండిన మామిడిపండ్లరసమును కలిపిన పానకము దాహముగా నిచ్చిన దాతయొక్క సమస్త పాపములును నశించుననుటకు సందియములేదు. చైత్రబహుళ అమావాస్య రోజున పానకముతో నింపిన కలశమును విప్రునకు దానమిచ్చిన దాత గయలో నూఱుమాఱులు శ్రాద్ధకర్మను చేసిన ఫలితమును

పొందుచున్నాడు. కస్తూరి, కర్పూరము, మల్లెపువ్వులు, వట్టివేళ్ళు లోనగు పరిమళద్రవ్యమిళితమైన పానకమును నింపించిన కలశమును చైత్రబహుళ అమావాస్యాది దినమందు దాన మిచ్చు మానవుడు పితృదేవతలనిమిత్తము షణ్ణవతీశ్రాద్ధము చేసిన ఫలితమును పొంద గలడు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున మూడవ అధ్యాయము

## నాలుగవ అధ్యాయము

నారదుడు అంబరీషమహారాజుతో యిట్లు చెప్పదొడంగెను. మహారాజా! వైశాఖమాసమహాత్మ్యమును యింకను చెప్పు చున్నాను. వినుము. నూనెతో తలను అంటుకొనుట, పగటి యందు నిద్రించుట, కంచుపాత్రయందు భుజించుట, మంచమున పరుండుట, యింటియందు స్నానముచేయుట నిషేధింపబడిన భోజన పదార్థములను తినుట, దినమునకు రెండు మారులు భుజిం చుట, పగటిభోజనముమాని రాత్రియందు భుజించుట అను యీ యెనిమిదిపనులను వైశాఖమాసమున వర్జింపవలెను. వైశాఖమాసవ్రతము నాచరించువాడు తామరాకునందు భోజనము చేసిన యెడల అన్నిపాపములచేత విడువబడి వైకుంఠమును చేరగలడు. వైశాఖమాసమున మధ్యాహ్నసమయమున అలసి తాపముచెందిన విప్రుల పాదములను నీటితో కడిగిన యెడల, అన్నివ్రతములలో నుత్తమవ్రత మాచరించిన రీతిగా నెంచబడును. ప్రయాణముచేత మార్గాయాసమున అలసి తాపముచెంది విశ్రాంతికై తన యింటికి

వచ్చిన బ్రాహ్మణుని మంచిపీఠమందు కూర్చుండజేసి పాదములను కడిగి యా నీటిని శిరస్సున ధరించినయెడల సమస్తమైన సంసార బంధములచేత విడువబడినవాడై గంగ మొదలైన సర్వతీర్థముల యందు స్నానముచేసిన ఫలితమును పొందగలడు. వైశాఖమాసమున ఉదయకాలమందు స్నానమును చేయకపోయినను, ఆకులనుతినకయు, యే మానవుడు గడపునో వాడు గాడిద యోనియందు జన్మించును. తిరిగి కంచరగాడిదెగా పుట్టును.

బలమైన శరీరముకలిగి రోగము లేక ఆరోగ్యవంతుడై యున్న మానవుడు వైశాఖమాసమందు చెఱువు, కాలువ మొదలగు వానియందు స్నానమును చేయక యింటిలో బిందెలయందుండు నీటితో స్నానమాచరించువాడు చండాలుడై పుట్టును. అంబరీష మహారాజా! వైశాఖమాసమున సూర్యుడు మేషరాశియందుండగా చెఱువు, కాలువ మొదలగు వానియందు స్నానము చేయనివాడు నూఱుజన్మలు కుక్కగా పుట్టును. వైశాఖమాసమున ఉదయకాల మందు స్నానమును చేయకయు, దానములను యివ్వకయు, వ్యర్థ ముగా గడపిన మానవుడు పిశాచముగా పుట్టి వైశాఖమాహాత్మ్య మును విని దానిఫలితమును పొందువరకు దుర్గతిని పొందుచుండును. లోభముచేత వైశాఖమాసమున అన్నముగాని, నీటినిగాని యివ్వక యుండు మానవుడు పాపమును, దుఃఖమును పోగొట్టుకొనజాలడు. వైశాఖమాసమున విష్ణుభక్తిగలిగి ప్రాతఃకాలమున నదిలో స్నాన మాచరించినవాడు మూడుజన్మలయందు చేసినపాపమును పోగొట్టు కొనుటకు సందియములేదు.

సముద్రమునకు ప్రవహించు నదిలో సూర్యోదయకాలమున ప్రాతఃకాలమునందు ఎవడు స్నానమాచరించునో వాడు యేడు జన్మములయందు చేసినపాపములచేత విడువబడును. జాహ్నవి, వృద్ధ

గంగ, కాళింది, సరస్వతి, కావేరి, నర్మద, కృష్ణవేణి అని గంగా నది యేడువిధములై యున్నది. ఆ గంగయొక్క యేడునదులయందు ప్రాతఃకాలమున స్నానముచేయు మానవుడు కోటిజన్మలయందు చేయబడిన పాపములచేత విడువబడును. దేవతలచేత త్రవ్వబడినటు వంటి దగు సముద్రములోనగు వానియందు వైశాఖమాసమున ఉదయమున స్నానమాడినవాడు తాను జన్మప్రభృతి నదాదిగా చేసి యున్న పాపములన్నిటినుండి ముక్తుడగును. వైశాఖమాసమున ప్రాతఃకాలమునందు దిగుడుబావియందు స్నానమాచరించు మానవుడు సమస్తపాపములచేతను విడువబడును. గోవుపాదము మునుగు నంతటి నీటిగుంటయైనను బహిర్జలములయందు గంగ మొదలగు దివ్య నదులన్నియు ప్రసన్నములై యుండునని నిశ్చయమును తెలుసుకుని వైశాఖమాసమున ఉదయమందు స్నానముచేయువాడు సమస్త తీర్థములయందు స్నానమాడినందువలన గలుగు పుణ్యము కంటె మిక్కిలి యెక్కువ ఫలితమును పొందుచున్నాడు. అంబరీషమహా రాజా! ఏవిధముగా రసవస్తువులందు పాలు శ్రేష్ఠమో, ఆ పాలకంటె పెరుగు అధికమో, పెరుగుకంటె నెయ్యి ఎక్కువైనదో, అట్లే మాసము లన్నిటిలో కార్తీకమాస ముత్తమమైనది. ఆ కార్తీక మాసము కంటె మాఘమాసము మిక్కిలి శ్రేష్ఠమైనది. మాఘ మాసముకంటె వైశాఖమాసము ఉత్తమమైనది. అందువలన యీ వైశాఖమాసమందు మానవుడు చేయు సత్కర్మలు, ధర్మములు, మఱ్ఱివిత్తువలె వృద్ధిని పొందును. భాగ్యవంతుడు కాని దరిద్రుడు గాని స్వతంత్రుడుగాని పరాధీనుడుగాని యెవడైనను సరే యేవస్తువు తనకు లభ్యమగునో ఆపదార్థమును విప్రునకు దానముగా నివ్వ వలెను. మానవులు ఆహారముగా భుజించు పదార్థములు, దుంపలు, పండ్లు, కూరలు, ఉప్పు, బెల్లము, రేగుపళ్ళు, నీరు , వేళ్ళు, ఆకులు,

మజ్జిగ లోనగునవి యేవి దాన మిచ్చినను దానివలన మితిలేని ఫలితము కలుగును. బ్రహ్మదేవుడు మొదలగు ముప్పదిమూడు కోట్ల దేవతలు గూడ పూర్వజన్మమందు మంచి కర్మలను, ధర్మములను చేయనియెడల, వారికి యీ జన్మమున మంచి కలుగనేరదు. దానము చేయనివాడు దరిద్రుడు అగును. ఆదరిద్రము వలన పాపము సంక్రమించును. ఆపాపమువలన నరకమును పొందగల్గును. అందువలన సుఖమును అభిలషించువాడు సదా ధర్మకార్యములనే చేయుచుండవలెను.

ఇంటియందు సర్వవిధ లక్షణములచేతను అలంకరించి, పటములను అందముగా నుంచినను, పైకప్పు లేనంతమాత్రమున ఉపయోగము లేక అందవిహీనమై ప్రకాశింపవో అట్లే అన్ని నెలలయందును సమస్త ధర్మములను ఆచరించినను యీ వైశాఖమందు వ్రత మాచరింపనిచో అది వ్యర్థమగును. ఆడుది అన్ని విధములైన వనితాలక్షణములు గలిగి సుమంగళియై పతిప్రేమాస్పదురాలైనను, యీ వైశాఖమాస వ్రతము చేయనిదే వ్యర్థురాలే కాగలదు. మానవు డనేకవిధశుభగుణములను కలిగియున్నను దయారహితుడు రాణించనట్లు, వైశాఖమాసవ్రతము ఆచరింపక యెన్ని వ్రతములు చేసినను వ్యర్థమేగాని ప్రయోజనములేదు. సమస్తమైన రుచులతో కూడినదైనను కూర ఉప్పులేక యేప్రకారముగా రుచింపదో, వైశాఖమాసవ్రతము చేయని యెడల యెన్ని సత్కార్యము లాచరించినను ఫలితము నీయజాలదు అంబరీషమహారాజా! స్త్రీ బహువిధాలంకారములు గలిగి సుందరవతియై యున్నను వస్త్రమును ధరింపక యేవిధముగా రాణింపదో మనుజుడు అనేకమైన సత్కర్మలు చేసినను వైశాఖమాసవ్రతముచేయనిదే ప్రకాశింపనేరదు. ఏ ప్రాణికైనను అన్నివిధములైన ప్రయత్నములచేతను వైశాఖమాసమున ధర్మము

ఆచరించుట విధియైయున్నదని ధర్మశాస్త్రము నెరింగినవారి అభిప్రాయము. శ్రీహరి ప్రీతికొరకై వైశాఖమాసమున ప్రాతఃకాలమున సూర్యుడు మేషరాశియందుండగా స్నానమాచరించి శ్రీహరిని ప్రార్థింపవలయును అట్లుచేయని మనుజుడు నరకమును పొందుననుటకు సందేహములేదు. వైశాఖమాసమునకు అధిదేవత శ్రీహరి. ఆనెల ఫలితము తీర్థయాత్ర, తపము, యజ్ఞము, దానము, హోమము యిత్యాది సత్కర్మలనాచరించిన ఫలితము కంటె అధికమయినది. వైశాఖమాసమున ప్రాతఃకాలమున సూర్యుడు మేషరాశియందుండగా దేవతాప్రభువగు మధుసూదనా! యీ సమయమున నేను నిన్ను తలంచి స్నానము చేయుచున్నాను. కాబట్టి యే ఆటంకమును కలుగనీయక నా వ్రతమును నడుపుము. అని శ్రీహరిని గూర్చి ప్రార్థింపవలయును. పిమ్మట ఓ రమాధవా! యీ సమయమున స్నానమునం దాసక్తిగలవాడనై నీకొరకు అర్ఘ్యప్రదానము చేయుచున్నాడను. స్వీకరింపుము గంగాది మహానదులారా! సమస్త పుణ్యతీర్థములారా! సర్వమయిన సరస్సులారా! మిమ్ము తలంచి నేను శ్రద్ధాభక్తులతో అర్ఘ్యప్రదానము చేయుచున్నాను. స్వీకరించి కరుణింపుడు. మధుసూదనా! సర్వదేవతలలో నీవు ఉత్తముడవు. పాపులను శిక్షించి జీవులనందరను పరిపాలించువాడవు, అన్నిభూతములయందును సమానమైన దయగలవాడవు. కాబట్టి నేజేయు యర్ఘ్యప్రదానమును స్వీకరించి నన్ను అనుగ్రహింపుము. నా వ్రతమునకు ఫలితము నిమ్ము అని మూడుమారులు యర్ఘ్యము నిచ్చి తిరిగి స్నానమాడవలెను. ఆపిమ్మట ఉతికినటువంటి పరిశుద్ధమైన బట్టలను కట్టుకొని సంధ్యావందనము మొదలైన నిత్యకర్మలను నెరవేర్చుకొని వికసించిన పువ్వులను దెచ్చి శ్రీహరిని పూజించి ప్రశంసనీయమగు శ్రేష్ఠంబగు విష్ణుకథ నేదైన వినినయెడల అనేకవేల జన్మలయందు చేసిన మహాపాపములు కూడ నశించి మోక్షమును కలుగజేయును.

వైకుంఠమునందుగాని, భూలోకమునందుగాని, పాతాళలోకమందుగాని, యెప్పుడును, యేవిధముగాను మానవుడు యీ వైశాఖ మాసవ్రత మాచరించినందువలన విచారమును పొందనేరడు. గర్భ నరకమును అనుభవించుటగాని, స్తన్యపానమును జేయు శిశువుగా జన్మించుటగానిజరుగనేరదు. వైశాఖమాసమున ఏమానవుడు ప్రాతః కాలమునందు స్నానముచేయక విష్ణుప్రీతిగా దానముచేయక హరి కథలను వినక, కంచమునందు అన్నము తినుచు, కాలమును గడపునో వాడు నరకలోకమున శాశ్వతముగా నివసించును. వైశాఖ మాసమందు ప్రాతఃకాలమున స్నానము చేయని మానవుడు బ్రహ్మ హత్యాది మహాపాతకములనైనా నివారించుకొనగలడు గాని యీ పాపమును పోగొట్టుకొన సమర్థుడుకాడు. ప్రతి మనుజుడును తన దేహమునం దేవిధమైన రుగ్మతయు లేక ధర్మకార్యాచరణమునకు తగియుండగా అనుకూలమైన బహిర్జలములయందు స్నానమాచరించ వలయును. నాలుక, సరియగు స్థితియందున్నప్పుడే విష్ణుసంకీర్తనము చేయవలయును. వృద్ధాప్యముచేత యింద్రియములు స్వాధీనము తప్పినపిమ్మట యే మానవుడును భగవంతుని ధ్యానింపలేడు. వైశాఖ మాసమున సూర్యోదయకాలమందు స్నానము చేయకయుండు దుర్మార్గుడు బ్రతికియున్నను చచ్చినవాడే యగుననుటలో సందియము లేదు. ఏదోవిధముగా వైశాఖమాసమున శ్రీహరిని పూజించని మనుజుడు అజ్ఞానావృతుడై పందిజన్మమును పొందును. వైశాఖ మాసమున శ్రీహరిని తులసీదళములచే సూర్యోదయకాలమందు పూజించినవాడు చతుస్సముద్రముద్రితమైన భూమండలమును పరిపాలించు చక్రవర్తియగును. మరియు కోటిజన్మములవరకు సిరిసంపదలతో తులతూగుచు పిమ్మట కోటి పురుషాంతరములవారితో కలిసి వైకుంఠమును చేరి విష్ణుదేవునితో నైక్యమును పొందును.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమందు నారదాంబరీష సంవాదమున నాల్గవఅధ్యాయము

# అయిదవ అధ్యాయము

నారదుడు అంబరీషునితో చెప్పుచున్నాడు. సమస్తమును తెలిసిన అంబరీషమహారాజా! అనేకమయిన వ్రతములయొక్క ధర్మవిశేషములకంటెను తపస్సుయొక్క ఫలితము కంటెను, అన్నినెలలకంటెను, సమస్తమైన దానములకంటెను మిక్కిలి యెక్కువగా యీ వైశాఖమాస మేలపరిగణింపబడుచున్నదో వివరించి చెప్పుచున్నాను. శాంత మనస్కుడవై వినుము.

పూర్వకాలమున సృష్టియొక్క అంతమందు దేవతలలో అధికుడును, ఆదిశేషువునందు శయనించువాడును, మహాప్రభువును అగు శ్రీహరి, తన యొక్క విభూతి సంపదచేతను, యోగమాయాశక్తి చేతను యీ లోకమందుగల ప్రాణికోటినెల్ల తనయందైక్యతచేసి, అట్టి కుక్షిగత లోకసంఘమునంతను రక్షించుచు, ప్రళయకాలమునందు సర్వత్రవ్యాప్తమైయున్న సముద్రమునందు పరుండును. ఆ శ్రీహరి నిద్రపూర్తికాగానే వేదముచేత మేల్కొలుపబడి దయాస్వరూపుడై కుక్షిగత జీవసంఘమును రక్షించును. ఆ జీవసంఘమును వారి వారి కర్మల ననుసరించి మరల సృజింపవలెనను వాంఛ జనింపగనే, ఆ శ్రీహరి యొక్క నాభినుండి సర్వలోకములతో కూడియున్న బంగారు వికారమైన పద్మము పుట్టును. రమాధవుడు, ఆపద్మము నుండి, పురుషుడు అను సంజ్ఞతో విరాజమానుడైన బ్రహ్మదేవుని, పదునాల్గులోకములను గూడ సృజించెను. జీవములన్నియు, తమ తమ కర్మలననుసరించి, ఆయాఫలితముల కనుకూలముగా అనేక విధములుగాను, సత్వరజస్తమోగుణములుగాను, మాయచేత లోకములందు ప్రభువులుగాను, వారి కనువగు పాలనాపద్ధతులను, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను వర్ణవిభాగములను, బ్రహ్మ

చర్య, గార్హస్థ్య వానప్రస్థ సన్యాసాశ్రమాది విభాగములను, వివిధ మగు ధర్మనిర్ణయములను శ్రీహరి యేర్పఱచును. ఆరమాకాంతుడు ధర్మసంరక్షణార్థమై చతుర్వేదములను, తంత్రములను, సంహితలను, స్మృతులను, పురాణములను, తన్నాశ్రయించియున్న యితిహాసము లను అభ్యసించి అనుసరించునట్లుగా ముని బృందమునంతను సృజిం చెను. ఆముని సంఘము అనుసరించి ఆచరించు చతుర్వర్గ విభాగ రూపకమైన ధర్మములను మనుష్యులు నడపించుచు, తమకు అను కూలమగు శ్రీహరి యొక్క ధర్మములను ఆచరింపుచుండిరి. నాశన రహితమైన శ్రీమహావిష్ణువు సమస్తజీవకోటుల మనసులందునను తనచే నేర్పరుపబడిన ధర్మము లెట్లు నడుచుచున్నవో పరీక్ష చేయు కోరి కతో తన యాశ్రమములనుచూచుటకై వచ్చును. విశేషమైనట్టియు, యోగ్యమైనట్టియు ధర్మములను, మానవు లేరీతిగా నెప్పుడు చేయ గలరో ఆకాలమును శ్రీమహావిష్ణువు నిర్ణయించును. కాలము లన్నిటి యందు వర్షాకాలము నాచే సృజింపబడిన దైనను ధర్మమాచరించు టకు మానవకోటికి అనుకూలముగాక, నదులయందు కాలువలందు బురద మొదలగు కష్టములను పొంది, పాపకాశముగా ధర్మకర్మము లను నిర్వహింపజాలకున్నారు. అందువలన వర్షాకాలము నాకు కోపము కలిగించుచున్నది. ఆకాలమున ధర్మకార్యములను జేయు నరులను గాంచినను నాకు తృప్తిలేదు. అట్టివారిని జూచినందువలన అతడు మోక్షమియ్యవలసి యుండును. అందువలన వారిని జూడ కుండుటయే ఉత్తమమని శ్రీహరి తనమనంబున తలచుచుండును.

శరత్కాలమందు మనుజులు సత్కర్మలచేసి ఫలితమును పొందు కృషి పూర్తిగా నిర్వహింపజాలరు. బాగా పండినపండ్లను తినుటయందు కోరిక గలిగియుందురు. కండ్లరోగములచే బాధపడు చుందురు. కొందరు చలిచేత బాధపడుచుందురు, అట్టివారిని జూచి

బాధనొందుటయు, కోపగించుకొనుటయు జరుగునే కాని ప్రేమ నెట్లు జూపగల్గుదును? హేమంతఋతువునందు మానవులకు ప్రాతఃకాలమున లేచుటకు చలిబాధ మిక్కుటమైయుండును. సూర్యోదయమైనను లేవలేక పరుండియుండువారిని జూచి నాకు మిగుల కోపము కలుగును. శిశిరఋతువున కూడ జనులు చలిబాధచేత శ్రమపడుచుందురు. పరిపక్వమైన పండ్లను తినుటయందు ఆసక్తులై యుందురు. శీతకాలమున కూడ ప్రాతఃకాలమున చలిబాధవలన స్నాన మాచరించుటకు మనుజు లిష్టపడరు. అందువలన కర్మ లోపించునుగాని సరిపోదు. దీనింబట్టి చూడగా వర్షకాలము మొదలు శిశిరఋతువు వరకు జనులు ధర్మకార్యాచరణమునకు తగు కాలము కాదనియు ఆ సమయమున తాను జూచుటవలన ప్రయోజనము లేదనియు భగవంతుడు తలంచి వసంతఋతువునం దిట్టి యాటంకములు కలుగనేరవనియు, అది యుక్తమైన ధర్మకార్యాచరణకు తగునని యు వైశాఖ మాసము ప్రీతికరముగా నేర్పరచెను.

వసంతఋతువునందు స్నానముచేయుట, దానమిచ్చుట, యాగ మొనర్చుట, సుఖము ననుభవించుట, మొదలగు అనేకవిధ ధర్మములను మనుజు లాచరింపదగును. సర్వవిధప్రాణులకును అవసరమగు వస్తువులు యీ ఋతువునందు లభ్యమగును. దొరకిన పదార్థములతో తృప్తిని పొందగల్గుదురు. అట్లు సులభముగా లభ్యమగుచున్న వస్తువులతో శ్రీహరికి ప్రీతిని కలిగించు కార్యములను, ధర్మములను దానములను చేయుటకును వీలగును కుంటివాడు లోనగు అంగవికారము కలవారలకు, ధనము లేనివారికి, మహాత్ములకు, వివరింప నేల! సమస్తజీవకోటికిని నీరు మొదలు సర్వవిధ వస్తువులును అతి సునాయాసముగా లభ్యమగును కాబట్టి నాయందు భక్తికలవారు యీ వస్తుసముదాయముతో నన్ను సంతృప్తిపరుపగలరు,

వసంతఋతువునందు గృహమున కతిథిగావచ్చి యున్న విప్రులను ఆకులచేతను, పువ్వులచేతను, పండ్లచేతను, కూరలచేతను, ప్రియభాషణముల చేతను పూలమాలికల చేతను, తాంబూలము చేతను, మంచిగంధము లోనగు పరిమళద్రవ్యములచేతను, పాదప్రక్షాళనాది పరిచర్యలచేతను, నమస్కారాది వినయగౌరవములచేతను పూజింపు మానవులకు కోరినవరము లిచ్చి ప్రీతితో జూడగల్గుదునని భగవానుడైన శ్రీహరి కాంతారత్నమగు లక్ష్మీదేవితో పలికి, యామెంగూడి ప్రయాణమై వెడలెను.

పుష్పించిన పువ్వులతోడను, సంతోషము బలముగలిగి యుండు మనుజులతోడను, పూజింపదగి ఘనతను గలిగిన ఆశ్రమములతోడను విరాజిల్లు వనములను జూచుచు, పల్లెలయందు యిండ్ల ముందు గల రమ్యమైన వాకిళ్ళను, అందమగు తోటలను, లక్ష్మీదేవికి శ్రీహరి చూపించుచు దేవతలు, మునులు, సిద్ధులు, చారణులు, గంధర్వగరుడోరగ కిన్నరులు రాక్షసులు లోనగువారిచే ప్రార్థింపబడుచు విప్రులు మొదలగు నాలుగువర్ణములవారిని బ్రహ్మచర్యాది నాల్గు ఆశ్రమములవారిని జూచుచు ప్రయాణము సాగించుచుండెను.

ఈరీతిగా విష్ణుమూర్తి రమాదేవిం గూడి సమస్త దేవతాకోటి తన్ను సేవింప మీనరాశి మొదలు కర్కాటరాశివరకు అనగా చైత్రము మొదలు ఆషాఢమాసాంతమువరకు భూలోకమున సంచారము చేయుచు, తనకు ప్రీతిని కలిగించు సత్కర్మాచరణమును చేయువారిని, చేయనివారిని గమనించుచు తనకు తృప్తిని కలిగించు వ్రతముల నాచరించు భక్తబృందమునకు కోరికలను యిచ్చుచున్నాడు, అట్లు తనయందు భక్తిలేక తనకు ప్రీతికరమగు సత్కర్మలనుచేయని మనుజులను నీచముగా చూచి వారి యాయుర్దాయమును తగ్గించుచున్నాడు. వైశాఖమాసమున పరమాత్మస్వరూపుడైన శ్రీహరి

యొక్కయు, విగ్రహముల యొక్కయు, సజ్జనులయొక్కయు, పూజలను చేసినవాడు యితరమైన నెలలం దేకర్మలను చేయకయుండినను, శ్రీహరి వాని నన్నిటిని పూర్తిచేసి సంతుష్టుడగును. సాధారణముగా పరదేశమునుండి వచ్చు చక్రవర్తికి సామంతాది ప్రజ యెదురేగి, కానుకలొసంగి, స్తోత్రముల నొనర్చి గౌరవించి పూజించి వాని వలన తిరిగి అప్పనముల గ్రహించియు, బిరుదులపొందియు, యిచ్చిన దాని కంటె ఘనముగా వాని వలన పొందునట్లును, తనకట్లు మర్యాద చేయని వారిని దండనీయులుగా భావించి శిక్షించునట్లును, రమాధవుడైన మాధవుడు వైశాఖమాసమున తనకు ప్రీతిని కలిగించు పూజను గావించువారిని భక్తులుగా దలంచి వారు కోరిన వరముల నిచ్చును. అట్లు విష్ణు ప్రీతికరమైన పూజను చేయనివారి యొక్క సంపదలను నశింపజేసి ఆయుర్దాయమును హరించును. ధర్మరక్షకుడును, దేవదేవుండును శార్ఙ్గధారియు, మహాభాగుండును, అగు శ్రీహరి పరీక్షసేయు కాలము కావున వైశాఖమాసము పన్నెండు మాసములందును మిక్కిలి శ్రేష్ఠమైనదై యున్నది.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున అయిదవ అధ్యాయము

## ఆఱవ అధ్యాయము

నారదమహర్షి అంబరీష మహారాజుతో యీరీతిగా చెప్ప సాగెను. మహారాజా ! వైశాఖమాసమందు రాజబాటను పోవుచు మార్గాయాసమున బడలికచే యెండవేడిమికి తాలజాలక తాపము

పొంది దప్పికతో బాధపడు వానికి నీటిని త్రాగుటకు నీయని వాడు నీచపశుజన్మ నెత్తుననుటకు సందియములేదు. ఇట్లు దాహమునకు నీటిని దానమిచ్చు విషయమున జరిగిన పూర్వ కథను, యాశ్చర్యకరమైనందున నిదర్శనముగా జెప్పుచున్నాను వినుము. ఇది విప్రునకును బల్లికి జరిగిన విషయము. దాని నిప్పుడు వివరింతును.

పూర్వకాలమునందు విప్రులయందు భక్తిగలిగి, త్యాగశీలుడై, శత్రువులను జయించి యింద్రియనిగ్రహముగలిగిన హేమాంగుడను రాజపుంగవు డిక్ష్వాకువంశమందు పుట్టెను. ఆ రాజు భూమియందు గల రేణువులతోడను, నీటియందు బిందువులెన్నియుండునో, ఆకాశమందు గల నక్షత్రము లెన్నిగలవో వానితోడను సమమగు గోదానములను చేసెను. ఆ రాజు చేసినయాగములయం దుపయోగించిన దర్భలతో భూమండలమంతయు నిండియుండెను. గోదానము, భూదానము, తిలదానము, సువర్ణదానము మొదలగు పదునాఱు మహాదానములచేత అనేకవేల విప్రులను సంతృప్తుల జేసెను. అంబరీషమహారాజా! ఆతను చేయని దానము లేనేలేదు కాని సులభముగా చేయదగిన జలదానము మాత్రము చేయలేదు. బ్రహ్మమానసపుత్రుండైన వసిష్ఠముని చంద్రుడు వైశాఖమాసమున తప్పక జలదానమును చేయవలెనని చెప్పినను నీరు సులభముగా సర్వత్ర దొరకునుగదా! దానికి వెలలేదుకదా! దీని నిచ్చినందువలన కలుగు ఫలితమేమి? అని మూర్ఖపుయుక్తుల నుపయోగించి దుర్బుద్ధి గలవాడై హేమాంగుడు జలదానమును చేయలేదు. ఎచ్చటను దొరకని వస్తువును యిచ్చినయెడల పుణ్యము కలుగును. అట్లే ఎచ్చటను పూజలను పొందనివారిని పూజించిన ఫలితముండును అను యుక్తు లుపయోగించి హేమాంగుడు వికలాంగులైన విప్రులను, దరిద్రులను, అనాచారము గలవారిని పూజింపుచు శ్రోత్రియు

లను, బ్రహ్మవిదులను, తత్వవేత్తలను విప్రులను పూజించుట మాని వేసెను.

లోకమునందు సామాన్యముగా మానవులందరును కీర్తివంతు లగు సజ్జనులనే పూజింపవలెనను నుద్దేశముతో నుందురు కాని అనాధులను, చదువులేనివారిని, అవయవహీనులను, దరిద్రులను, విప్రులను పూజింపరు. అట్లు పూజింపనిచో వారికి గతియేమి? అందు వలన అట్టి వారియందే నాకు ప్రేమకలదు. అని దుస్స్వభావముతో యోగ్యులు కానివారిని పూజింపుచు సత్పాత్రులగు విప్రులను పూజింపక వారలకు దానధర్మములు చేయకయుండెను. ఆ హేమాంగు డీవిధముగా నెన్ని దానములు చేసినను, యుక్తరీతిని చేయనందునను, వైశాఖమాసమందు జలదానము చేయనందు వలనను, మహాపాపమునకు పాల్పడి మూడుజన్మలవరకు వానకోయిల గాను, పిమ్మట ఒక జన్మమున గ్రద్దగాను. ఆ పిమ్మట ఏడు జన్మల వరకు కుక్కగాను జన్మించెను.

అంబరీష మహారాజా! పిమ్మట ఆ హేమాంగుడు మిథిలా రాజ్యమునకు రాజగు శ్రుతికీర్తి యను రాజుయింట బల్లిగాపుట్టెను. దుర్మార్గుడైన ఆ హేమాంగుడు బల్లియై మిథిలానగరాధిపతి యగు శ్రుతకీర్తి మహారాజుయొక్క ముందువాకిలిలో రాజవీధికి సమీప ముగా నుండు గోపురద్వారమునందుండి అక్కడ సంచరించు ఈగలు, పురుగులు మొదలగువానిని దినుచు, ఎనుబదియేడు సంవత్సరములు జీవించెను. ఈ రీతిగా నుండగా ఒకప్పుడు విదేహ రాజ్యమునకు యేలికయగు శ్రుతకీర్తి యింటికి శ్రుతదేవు డను మునిపుంగవుడు మార్గాయాసమున అలసి, మధ్యాహ్నసమయ మగుటవలన విశ్రమించుటకు వచ్చెను. శ్రుతకీర్తి మహారాజు వచ్చిన శ్రుతదేవుని జూచి చాలా సంతోషించినవాడై వెంటనే లేచి

యెదురుగా జని వానిం దెచ్చి సుఖాసీనుం జేసి మధుపర్కము, అర్ఘ్య పాద్యాదిపూజాద్రవ్యముల చేత పూజించి, పాదములను కడిగి ఆనీటిని తన తలపై వెంటనే జల్లుకొనెను. ఆరాజు అట్లు శిరస్సున నీటిని జల్లుకొనునపుడు ఆ నీటిబిందువులు కొన్ని దైవయోగమున ఆ వాకిలి యందున్న బల్లిమీద పడెను.

ఆ బల్లిరూపమున నున్న హేమాంగుడు ఆ జలబిందువులు మీదపడినంతమాత్రమున జ్ఞానము కలిగి పూర్వజన్మములందు తాను జేసిన హీనపుణ్యములను తలచుకొని విచారించి విప్రుని చూచి తన్ను రక్షింపుమని పలువిధముల ప్రార్థించెను. విప్రుడా మానవ వాక్కుతో పలికిన బల్లి పలుకులను విని ఆశ్చర్యమును పొంది బల్లీ! ఏపాపకర్మములవలన నీకు యీ విధమైన జన్మము సంభవించినది? ఏల మొఱలిడుచున్నావు? నీవు దేవతవా? పురుషుడవా? రాజువా? విప్రుడవా? మహానుభావుడవా! ఎందులకు నీ కిట్టి యవస్థకలిగినది? నే నిప్పుడే నిన్ని కష్టమునుండి తొలగింతును. అని పలుకగా బల్లి అవక్య ప్రజ్ఞాదేవుడగు శ్రుత దేవునితో యిట్లు చెప్పెను. మహాభాగా! నేను ఇక్ష్వాకువంశమున పుట్టినవాడను. వేదములందును శాస్త్రము లందును మిక్కిలి ప్రజ్ఞకలిగియుంటిని. భూమి యెన్ని కణికలగునో. నీరు యెన్ని జలబిందువులగునో, ఆకాశమునం దెన్ని నక్షత్రము లుండునో అన్ని గోదానములను చేసితిని. అనేకమగు యాగములను చేసితిని. చెఱువులు త్రవ్వించితిని. తోటలను వేయించితిని. అనేక సత్కర్మలను చేసితిని. అనేక విధములగు దానములను చేసితిని. ధర్మము దప్పక రాజ్యమును బాలించితిని. ఈరీతిగా సత్కర్మలనే చేసి ధర్మానుసారముగా రాజ్యమేలినను పుణ్యలోకప్రాప్తి లేక పాపముల ననుభవించుచు, మూడు జన్మములందు వానకోయిలగాను, ఒక జన్మమున గ్రద్దగాను, ఏడు జన్మములందు కుక్కగాను,

యిప్పుడు బల్లిగా పుట్టితిని. ఇప్పుడు శ్రుతకీర్తిమహారాజు మీా పాదములను కడిగి శిరముపై జల్లుకొనిన జలబిందువులు చిలికి నాపై బడుట వలన నాకు పూర్వజ్ఞానము కలిగి పాపము తొలగి యజ్ఞానమునుండి విడువబడితిని. శ్రుతదేవా! ఇంకను యీ బల్లి జన్మమందు యిరువది యెనిమిది సారులు పుట్టవలసినదిగా భగవన్నిర్దిష్టముగా నాకు గోచరించుచున్నది. ఆజన్మముల నెట్లు తప్పించుకొందునని భయమొందుచున్నాను. వీనిని నివారించుకొను యుపాయమును తెలిసికొనజాలు సమర్థత నాకు లేదు. గాన మీారా సదుపాయమును విస్తరింపుడని బల్లి శ్రుతదేవునితో పలుకగా నాతడు తన దివ్యదృష్టిచే యావద్విషయములును గ్రహించి యిట్లు చెప్పదొడంగెను. రాజా! నీకు యిట్టి నీచావస్థకలుగుటకు కారణమును చెప్పుచున్నాను. వినుము. నీవు పూర్వమందు రాజవైయున్నప్పుడు యెన్ని సత్కర్మలైనను చేసితివిగాని శ్రీహరి ప్రీతికరముగునటుల వైశాఖ మాసమందు విప్రునికి జలదానమును చేయమఱచితివి. నీరు సర్వత్ర సులభముగా లభింపగలదనియు, వెలయధికముగాని వస్తువనియు, నమ్మి మార్గాయాసముచే నలసి విశ్రాంతికై వచ్చిన విప్రునికైనను ధర్మము నాచరింపవలసిన కాలముననైనను జలదానము చేసితివి కావు. అగ్నికార్యమును చేయదలచినవాడు అగ్నిహోత్రము ప్రజ్వలింపుచుండగా దానినివదలి, వేరే బూడిదయందు అగ్నిహోమమును జేసినటులనే నీవు చేసిన ధర్మములు సత్పాత్రులగు విప్రులకు దానమీాయక యోగ్యులు కానివారికి దానము లిచ్చితివి. బహువిధముల చేత అలంకరింపబడి, అనేకరీతుల పరిమళాది సుగుణములను కలిగి యున్నను, ముండ్లకంపలచే చుట్టబడియున్న యెడల యెవరును కూడ దాని వద్దకుపోయి పూజింపరుకదా! చెట్లన్నిటిలో రావిచెట్టు మిక్కిలి శ్రేష్ఠమైనది. ఆ రావిచెట్టును పూజచేయుదురు. లేదా

తులసి చెట్టును పూజచేయుదురు. కాని వాకుడుచెట్టును యెవరును పూజింపరు, అనాథులుగదా యని వారిని పూజింపరు. అట్టివారి యందు దయగాని వారిని పోషింపవలయును. కాని పూజించినందు వలన పుణ్యమురాదు. తపస్సుచేయుటయందును జ్ఞానమును సంపా దించుటయందును, వేదములను, శాస్త్రములను బాగుగా అభ్యసిం చుటయందును, నియమమును నేర్పరితమును గలవారు విష్ణు స్వరూ పులు అని యెంచబడుదురు గాన వారినే పూజింపవలెను.

జ్ఞానవంతులగు వారు విష్ణుస్వరూపులై యున్నందునను, అట్టి వారియందు విష్ణుమూర్తి ప్రీతికలవాడై యున్నందునను, అందరి చేతను, వారే పూజనీయులు, గాన వారిని అవమానపరచిన యెడల భూలోకమందును పరలోకమందును గూడ మానవుడు దుఃఖమును పొందును. మహాత్ములను సేవించుటవలన పురుషార్థములైన ధర్మార్థ కామమోక్షములను పొందగలుగును, జ్ఞానరహితులైన మూర్ఖులు యావన్మందియు యీ రహస్యమును గ్రహింపజాలరు. గాన వా రెందరితో స్నేహము నొనరించినను ముక్తిని పొందజాలరు. అనేక జలతీర్థములను మట్టిచేతను, రాతిచేతను చేయబడినవి, గ్రహములను సేవించినవారు చాలకాలమునకు ముక్తినిపొందుదురు. సజ్జనులను చూచినమాత్రముననే తరింపగలరు. అందువలన సత్పురుషులను సేవించి వారివలన సద్బోధలను పొంది కష్టములనుండి ముక్తిని పొందుదురు. అమృతమును సేవించుటవలన జన్మజరామృత్యువులు నశించునట్లు సమస్తపాపములను వదలించు జలస్నానమును మాత్రము నీవు చేయలేదు. సజ్జనసహవాసమును కూడ చేయలేదు. ఇక్ష్వాకు వంశజనకుం డగు హేమాంగుడా! నీకు యీకారణమువలన యిట్టి చెడ్డస్థితికలిగినది. నీ దుర్గతి నశించుటకు వైశాఖమాసమందు నేను చేసిన పుణ్యమును నీకొసంగెదను. ఆ పుణ్యవిశేషమువలన యిప్పుడు

సంక్రమించినవి, గతించినవి, రాబోవునవి కర్మలయొక్క ఫలితములను జయింపగలవు అని శ్రుతదేవుడు పలికి నీటిని స్పృశించి పరమ పవిత్రమైన వైశాఖమాస వ్రతఫలితమును హేమాంగునకు ధార వోసెను.

శ్రుతదేవు డట్లు వైశాఖమాసమున కొన్ని దినములు మాత్రమే స్నానముచేసి సంపాదించిన పుణ్యమును హేమాంగునకు ధారవోసినంతనే బల్లిరూపముననున్న రాజు, తన పూర్వసంచితపాపము నశించినందున బల్లిరూపమును విడచి శ్రుతకీర్తి యింటియందు అందఱును చూచుచుండ దేవతావసనములను, మాలికాభరణాదులను ధరించి దోయిలి ముడిచి మునికి ప్రదక్షిణ మాచరించి నమస్కరించి అనుమతినిపొంది దేవవిమానము నెక్కి దేవతానుతులను పొందుచు స్వర్గమునకై వెడలెను. అచ్చట పదివేల సంవత్సరములు అనేక విధభోగముల ననుభవించి, యే విధమైన తొందఱ లేనివాడై యిక్ష్వాకువంశమందు కాకుస్థుడను రాజై జన్మించెను. కాకుస్థుడను సప్తద్వీప పరివృతరాజ్యమును పాలించుచు విప్రభక్తిగలిగి మంచి వారలందరకును యిష్టుడై యింద్రునకు మిత్రుడై శ్రీహరి యంశమును గొన్నవాడై విరాజిల్లుచుండెను. ఆ మహారాజు వసిష్ఠమహర్షి వలన వైశాఖవ్రతఫలమును తెలిసికొని, మాసధర్మములను, సంతోషకరములగు కార్యములను చేసి సమస్తమైన పాపములను పోగొట్టుకొని గొప్పదైన ఆత్మజ్ఞానమును సంపాదించి అంత్యమందు విష్ణుసాయుజ్యమును పొందెను. గాన వైశాఖమాసము మిక్కిలి ఉత్తమమైనదని చెప్పబడుచున్నది అందువలన అందరును వైశాఖమాస వ్రతమును చేయవలెను.

ఈ మాసవ్రతమువలన ఆయుర్దాయమును, కీర్తియు, బలమును వృద్ధినొందగలదు. మహాపాపములను పోగొట్టును. చతుర్విధ పురు

ప్రార్థములను కలుగజేయును. వైశాఖమాస వ్రతము విష్ణుమూర్తికి ప్రీతికరము. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులును, బ్రహ్మచర్య, గార్హస్థ్య వానప్రస్థ సన్యాసాశ్రమవ్రతపరులును, తక్కుంగల యావజ్జనులును వసంత ఋతువున వైశాఖమాస వ్రతము నాచరింపవలయును.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున ఆఱవ అధ్యాయము

## ఏడవ అధ్యాయము

నారదుడు అంబరీషునకు చెప్పుచున్నాడు. మిథిలాధిపతియు ధర్మవేత్తయునగు శ్రుతకీర్తిమహారాజు, తనయెదుట జరిగిన విషయమును చూచి అమితాశ్చర్యమును పొంది నవ్వుముఖముతో చేతులు జోడించి సింహాసనాసీనుడై సుఖాబుననుండి శ్రుతదేవునితో యిట్లు చెప్పదొడంగెను. మునిపుంగవా! సజ్జనులచరిత్ర చాల వింతగానుండును. హేమాంగుడు యేరీతిగా యే ధర్మాచరణముచేత మోక్షమును పొందెనో ఆ ధర్మమునే వినవలెనను కుతూహలము కలిగియుంటిని గాన శ్రద్ధావంతుడనై యున్న నాకు విస్తరించి కృపతో వివరింపుము. శ్రుతదేవు డీవిధముగా శ్రుతకీర్తిమహారాజు వలన ప్రశ్నింపబడి, మంచి ప్రశ్నను ప్రస్తావించితివి. అని పొగడి యిట్లు చెప్పసాగెను. రాజశ్రేష్ఠా! శ్రీహరి కతిప్రియమగు ధర్మములను వినవలెనను కోరికగల నీ బుద్ధి కడుంగడు ప్రశంసనీయము. మనుజుడు తనయొక్క అనేక వేల పూర్వజన్మములందు యే విధమైన పుణ్యమును చేయనియెడల శ్రీహరికథలను వినవలెనను యిచ్ఛ జనింపదు,

సజ్జనవరా! మహారాజాధిరాజులకు చక్రవర్తివై యున్నావు. అనన్య సామాన్య భోగములననుభవించుచుంటివి. యౌవనదశయందున్నావు యిట్టి స్థితిలో నీకు యీ విధముగా ధర్మములను వినవలెనను సద్బుద్ధి కలిగినందున నీవు పరమ భాగవతోత్తముడుగా పరిగణింపబడు చున్నావు. సత్పురుష శ్రేష్ఠా! మానవుడేయే ధర్మములను దెలిసి కొని, వాని నాచరించుటవలన, జననమరణాదిరూపమైన సంసార బంధమును విడిచి ముక్తిని పొందగలుగునో అట్టి శుభకరమైన శ్రీహరికి ప్రీతికరమైన ధర్మములను, పరమభాగవతోత్తముడవైన నీ కొరకు ప్రత్యేకముగా చెప్పుచున్నాను—వినుము.

పరిశుద్ధుడైయుండుట, స్నానముచేయుట, సంధ్యావందన మాచరించుట, తర్పణ మొనర్చుట, అగ్నిహోత్రములను నిర్వహించుట, లోనగు కర్మలు- పుణ్యకర్మలని యెంచబడు రీతిగా, వైశాఖ మాసమందు మనుజు డాచరించు ధర్మములన్నియు పుణ్యప్రదములని యెఱుంగవలెను. మాధవునికి యిష్టమగు వైశాఖమాసమున పుణ్య కార్యములను, ధర్మములను చేయకయుండువాడు స్వర్గలోకమందు నను గూడ పుణ్యగతులను పొందనేరడు. కాబట్టి సమస్త పుణ్య ధర్మములయందు వైశాఖమాసకర్మలు అత్యుత్తమమైనవి. అనుపమ మానమైనవి, లోకమందు రాజుచే పరిపాలింపబడని ప్రజలవలె ధర్మము లెన్నియున్నను దుఃఖవంతములేగాని వేఱుకాదు. అందును గురించి యోచించ నగత్యములేదు. వైశాఖమాసమున సులభ ముగా చేయదగినవియు, పుణ్యము నిచ్చునవియు ధర్మములను వివ రింపుదును వినుము.

నీటితో నింపిన కలశమును, విప్రునకు దానమిచ్చుట, మార్గ మధ్యమున, తాపముచే శ్రమజెందిన బాటసారులకు వృక్షచ్ఛాయల యందు విశ్రాంతులను చలివేంద్రలను యేర్పరచి వారికి తాపమును,

దాహమును, శ్రమను నివారించునట్లు సేవచేయుట, ఎండచే మల మల మాడుచున్నవారికి, కాళ్ళజోళ్ళను, పావుకోళ్ళను, గొడుగులను, విసనకఱ్ఱలను దానముచేయుట నువ్వులతో కూడిన తేనెను, శ్రమ నివారించు ఆవు మజ్జిగను దాహమిచ్చి శ్రమను తగ్గించుట లోనగు ధర్మములను చేయవలెను. మార్గమధ్యమున బాటసారుల కుపయోగమగురీతి నూతులను దిగుడు బావులను, చెఱువులను త్రవ్వించుట, కొబ్బరికాయలను, చెఱకులను, కర్పూరమును, కస్తూరిని దానమొసంగుట, మంచి సుగంధమును పూయుట, పడకకు మంచము, పఱుపు లోనగునవి యిచ్చుట, రుచికరమగు మామిడి పండ్లను, దోసపండ్లను తినుటకు యిచ్చుట, దవనమును, పువ్వులను దానముచేయుట, సాయంకాలములందు పానకమును త్రాగుటకు యిచ్చుట, పూర్ణిమాతిథియందు పులిహోర మొదలగు చిత్రాన్నములను, ప్రతినిత్యము పెఱుగుతో కూడిన అన్నమును, తినుట కొసంగుట, సదా తాంబూలదానము చేయుట, చైత్రబహుళ అమావాస్యతిథినాడు వెదురుకొమ్మలను దానమిచ్చుట, ప్రతినిత్యమును సూర్యోదయముకాకుండగనే నదీస్నాన మొనరించుట యాచరింపదగిన ధర్మములైయున్నవి. మాధవ ప్రీతిని కలిగించు పూజలు చేయుట శ్రీహరి సత్కథలను వినుట, తలను యంటికొనకుండుట, విస్తరయందే భుజించుట జరిగించవలెను.

మార్గాయాసమున బడలికను జెందినవారికి విసనకఱ్ఱతో విసరి వారి శ్రమ నివారించుట, సువాసనగల మెత్తని పువ్వులతో సదా మాధవుని పూజచేయుట, నిత్యమును, రమావల్లభుని పూజించిన పిదప ధూపదీపముల నొసంగి పండ్లను, పెఱుగుతో గూడిన యన్నమును నైవేద్యమొనర్పవలెను. ఆఁబోతులకు, ఆవులకు యెప్పుడును ఆహారము నీయవలెను. విప్రుల పాదములను కడిగి ఆ

నీటిని శిరసావహింపవలెను. బెల్లమును, శొంఠిని దానము నీయ వలెను. ఉసిరికపప్పును, బియ్యమును, కూరలను, బాటసారులకు దాన మొసంగి వారి కుశలము నడుగవలెను. మహారాజా! యీ విధమైన ధర్మములన్నియు బహుపుణ్య ప్రదములును, విష్ణు ప్రీతికర ములును, వైశాఖమాసమం దాచరింపవలసినవియు నైయున్నవి. రమాకాంతుని పూజించుట, పుష్పములను, చిగుళ్ళను సమర్పిం చుట, పెరుగన్నమును నివేదన మొనర్చుట చేసిన యెడల మనుజుని సమస్త పాపములు నిర్మూలములుకాగలవు. మహాభాగా! విప్రులచే వినుతిగనుచున్న విష్ణువు సేవనిత, గుడియందుగాని, గృహమందు గాని, పూజింపదో, ఆమె సంతానరహితయై సౌఖ్యములేక, పతిని సంతసింపజేయనేరక తాను సంతసమును పొందనేరక దుఃఖించును.

వైశాఖమాసమున శ్రీమహావిష్ణువు భూలోకమున మానవులు జేయు పుణ్యధర్మములను దెలిసికొనగోరి లక్ష్మీదేవిని గూడి కొని, మునివర్యులతోడను, యితర దేవసంఘములతోడను అనుస రింపబడి, ప్రతియింటియందును వుండును. గాన రమావల్లభుని పూజింపనేరని మనుజుడు రౌరవాదినరక మనుభవించి పిమ్మట అయిదు జన్మలవరకు రాక్షసుడై జనించును. అందుచేత వైశాఖ మాసమున ప్రతిమానవుడును, శ్రీహరిని పూజింపవలయును. క్షుద్బా ధాపీడితున కన్నమును, పిపాసాతప్తునకు దాహమునకు జలమును, యిచ్చి ప్రాణాధారముగా నుపచరింపవలెను. వైశాఖమాసమున జలదాన మొసంగనివాడు పశువుగా పుట్టుచున్నాడు. అన్నదానము చేయనివాడు పిశాచమై పుట్టుచున్నాడు. అన్నదానము చేయ నందున జరిగిన విచిత్రమైనదియు, నాచే చూడబడినదియు నగు కథను వ్రాక్రుచ్చెదను వినుము.

పూర్వకాలమున మా తండ్రి కాలానుగతముగా మరణించిన పిమ్మట పిశాచమై రేవానదీతీరమందు పర్యటించుచు, ఆకలిదాహ

ములచేత శ్రమపడుచు, అలసినవాడై, తన మాంసమునే తాను తినుచు తిండిలేక కృశించిన శరీరముగలిగి, నీడ నీయజాలని బూరుగచెట్టుక్రింద నివసించుచుండెను. ఆకలిచేతను దాహముచేతను పూర్వజన్మములందు గావించిన పాపకర్మలచేతను బాధపడుచు ఆ పిశాచముయొక్క కంఠనాళమున చిన్నరంధ్రము కలిగి పిమ్మట పెద్దగాయమై పీడనొందుచు సమీపమందుగలసరస్సులో శీతలోదకమును విషప్రాయముగా నెంచుచు త్రాగలేక ప్రాణాంతకమగు శ్రమను పొందుచుండెను. ఆకాలమందు నేను కాశీయాత్రకు పోవ బయలుదేరితిని. రేవానదీతీరమునుండి వెడలుచుండగా మార్గమధ్యమందు బూరుగుచెట్టుకు సమీపమున తన మాంసమునే తాను తినుచు. అఱచుచు, బాధపడుచు, విచారించుచున్న పిశాచమును జూచితిని. ఆపిశాచమంతట నన్నుచూచి చంపుటకొఱకై వచ్చి నా తేజస్సువలన తఱుమబడి యేమియు చేయలేక పారిపోయెను. నేను దయాన్వితచేతస్కుడనై భయపడకుమని పిశాచమున కభయము మొసంగితిని.

నాయనా! నీవు విచారింపకుము. తిండిలేక నీవు కష్టపడుచున్న కారణమును చెప్పగలిగితివేని నేను దానిని నివారింతును అని చెప్పగా నా పిశాచము నన్ను తన కుమారునిగా నెఱుగక, నాతో నిట్లు చెప్పసాగెను. పూర్వకాలమందు భూవరమను పురమున సంకృతియను వంశమున మైత్రుడను పేరుతో, జన్మించితిని. తపము, దానము, విద్య, యోగము లోనగు వానియం దభిలాషఁగలవాడనై సమస్తవిద్యలను నేర్చుకొని, యితరులకు చెప్పి సర్వతీర్థములను సేవించితిని. లోభముచేత వైశాఖమాసమున అన్నదానము మాత్రము చేయలేదు. అన్నమును భుజించుకాలమునకు వచ్చిన అతిథికైనను పిడికెడు భిక్షమునుగూడ బెట్టలేదు. విప్రోత్తమా!

అందుకే పిశాచము నైతిని. కష్టపడుచున్నాను. వేరే కారణమేమి యును లేదు. నిజమును చెప్పితిని. నా గృహమందు మిక్కిలి కీర్తి వంతుడైన శ్రుతదేవుడను కీర్తివంతుడగు నా కుమారుడుండును. వైశాఖమాసమున అన్నదానము చేయకపోవుటచే నీతండ్రి పిశాచ జన్మనెత్తినాడని నాకుమారునితో చెప్పుము.

మరియు నీజనకుని నర్మదానదీతీరమున పిశాచముగానుండుట జూచితిననియు, బూరుగచెట్టుక్రింద తన మాంసమును తాను దినుచు పుణ్యలోకప్రాప్తి లేక కష్టపడుచుండెననియు, వైశాఖమాసమున సూర్యోదయకాలమందు స్నానమాడి కలుషరహితమైన మనస్సుతో శ్రీహరిని పూజించి జలముచే నాకొఱకై పితృతర్పణ మాచరించి సద్గుణశ్రేష్ఠుండగు విప్రున కన్నదానమును చేసినయెడల నేను పాపమోచనుడై పరమాత్ముండైన రమాకాంతుని సాన్నిధ్యమును జేరగలననియు చెప్పుము. యీ ప్రకార మేమాత్రమును సందేహిం పక నా కుమారునితో చెప్పుమనియు నీకు తప్పక సర్వశుభములు కలుగునని పలికిన తండ్రిమాటలకు శ్రుతదేవుడు చాల విచారమును పొంది, వారి పాదములకు సాష్టాంగముగా నమస్కరించి, చాల తడవు లేవనేరక తన్నుతానే నిందించుకొనుచు కన్నులవెంట నీరు గార్చుచు, తండ్రీ! నేను నీకు పుత్రుడను. దైవవశముచే నేనిచ్చ టకు వచ్చియుంటిని. విప్రులు పితృదేవతలకు మోక్షము కలుగు సత్కర్మలను చేయక కర్మభ్రష్టులైనయెడల వారు నింద్యులగుదురు. గాన నీకు ముక్తిని కలిగించు కర్మ నానతిచ్చితివేని నే సద్దానింజేసి నిన్ను ముక్తునిజేయుదును. యీ రీతిగా తనపుత్రుడగు శ్రుతదేవు డచ్చటకు వచ్చినందున సంతసించి పూర్తియగు శరీరముతో కుమారా! నీవీ తీర్థాటనము శీఘ్రముగా పూర్తిగావించుకొని గృహ మునకేగి, సూర్యుడు మేషరాశియందుండగా శ్రీహరికి అన్నమును

నైవేద్య మొనరించి, సద్బ్రాహ్మణుని కన్నదాన మొసంగిన యెడల నీయొక్క వంశమంతయు తరించి మోక్షమును పొందును. అని పల్కిన తండ్రి యానతిప్రకారము తీర్థయాత్రలను సేవించి నా యింటికి చేరి వైశాఖమాసమం దన్నప్రదానమును చేసితిని. అందు చేత నా జనకుడు పిశాచజన్మనుండి విడువబడి, నా వద్దకువచ్చి నన్నుగ్గడించి, యాశీర్వదించి, దివ్యమగు విమాన మెక్కి జన్మరహిత మైన విష్ణుపదప్రాప్తిని పొందెను.

మహారాజా! వైశాఖమాసమందు చేయు అన్నదానము నకు గల ఫలమునకు మితిలేదు. గాన ధర్మములలో మిన్నయగు నదియు, ధర్మములతో కూడుకొన్నదియు, సర్వశాస్త్రములందు గలిగియున్నదియు నగు అన్నదానఫలితమును నీకు చెప్పితిని. ఇంకను నీవు వినవలెనను విషయములను వివరించితి వేని సర్వధర్మములను నీకు సత్యముగా చెప్పెదను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమునందు
నారదాంబరీష సంవాదమున ఏడవఅధ్యాయము.

## ఎనిమిదవ అధ్యాయము

మిథిలా రాజేంద్రుండైన శ్రుతకీర్తి యిట్లు చెప్పసాగెను. ఆర్యా! ఇక్ష్వాకువంశస్థుడైన హేమాంగమహారాజు జలదానమును వైశాఖమాసమందు చేయకపోవుటవలన మూడుజన్మలవరకు చాతక పక్షియై పిమ్మట బల్లియై నా యింటియందున్నాడు. పుణ్యమును చేయనందున హేమాంగుడు కర్మననుసరించి చాతకముగాను, సజ్జన సేవ చేయనందున గర్దజన్మమును యేడుమార్లు కుక్కగాను పుట్టుట

భావ్యముగా నాకు దోచలేదు. హేమాంగుడు సజ్జనులను సేవింప లేదు గాని దూషింపలేదు. దుర్మార్గులనైనను దూషింపలేదు. సజ్జనసేవ లేనందున పుణ్యముండకపోవచ్చును. ఇతరులను బాధించిన పాపము కలుగవచ్చును. అట్టి దుర్గతి హేతువు లీతని కర్మలయందు కనుపింపనప్పుడు హేమాంగుడేల యీ నీచజన్మల నెత్తెనో యని నా మనంబున సందేహము కుందుచున్నది. గాన శిష్యుడను గాన నా సందేహనివృత్తి గావింపుడు అని యీరీతిగా శ్రుతకీర్తి మహారాజు శ్రుతదేవుని యడుగగా విశ్రుతకీర్తివంతుడగు నాముని సంతోషించి, రాజడిగిన ప్రశ్నకు యిట్లు చెప్పనారంభించెను.

మహారాజా! నీవడిగిన ప్రశ్నకు సదుత్తరమును చెప్పుచున్నాను వినుము. పుణ్యప్రదమైన కైలాసగిరియందు వసించు శంకరుడు పార్వతితో యీ రీతిగా చెప్పెను. దానిని నీకు చెప్పుచున్నాను. భగవంతుడు సర్వలోకములను సృష్టించి [illegible] స్థితిని, యిహసంబంధముగాను, పరసంబంధముగాను రెండుగా నేర్పఱచెను. భగవంతుడు సర్వజీవులకు త్రాగుటకు జలమును తినుటకు అన్నమును. రోగమునకు ఔషధమును మూడువిధములుగా నేర్పఱచెను. యిహమం దేరీతిగా యీ మూడువిధము లేర్పఱచెనో ఆ విధముగానే పరలోకమునకై కూడ సజ్జనసేవ, శ్రీహరి ధ్యానము, ధర్మమార్గాచరణ, అను మూడు కారణము లేర్పరచెను యీ విషయము శ్రుతులందు పూర్వమే చెప్పబడినది. రాజపుంగవా! యింటియందు సంపాదించియుంచిన పదార్థమును దారిబత్తెముగా ప్రయాణము చేయునప్పుడు మానవుడు యెట్లు తీసికొని వెళ్లునో అట్లే యీలోకమందు తన కర్మలచేత సంపాదించిన పుణ్యపాపవిశేషములను పరలోకయాత్ర చేయునప్పుడు వెంటగొనిపోవును. కొంతమందికి యిష్టమైన కార్యమేదైనను యితరసాధువుల కయిష్టమైనచో దానిని

తనకు బాధాకరమైనను, చేసితీరవలసియుండును. పాపహరమును, వినువారికి వింతయగునదియు, సంతోషముచే పులకాంకురమును గలిగించునదియు నగు పూర్వకథను తాత్పర్యముగా చెప్పుచున్నాను వినుము.

పూర్వమందు దక్షప్రజాపతి యాగమొనరింపదలచి తన యల్లుడగు సాంబమూర్తిని పిలుచుటకొఱకు కైలాసపర్వతమునకు వెడలెను. ఆ సమయమున శంకరుడు దక్షప్రజాపతి రాగానే తన యాసనమునుండి లేచి మర్యాద చేయలేదు. ఏలననగా శంకరుడు సర్వదేవతలకును పూజనీయుడు వేదపురుషుడు, సర్వభూతములకంటె పూర్వమువాడు. చంద్రేంద్రాది దేవతలందరును కానుకలు దెచ్చి యిచ్చు భృత్యులుగా గలవాడు. అందువలన తానెవరిని లేచి మర్యాదచేయుట మంచిది కాదని సదుద్దేశము కలిగియుండెను. సేవకుడు వచ్చిన యజమాని లేవకూడదు. భార్య వచ్చినప్పుడు భర్త లేవకూడదు. శిష్యుడు వచ్చినపుడు గురువు లేవకూడదు. అని శాస్త్రవిదుల యభిప్రాయము. కాని దక్షుడు మామగారైయున్నందున అల్లుడగు సాంబమూర్తి లేచి పూజింపవలెనుగదాయని యాలోచించగా అందులకు శ్రుతివాక్యమున్నది. మర్యాదచేయుటయందు బంధుత్వము కారణము గానేరదు. బలము, జ్ఞానము, తపము, శాంతి లోనగు సద్గుణజాలములం దెవరికి యధికముగానుండునో అతడు గురువనదగును. తక్కువవారు ఎక్కువవారిచే నియమింపబడుదురు. ప్రభువు, భర్త, గురువు లోనగువారు, సేవకుడు, భార్య, శిష్యుడు లోనగు వారియందుగల కోపముచేతను, వేరేకారణములచేతను లేచిన యెడల, ఆ తక్కువవారియొక్క ఆయుర్దాయము, సంపద కీర్తి, లోనగున వన్నియు నశించును. గాన ఎక్కువవారు తక్కువవారిని గుఱించి లేవగూడదు.

గాన నాకు మామయగు దక్షుని గుఱించి నేను లేచుట భావ్యముగాదు. అట్లు చేసిన యెడల వారి సంపదనశించును. అను, సదుద్దేశముచేత శంకరుడు సింహాసనమునుండి లేవలేదు. దక్షప్రజాపతి తాను వచ్చియున్నప్పుడు తన కల్లుడైన శంకరుడు సింహాసనమునుండి లేచి తన్ను గౌరవింపలేదని మిక్కిలి కోపమును వహించి అనేకరీతుల నిందించెను. దరిద్రుడును, దుర్మార్గుడును అగు శంకరునికి యెంతగర్వము కలిగినది? ఏమి యీ యాశ్చర్యము! ఇతని యైశ్వర్యమును విచారింతమా! ఎక్కుటకు బక్కచిక్కిన ముసలియెద్దు. ఎముకలను కలపుర్రెను ధరించిన గర్భదరిద్రుడు. వేద బాహ్యులగువారిచే వినుతుల గనును. వ్యర్థముగాను, అహంకార తత్వము కలిగియు, సంచరించువానికి భగవంతు డెట్లు శుభములను కలిగించును? లోకమందు సామాన్యముగా చర్మమును ధరించుట అశుచికరమని నీతివిదు లెఱుంగుదురు. కట్టబట్టలేని దరిద్రము చేత బాధనొందువాడు, అపవిత్రమైన గజచర్మమును ధరింపుచున్నాడు. నివసించుటకు యిల్లులేక శ్మశానమందే నివసింపుచున్నాడు. ధరించుటకు ఆభరణములులేక పాములను ధరించుచున్నాడు. ధైర్యములేక ఒకప్పు డీశంకరుడు తోడేలును జూచి పారిపోయెను, ఇతని మిత్రుల విషయము నాలోచించిన భూతప్రేత పిశాచాదులగు దుర్మార్గులు మాత్రమే యితనితో సంచరింతురు. కులగోత్రముల విషయ మెంత విచారించినను తెలియలేదు. ఇతని నడవడిని గుఱించి సజ్జను లెవరును సంతోషింపరు. పూర్వకాలమందు దుర్మార్గుడైన నారదుడు నావద్దకువచ్చి శంకరుడు చాలా గొప్పవాడు, మంచివాడు, అని పొగడి నన్ను నమ్మించి నా కూతురగు సతీదేవిని యిప్పించి పెండ్లిచేసెను. ధర్మవతియగు నా సతీదేవి శంకరుని యింటియందు భర్తసేవను చేయుచు సుఖించునుగాక-

మావంటివారికి శంకరుడు నుతిపాత్రుడు కాడు. కుమ్మరి కుండను తయారు చేసినప్పుడు అది పవిత్రమే కాని ఆకలశమును మాలవాడు ముట్టుకొనిన పిమ్మట అపవిత్రమైయుండును. అటులనే పరమపవిత్రురాలైన నాకుమార్తె నీతని కిచ్చుటవలన అయోగ్యురాలై పోయెను. అని పరమమూర్ఖుడైన దక్షప్రజాపతి అనేకరీతులుగా శంకరుని నిందా వాక్యములాడి, యల్లుని, కూతురిని, యాగమునకు రమ్మని పిలువక మామాడక యింటికి వెళ్ళెను.

పిమ్మట యాగముచేయు స్థలమునకు వెళ్ళి ఋత్విక్కులు, మునులు మొదలగువారిం గూడి శంకరు నిందించుచు యాగమును చేయసాగెను. ఆయాగమునకు బ్రహ్మ, విష్ణువు, తప్ప తక్కుంగల సిద్ధ, సాధ్య విద్యాధర, చారణ, గంధర్వ యక్ష కిన్నరాదులును, రాక్షసులును లోనుగాగల సమస్త దేవతా బృందమును వచ్చిరి. పరమయోగ్యురాలైన పార్వతీదేవి తన తండ్రియగు దక్షప్రజాపతి యాగమునకు తన్ను పిలువకపోయినను, ఆడస్వభావముగుటవలన చపలత్వముచేత తండ్రిచేయు యజ్ఞమును, ఆయాగమున కేతెంచు బంధువులను చూడగోరియుండెను. శంకరుడనేక మాటులు యాగమునకు వెళ్ళవద్దని వారించెను కాని భర్తమాటలకు బదులు చెప్పుచు, స్త్రీస్వభావజమగు కోరికచే వెళ్ళుటకై మజిల నిశ్చయపఱచుకొనెను.

అంత శంకరుడు పార్వతికి యీరీతిగా బోధించినాడు—పార్వతీ! నీవు యాగవాటికకు చేరినతోడనే ఆ సభలో దక్షుడు నన్ను గూర్చి మిక్కిలి నిందావాక్యాలాపన చేయును. ఆ దూషణ వచనములు విని నీవు సహింపలేక ప్రాణత్యాగ మొనరింపగలవు. నీవట్లు గాక దుస్సహమైన వచనములైనను, బహుశాంతముగా సహింపవలెను. నే నట్లే యిచ్చట నన్నాడిన దుర్భాషలకు నేను సహించి

తిని నీవు ఓరిమి వహింపలేవు. అందువలన నీవా యజ్ఞవాటికకు వెడ లుట సముచితముకాదు. నీవచటికి వెడలినందున సుఖములేదు అని శంకరు డెంత బోధించినను పార్వతీదేవి వినక, స్త్రీ చపలత్వముచేత యాగము జూడ కోరికగలదై యుండెను. అందువలన పార్వతి ఒక్కతెయే బయలుదేరి కాలినడకను పోవుచుండెను. అంతలో వృషభవాహనము వచ్చి ఆమెను తన వీపుపై నెక్కించుకొని పోవు చుండెను. శంకరుని యనుచరులగు భూత సంఘములు గూడ పార్వతీ దేవికి సహాయముగా వెడలెను. అట్లు బయలుదేరి పార్వతి. భూత సంఘమును బయటనుండ నియమించి తాను యాగవాటికలోనికిం జనెను. కాని యచ్చటగల బంధుకోటిలో నెవ్వరునుకూడ నీపార్వతిని గౌరవించి పలుకరించినవారు లేరైరి. పార్వతి చిన్నబోయిన మోముతో, తన భర్త చెప్పినది యథార్థమైనదని గ్రహించి తన తండ్రియగు దక్షప్రజాపతివద్దకు చేసిన నాతడు గౌ[illegible] నాయనుయోచనతో యాగవాటిక కుత్తరదిశగానున్న వేదికవద్దగల హోమకుండము సమీపమునకు చేరెను. అప్పుడు గూడ తండ్రిగాని, తక్కుంగల బంధువులుగాని సభ్యులుగాని యామెను పలుకరించి మాటాడరైరి.

ఆ యాగమున దేవతలతో పాటు శంకరున కీయవలసిన హోమభాగమగు యాహుతి నిచ్చువరకు పార్వతి తండ్రి నడతను గమనించుచుండెను. దక్షుడు హోమమందు సమస్త దేవతలకును ఆహుతులిచ్చి రుద్రాహుతిమాత్రము విడచెను. పార్వతీదేవి దానిని చూచి మిక్కిలి విచారించి కన్నీరుకార్చుచు యిట్లు పలికెను, తండ్రీ! మహాభాగులగు వారిని తిరస్కరించినందున సామాన్యముగా శుభము కలుగదు. సమస్తలోకములను సృజించినవాడును, పోషించువాడును, ప్రాణికోటికి జీవనాధారుడును, నగు మహాత్ముడైన సాంబమూర్తికి

నీవు యాగమందు హావిస్సు నెందులకు యివ్వకయుంటివి? ఇట్టి చెడు బుద్ధి నీకు కలిగినప్పుడు నీకు సదుపదేశము చేసినవారులేరా? ఇది నీకు తగిన పని కాదని చెప్పలేదా? యీ సభయందు గలవారైనను నీకుపదేశింపలేదా? స్వభావసిద్ధముగా నీకు తెలియదా? అని పార్వతి అడిగెను. యీ మాటలు జరుగుచుండగా పూషుడను సూర్యుడు నవ్వెను. భృగుమహర్షి చెడు తలంపుతో గడ్డమును మీసములను సవరించుకొనెను. సభయందుండు వారిలో కొందఱు భుజములను చఱచువారును, కొందరు పాదముల నదలించువారును, కొందరు చంకల నెగుర వేయువారలును కలరు. దురదృష్టవంతు డగుటచే దక్షుడు పార్వతి ననేకరీతుల నిందావాక్యముల నాడెను.

శంకరుని సతియగు పార్వతి, తండ్రియగు దక్షునివలన నిందింప బడి మిక్కిలి కోపముగలదై, తనపతిని దూషించిన దక్షుని నిందా వాక్యములను స్వయముగా వినినందులకు తగు కార్యము తన దేహము నుత్యజించుటయేయని ప్రాయశ్చిత్తమును నిశ్చయించుకొని సభికు లందఱి యెదుట హోమము నాచరించుచున్న యాగకుండమున బడి మరణించెను. పార్వతిని వెంబడించివచ్చిన ప్రమథగణములు పార్వతి మరణమునకు మిక్కిలి విచారించి వెంటనే శంకరునియొద్దకేగి దేవాది దేవుండగు నాతనితో దక్షుని యజ్ఞవాటికయందు జరిగిన విశేషము లను వివరించి చెప్పిరి. శంకరుడు పార్వతీ మృతివిషయ మా ప్రమథ గణంబులవలననవిని, ప్రళయకాలమందలి రుద్రునివలె మండిపడుచు వెంటనే లేచి తన శిరమునగల జటలలో నొకదానిని పెరికి, నేల మీదకొట్టెను. ఆ జటనుండి మహాకాయుడును, మహాబలుడును, వేయి చేతులు గలవాడును, ప్రళయకాలమందలి యమధర్మరాజుతో సమానమైన కాంతిగలవాడును నగు వీరభద్రుడు పుట్టి, చేతులు జోడించి సాంబమూర్తికి నమస్కరించి యిట్లు పలికెను.

స్వామీ! నన్ను మీరు సృష్టించిన కారణమేమి? దాన్ని చెప్పినయెడల మీ యాజ్ఞానువర్తినై సానుకూలమొనర్పగలను అని పలికిన వీరభద్రునకు ప్రళయకాలరుద్రునివలె నున్న రుద్రుడు యిట్లు చెప్పెను. వీరభద్రా! నా యర్ధాంగి యగు పార్వతి దక్షునివలన మరణించెను కాన ఆ క్రూరుడగు దక్షుని సంహరింపవలయును. మహా బలసంపన్నులగు భూతగణములన్నియు నీకు సహాయముగా నుండగలవు. అని పల్కెను. ఆ మాటలను వీరభద్రుడు విని భూత సంఘముతో బయలుదేరి దక్షుని యజ్ఞవాటికం జేరి అక్కడ సభలోనున్న దేవతలను, రాక్షసులను, మానవులను పరాక్రమవంతులను గూడ చావమోదిరి. పూషుడు అను సూర్యుడు పార్వతి దక్షునాడిన నిందావాక్యముల సందర్భమున నవ్వినందున వీరభద్రు డాతని దంతముల నూడగొట్టెను. చెవుతలంపున గడ్డమును మీసములను సవరించినందున భృగుమహర్షియొక్క గడ్డమును మీసములను వీరభద్రుడు పెఱికివైచెను. పార్వతీదేవి దక్షుని ప్రలాపించినపు డేవిధముగా నెవడు సంచరించి యేయే యవయవముల నదలించెనో, వీరప్రతాపుడగు వీరభద్రుడు వారి వారి యవయవముల నారీతిగానే చిదుకగొట్టి పిదప దక్షుని శిరస్సును కూడ నఱుకవలెనని మిక్కిలి ప్రయత్నించెను. దక్షుని శిరము మునులచేత మంత్రితమైయున్నందున వీరభద్రుడు దక్షుని తలను నఱుకలేక పోయెను. శంకరు డావిషయము నెఱింగి తానే స్వయముగా వచ్చి దక్షుని శిరస్సును నఱికివేసెను. ఇట్లు కైలాస చక్రవర్తియగు శంకరుడు, వీరభద్రుడు లోనగువారిం గూడి దక్షుని యజ్ఞవాటిక యందుగల దుర్మతులను జంపి, ప్రమథగణాది పరివృతుడై తన నిజ నివాసమగు కైలాసమునకు వెళ్లెను. ఆ యజ్ఞవాటికయందు మిగిలి యున్నవారు బ్రహ్మదేవు నొద్దకుజని తమ్ము రక్షింపుమని ప్రార్థించిరి.

బ్రహ్మ, దేవతలను వెంటనిడుకొని శివునిలోకమగు కైలాస
మునకు వెళ్ళి అనేక ప్రీతికరమైన వచనములతో శంకరుని శాంతుని
జేసి వానిఁగూడి దక్షుని యజ్ఞవాటికకు జని యచ్చట మరణించి
పడియున్నవారి నందరిని మరల బ్రతుకునట్లు చేసెను. శంకరు డంత
మేకయొక్క శిరస్సును దెచ్చి దక్షుని కతికి వానిం బ్రదికించెను.
మేకయొక్క గడ్డమునుదెచ్చి భృగుమహర్షి కిచ్చెను. పూషుడను
సూర్యునికి దంతముల నియ్యక పిండిని తినుటకు మాత్రమే వీలుగా
నుండు నట్లొనరించెను. అవయవములు పోయినవారందరికిని వారి
వారి యవయవములను మరల యిచ్చెను. కొందరికి మాత్రము
మారుపులగా నిచ్చెను. యీ రీతిగా బ్రహ్మచేతను శివునిచేతను,
దక్షుని యజ్ఞమునకు వచ్చిన సభికులందఱును శుభములను పొంది
మఱల పూర్వమువలెనే యాగము చేయుటకు ప్రారంభించిరి.
యాగము పరిసమాప్తి చేసి దేవతలందరును వారి వారి నివాసము
లకు వెళ్ళిరి. శంకరుడు భార్యావియోగము గలుగుటచేత యిల్లు
విడచి, బ్రహ్మచర్యవ్రత నియమమవలంబించి గంగానదీతీరమందు
గల పున్నాగవృక్షము మొదట తపముచేయ మొదలిడెను. దక్షుని
కూతురును, శంకరుని భార్యయు పతివ్రతయునగు సతీదేవి, శరీరమును
దక్షయజ్ఞకుండమున వదలిన పిమ్మట హిమవంతునికి మేనకయందు
కుమార్తెగా జనించి వారింట నల్లారు ముద్దుగా పెరుగుచుండెను.

తారకుడను రాక్షసుడు గొప్పదైన తపస్సును చేసి బ్రహ్మ
దేవుని మెప్పించి, దేవాసురులచేతను, నర, సర్పములచేతను, ఆయు
ధాస్త్రములవలనను, మహాబలవంతులచేతను తనకు చావులేకుండ
వరమును కోరెను. బ్రహ్మయు, శంకరుని కుమారుని వలన
దప్ప నీకు చావులేదని తారకాసురునికి వర మొసంగెను. తార
కాసురు డావరమును పొంది యిట్లాలోచించెను. శంకరున

కింతవరకు సంతానము లేనేలేదుగదా! ఇకముందు కుమారుడు కలుగుననుటకు భార్యయగు పార్వతి దేహత్యాగమొనరించి మరణించెను. కాన శంకరునికి పుత్రుడు కలుగుటకల్ల. అందువలన నాకేవిధమగు మరణభయమును కాన్పింపదు అని బహుధా ధైర్యమును పొంది తారకాసురుడు యింటికిపోయి మూడులోకములను మిక్కిలి బాధపెట్టజొచ్చెను. తారకాసురుడు, దేవతలందరిని తన సేవకులుగ జేసెను. దేవతల భార్యలను తన గృహాంగణమందు కసవూడ్చుదాసీలుగ జేసెను. తన కెదురు బల్కినవారిని చావమోదుచుండెను, యీ రీతిగా అనేకవిధముల బాధల బెట్టుచున్న తారకాసురుని పనులను సహింపలేక దేవతలందరును సత్యలోకమందున్న బ్రహ్మదేవునికి విన్నవించిరి. బ్రహ్మయు, దేవతల విన్నపమాలకించి వారితో నిట్లనెను.

దేవతలారా! నేను పూర్వమందు దురాత్ముడగు తారకాసురునికి వరము నిచ్చినపుడు సాంబశివునికి పుట్టిన కుమారునివలన తప్ప వేరెవ్వరివలనను చావులేదని చెప్పితిని. అందుకు శివునకు సంతానము కలుగుటకు భార్యలేదుగదా యెట్లని మీరు యోచింతురు? దానికి నిదర్శనమును చెప్పుచున్నాను వినుము. పూర్వము దక్షప్రజాపతి యజ్ఞమును చేసెను. ఆ యాగకుండమున శంకరుని భార్యయైన సతీదేవి మరణించెను. పిమ్మట ఆమె హిమవంతునికి మేనకయందు కుమార్తెగా జనించి పార్వతియను పేర బరగుచున్నది. శంకరుడును ఆ హిమవత్పర్వత శిఖరమందు మిక్కిలి గొప్పదైన తపస్సును గావించుచుండెను. అన్నిలోకములకు ప్రభువగు శంకరుడు ఆ పార్వతీదేవితో సంయోగము కలుగునట్లు మీరు సంధానముగావింపుడు. దానివలన మీ కార్యము నెఱవేరగలదు అని చెప్పి బ్రహ్మదేవుడు దేవతలను బంపి తనలోకమునకు పోయెను.




దేవేంద్రుడు సభతీర్చెను. ఆ సభయందు దేవతలు బ్రహ్మ ప్రభృతియు దేవేంద్రునితో యాలోచించి తారకాసురుని సంహరింపగలుగు కుమారుని శంకరునివలన సంభవింపగలుగు కార్యార్థమై నారదుని మన్మథునిగురించి తలంచిరి. అంత వారిరువురును దేవేంద్రునిసభకు వచ్చిరి. దేవేంద్రుడు నారదునితో నిట్లు పలికెను. నారదా! నీవు హిమవత్పర్వతమునకు వెళ్ళుము. అచ్చట హిమవంతునితో ముచ్చటించి నేను నీతో చెప్పబోవు రీతిని కార్యమును సానుకూలపరచుము. హిమవంతా! నీ కుమార్తెయగు పార్వతి పూర్వజన్మంబున దక్షుని కుమార్తె యగు సతీదేవి. ఆమె యజ్ఞకుండమున బడి మరణించగానే శంకరుడు విరాగియై బ్రహ్మచర్యము నవలంబించి నీ శిఖరమందే తపమాచరించుచున్నాడు. యీజన్మమున కూడ నీ కుమార్తెయగు పార్వతికి శంకరుడే భర్త కాగలడు. శంకరునికి నీ కుమార్తెయగు పార్వతి భార్య కాగలదు. గాన తపముజేయుచున్న శంకరునికి పరిచర్య చేయుటకు నీ కుమార్తెయగు పార్వతిని నియమింపుము అని హిమవంతునితో చెప్పి యీ పని నాతనిచే చేయింపుము. అని దేవేంద్రుడు నారదునకు చెప్పగా నారదు డాప్రకారమే హిమవంతునికడకేగి వానితో నీ వృత్తాంతమును నివేదించి శంకరుని శుశ్రూషకు పార్వతిని నియోగించునట్లు గావించెను. పిమ్మట దేవేంద్రుడు మన్మథునితో నిట్లు చెప్పెను. రతీవల్లభా! నీవు నీ మిత్రుడగు వసంతునితో గూడి శంకరుని మేలుకొఱకును లోకముల హితవుకొఱకును, హిమవత్పర్వతశిఖరమందు తపమాచరింపుచున్న శంకరుని తపోవనమునకు జని సంతసమును గొల్పు వసంతసమాగమ ధర్మములను నిర్వర్తించి సాంబశివునికి నుపచార మొనర్చుచు దగ్గరగా పార్వతి సంచరించు సమయమున పరమశివుని యందు నీ పుష్పశరముల వెడలించి యామె యందు మోహము కల్గునట్లు చేయు

దువేని వారిరువురిసంయోగమువలన దేవతలకు బాధకలిగించు తారకాసురుని వధింపగల కుమారుడుద్భవించును. దానంజేసి మన కార్యసిద్ధికాగలదు. యీ విధముగా దేవేంద్రుడు మన్మథుని కాజ్ఞాపింపగా కంతు డట్లనే కానిమ్మని యంగీకరించి, వసంతుని గూడికొని, రతీదేవిని వెంటనిడుకొని అనుచరులం గూడ దీసికొని, వెంటనే బయలుదేరి శంకరుని తపోవనమున కేగెను.

శంకరుని తపోవనమందు వసంతకాలము కాకున్నను మలయ మారుతము ప్రసరింప జొచ్చెను. అంతటను మిక్కిలి మనోహరముగా నుండెను. ఆవనమందు వసంతకాల ధర్మములను మన్మథుడు తన శక్తిచేత కలుగజేసెను. శంకరుడు పార్వతి తనకు చేయుచున్న యుపచారములకు సంతసించి యొకానొక సమయమున తన సమీపమున గూర్చుండ నియమించి కొంత ప్రసంగముచేయ నారంభించెను. మన్మథు డాసమయమును గుర్తించి మృదువైన పుష్పబాణములను ప్రయోగించి సాంబశివుని వెనుక దాగియుండెను. మన్మథు డట్లు వ్యర్థముగాని రెండు బాణములను చెట్టుచాటునుండి శంకరునిపై వైచెను. శివుడు చలించి, అయ్యో! నేను జడస్వరూపిని. నా మనస్సు చలింపనేరదుగదా! ఇట్లు యెవరు చలించునట్లు గావించిరి అని యోచించి, నాల్గు దిశలను కలయజూచి తనకు వామభాగమందుగల కంతుని గాంచెను. సాంబశివుండు మిగుల కోపముతో వెంటనే పార్వతిని తన వద్దనుండి తొలగిపొమ్మని త్రోసివైచి తన మూడవ కంటిని తెఱచెను. ఆ మూడవ కన్ను తెఱచినంతనే లోక భయంకరమై ప్రళయకాలాగ్నితో సమానమై. తేజస్సు బయలుదేరి ధనుర్బాణములతో కూడ మన్మథుని భస్మము జేసెను. దేవతలాదృశ్యమును జూచి, తమకార్యము సిద్ధించునా లేదాయని సందేహమును పొందుచు స్వర్గలోకమునకు పరుగిడిరి. వసంతుడును, రతీ

దేవియు, తమకు కూడ శిక్షకలుగునను వెఱపుతోనుండిరి. పార్వతి కండ్లు మూసికొని, యచటనుండి దూరముగా పరుగిడెను. స్మరహారుడును రమణుల యెదుటనుండ రాదని విరమించి యంతర్ధానుడయ్యెను.

కంతుడు చేసిన కార్యము దేవతలకును శివునకును ప్రీతికరమైనను రతీవల్లభునకు మాత్రము హితముకాలేదు. అప్రియ మాచరించిన అనర్థమునకు అంతులేకుండును. కాబట్టి హేమాంగుడు సదా సజ్జనులకు అయిష్టుడేయగును. సజ్జనసేవ చేయకుండుటయే నాశిష్టమగు సేవను చేయకుండుటయగును. సజ్జనసేవ సేయని కారణమున హేమాంగుడు శునకాది హీనజన్మములను పొంది మిక్కిలి దుఃఖమును బొందుచుండెను. గాన సకలార్థసిద్ధి ప్రదమగు సత్పురుషుల సేవనము తప్పక చేయవలయును. మహాభాగుండగు రతీకాంతుడు శంకరునికి అప్రియమగు తపస్సును భంగ మొనర్చి పిమ్మట మరుసటి జన్మమున మిక్కిలి దుఃఖమును పొందెను. పుణ్యప్రదమగు యీ యితిహాసమును యేనరులు రాత్రికాలమందు గాని పగటిసమయమందు గాని చదువుచు వినుచుందురో, అట్టి మానవులు జన్మము, ముదిమి, చావు లేకుండ నుండగలరు. అందుకు సందియ మిసుమంతయు లేదు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున ఎనిమిదవ అధ్యాయము

# తొమ్మిదవ అధ్యాయము

మిథిలానగరాధీశుడు అగు శ్రుతకీర్తి శ్రుతదేవు నడుగు చున్నాడు. మహాభాగా! విప్రోత్తమా! రతీవల్లభుడు రతీవల్లభుని చేత హతుడై తిరిగి యెట్లు గతిని బొందెను? చేసిన కర్మ అనుభ వింపక తప్పదుగాన మన్మథు డెట్లనుభవించి కష్టముల నెట్లు బొందెను? యీ విషయములన్నియు వినుటకు కుతూహలము గలదు గాన సవిస్తరముగా వివరింపుమని ప్రార్థించెను. అంతట పాపహరణమును కీర్తిదమును, పుణ్యప్రదమును, ధర్మకరమును, సమస్తరోగనివారణమును నగు కంతుని జన్మప్రకారమును వినిపించె దను. సావధానముగా వినుమని శ్రుతదేవుడు పలికెను.

మన్మథుడు సాంబశివునిచేత భస్మీతుడయ్యెను. మదనకాంత యగు రతీదేవి తన పతిదేహము తన యెదుటనే భస్మమగుట జూచి మూర్ఛపడి కొంతసేపటికి తెలివిగలిగి బహువిధములుగా విచారిం చెను. సామాన్యముగా యితరులను చలింపజేసి జాలినిగొల్పు యూహాలను కలిగించు రీతిగా రతీదేవి విచారించుచుండెను. పిదప భర్తయొక్క దహనాగ్ని యందు తన దేహమునుకూడ నంతము గావింప సంకల్పించి తదుక్తక్రియలను చేయుటకై తన పతికి హితు డగు వసంతుని దలచెను. మహానుభావుడగు వసంతుడు, వీరపత్ని యగు రతీదేవికి చితినేర్పరుపదలచి భయపడి మిత్రుని భార్య యైన రతీకాంతను జూచి మూర్ఛాగతిని పొంది అనేక రీతుల ప్రేమ గొల్పు వచనములచే సహగమనమును నివారింప దలచి యిట్లు పలికెను, సుమంగలీ! నీకు పుత్రునితో తుల్య మగు నేనుండగా నీ విట్లు దేహత్యాగమును సంకల్పించుట భావ్య ముగాదు అని పరిపరివిధముల ధర్మసూత్రములను చెప్పి యాటంక

వరచినను, రతీకాంతకు జీవించుటకు కోరిక లేనిదై యుండుట గ్రహించి వసంతుడు యానదీతీరమందు చితి నేర్పరచెను. రతీదేవి ఆకాశ గంగలో మునిగి, పితృకర్మలన్నిటి నాచరించి పంచేంద్రియములను నిగ్రహించి మనంబును ఆత్మయందు లయించి దేహత్యాగ మొనర్చుటకు కాష్ఠపుచితియందు నెక్కబోగా కల్యాణీ! కంతునియం దంతులేని భక్తిగల నీ విట్లీ యగ్నియందు ప్రవేశింప జనదు అను యశరీర వాక్కు వినంబడియెను. మరియు రతీదేవీ! శివుని వలనను, యదు వంశమందు కృష్ణావతారమున శ్రీహరికిని జన్మించి నీకు భర్తగా గలడు. అనగా మన్మథుడు రెండు జన్మలెత్తును. ఉత్తరజన్మమందు శ్రీహరికి రుక్మిణీకాంతయందు ప్రద్యుమ్నుడను పేర జన్మించి, బ్రహ్మదేవుని శాపమువలన శంబరాసురుని యింటనుండగా నీవు నీ భర్తను కలిసికొని సుఖముగా మీ యథాస్థానమునందుండగలరని కూడ యాకాశవాణి పలికెను.

ఆకాశవాక్కులను విని రతీదేవి చితాగ్నియందు చనిపోవుటకు నిశ్చయించినను, ఆ యాలోచనను విరమించెను. పిమ్మట బృహస్పతి, ఇంద్రుడు, అగ్నిదేవుడు లోనగు దేవతలు తమకు సాధనకారుడగు మదనుడు శివునిచే దహింపబడినందున రతీకాంతకడ కేతెంచి యామెకు ప్రత్యక్షమై అనేక విధమైన వరములనిచ్చి యామెనుగల మరణింపవలెనను యాలోచననుండి వారించిరి. మారుండు మరణించినను నీ కండ్ల కగపడుచునే యుండును. నీకు దేహరహితుడైన నీపతి సశరీరముగానే కనుపించుచుండును. అని చెప్పి రతీదేవి విచారమును వారించి యామె కనేక ధర్మోపదేశములను చేసిరి. పుష్పిల్లుని పూబోడీ! మీ పూర్వజన్మకథను వినిపింతుము వినుము.

తొల్లి నీ భర్త సుందరుడను పేర గొప్ప ప్రభువై యుండెను. ను సుందరునకు సతిస్సుందరివై యుంటివి. ఒకప్పుడు నీవు రథో

పతిపై వెలుపలనుండక యింటియందే సంచరించి యాచార సంకర మును జేసితివి. అందువలన నీ కిట్టి యిక్కట్టు సంభవించినది. గాన వైశాఖమాసమందు భాస్కరుడు మేషరాశియందుండగా ప్రాతఃకాల మందు ఆకాశగంగయందు స్నానమాడి ఆపాపమునకు తగు ప్రాయశ్చిత్తమును గావింపుము. అదెట్లన జెప్పెద నాలింపుము. శ్రీహరిని పూజించి దేవతల కథను విని అశూన్యశయనమను వ్రత మును గావించిన పుణ్యప్రదమైన ఆ వ్రతముచేత నీపతి నీకు మరల చేకూరగలడు. యిందేమాత్రమును సందియము లేదు. అని దేవతలు రతీదేవికి చెప్పి యామె అడిగిన వరముల నెల్ల నొసంగి యథాస్థాన ములం జేరిరి. స్మరహరుని సతియగు రతి యతికష్టముతో విచార మును వదలి సూర్యుడు మేషరాశియందుండగా గంగానదియందు స్నానము గావించి పవిత్రమగు మనస్సుతో అశూన్యశయనవ్రత మారంభించెను. మహారాజా! శ్రుతకీర్తీ! ఆ వ్రతాచరణమువలన మదనుడు రతీదేవికి కనుపడి బహుపరాక్రమవంతుడై యామెం గలిసి క్రీడింపుచుండెను.

ఇక సుందరుడను రాజు అనేకధర్మములను చేసినను వైశాఖ మాసమందు చేయవలసినదిగా శ్రుతులందు చెప్పబడిన ధర్మముల నొకటైనను యాచరింపనందున సామాన్యధర్మాచరణము వలన గలిగినపుణ్యావిశేషముచేత పురుషోత్తమునికి పుత్రుడై మన్మథుడను పేర పుట్టినను సూర్యుడు మేషరాశియందుండగా వైశాఖమాసమున చేయదగిన ధర్మములను చేయనందున శరీరత్యాగము సంభవించెను. దేవతలకే యారీతిగా వైశాఖమాసధర్మములను విడచినందున కష్ట ములు ప్రాప్తించగా మానవమాత్రులగతి చెప్పవలెనా? యారీతిగా మారుండు శంభునిచే భస్మీకృతుడైనపిమ్మట శంకరుడు మాయ మయ్యెను పార్వతి తన వాంఛితము వ్యర్థమయ్యెనని విచారమున్ను

బొందగా నామె తండ్రియగు హిమవంతుడు వచ్చి వికలమనస్కుడై యున్న కుమారికామణిని గాంచి భయమంది యామెం గౌగిలించుకొని, చంకంబెట్టుకొని తన యింటికి జేర్చెను.

పార్వతి పరమశివునియొక్క రూపము, గుణము, ఔదార్యములోనగు వానిచే ప్రీతయై యతనినే భర్తగా బడయగోరి యాతనియందే నిర్మలమతితో మనస్సును లయించి తల్లిదండ్రులు, బంధుమిత్రులు యెంతజెప్పినను వినక నిశ్చలముగా వ్రతమును బూని గంగానదీతటమున తపము జేయ మొదలిడెను. పార్వతి యాహారమును తీసికొనక, శిరోజములను జటలుగాజేసి, లింగస్వరూపియగు సదాశివలింగమును బహు కఠినమగు తపోనియమములతో పూజింపగా వేయి దేవతాసంవత్సరములకు పరమశివుండైన సాంబశివుడు ప్రత్యక్షమయ్యెను. సమస్తలోకములకు శక్తిప్రదుడగు సాంబశివుండు బ్రహ్మచారియై యొకనాటి సాయంకాలమున పార్వతీదేవి తప మాచరించుచున్న పర్ణకుటీరమునకు వచ్చి తనయం దామెకు ప్రేమ కలదో! లేదో! విచారింపదలచి శివునిగూర్చి బహురీతుల నిందావాక్యములాడగా, పార్వతి యా వచనములను విని సహింపనందున తనయం దామె కమితమైన ప్రేమ గలదని తలంచి మహాభాగుడైన శివుడు తన నిజస్వరూపమును జూపి కావలసిన వరమును కోరు మిచ్చెదనని పలికెను. వరానన యగు పార్వతి శంకరుని తనకు పతివగుమని కోరెను. శివుడు పార్వతికి పతియగుట కంగీకరించి వరమిచ్చి సప్తర్షులను స్మరించినంత వారు చేతులు జోడించుకొని వచ్చి నిలచిరి. మహానుభావుడగు సాంబశివుండు వారితో పార్వతిని తనకు సతిగా జేయుమని యడిగిరమ్మని హిమవంతుని వద్దకు చెప్పిపంపెను. సప్తమహాఋషులును దసదిశల తమకాంతిపుంజముల వెదజల్లుచు, వియన్మార్గమున జని హిమవంతుని నగర

చేరిరి. హిమవంతుడు బ్రహ్మమానస పుత్రులగు నా సప్తర్షులను యెదుర్కొని రావించి గౌరవించి సుఖాసీనులను జేసెను. పిమ్మట యర్ఘ్యపాద్యాది విధులచే పూజించి కుశలప్రశ్నల జేయ మొదలిడెను. మునివల్లభులారా! మీరు నాయింటికి వచ్చినందున నేను పవిత్రుడనైతిని. నా కార్యములు సఫలత గనినవి. మీరు పుణ్యాత్ములు మహానుభావులుగాన మీకు నాతో పని లేదు. మీరాక నాజన్మమును పవిత్రముగా జేసెను. అందువలన మీకు నావలన కావలసిన కార్యమేమున్నను, చెప్పిన యెడల చేయగలనని హిమవంతుడు పలుకగా సప్తమునులు హిమవంతునితో నిట్లు చెప్పిరి.

సర్వపర్వతనేతా! మహానుభావా! హిమవంతా! నీకు తగిన మాటను చెప్పితివి. మారాకకు గల కారణమును వచించెదము వినుము. పూర్వము దక్షుని పుత్రికయగు సతీదేవి దక్షుని యాగమందు జనకునియందు గల కోపముచే దేహమును త్యజించి నీకు పుత్రికగా పుట్టి పార్వతియనుపేరం బరగుచున్నది. ఆమెను పెండ్లాడుటకు ముల్లోకాధినాథుండగు ముక్కంటి తప్ప వేఱొకడు సమర్థుడు లేడు. గాన నీవు శుభముగాంచగోరితివేని నీ కూతు నాతనికిచ్చి పెండ్లిగావింపుము. నీ పూర్వజన్మ పుణ్యవిశేషముచేత నీ కిట్టి యదృష్టము సంభవించినది. అని పల్కిన సప్తర్షి వచనములకు అచలాధీశుండైన హిమవంతుడమితానందమునొంది, సంతుష్టిమానసుండై మునీశ్వరులారా! నా కూతురు నారచీరలు గట్టి యాహారమును వదలి, శివుని భర్తగా బడయుటకై గంగానదీ తటమున కఠినమగు తపమును జేయుచున్నది. గాన మీరు వచించిన విషయమామెకు హితమైనది. పార్వతికి శివుని యందు యిదివరకే మనస్సు లగించినందున శివునికి పార్వతి యీ సరికే యివ్వబడినది. గనుక మీరు శివసదనమునకు జని హిమవంతుడంతులేని సంతసమ్మున తన

పుత్రిక నీ వరకే నిచ్చి నాడని చెప్పి వారిరువురి పెండ్లి మీరే గావింపుడు. ఇట్లు హిమవంతుడు చెప్పగా మునులు విని హిమవంతుని సెలవు గైకొని, పరమశివుని యొద్దకు జనిరి. యీ మహోత్సవమును చూచుటకు రమాదేవి మొదలగు పుణ్యవతులును, రమావల్లభుడు లోనగు దేవతులును షణ్మాతలును, మునులును వచ్చిరి. సాంబ శివుడు వృషభవాహనాధి రూఢుండై సర్వదేవతానీకములును, ముని సంఘములును, షణ్మాతలును, ప్రమథగణములును వెంబడింప, భేరీ శంఖమృదంగములును, ఢంకా, పటహాది వాద్యవిశేషములు మ్రోగు చుండ, విప్రులు వేదాశీర్వాదములు చేయుచుండ బంధుసహితుడై హిమవంతుని నగరుకు జనెను. హిమవంతుం డతి సంతుష్ట హృదయుండై శుభగ్రహదృష్టి గలిగిన శుభలగ్నమందు పార్వతిని సాంబ శివునికిచ్చి పెండ్లిగావించెను. మహారాజా! ముల్లోకములందలి ప్రాణికోటియంతయు సంతసించెను.

ఈ రీతిగా వివాహము పూర్తియైన పిదప లోకకల్యాణ కరుడగు శంకరుడు లోకధర్మముల ననుసరించి స్వేచ్ఛగా పార్వతితో రమించుచుండెను. సర్వసంపదలతో నిండిన హిమవంతుని గృహ మందు దేవేంద్రుని వనతుల్యమైన సుఖసంపత్తుల మధ్య, రాత్రుల యందు మిక్కిలి ఆనందకమగు సరస్తీరములందును వనముల యందును మత్త భృంగవిరాజితమును, పక్షి, కేకి పరివృత నిస్వన విలసితంబునగు మనోహరప్రదేశములందును శంకరుడు అనేక వేల దివ్య వర్షములు స్వచ్ఛందముగా పార్వతీదేవిం గూడి సుఖంపుచుండెను. శ్రుతకీర్తి మహారాజా! ఆకాలమునందు దేవేంద్రుని వరము లేకుండుటచేత స్త్రీపురుష సంయోగ మున్నను గర్భస్రవణమే కాని గర్భోత్పత్తి లేదు. గాన పార్వతితో రుద్రు డవిరతిగా రతియొనర్చినను గర్భోత్పత్తి కాలేదు.

అందుల కాశ్చర్యముతో దేవత లాలోచించి శివునకు కుమారు డెట్లు కల్గునని యాలోచించిరి. దేవతలందరు సమావేశమై యొకచో జేరి రహస్యముగా నిట్లని యోచించిరి. స్వప్రకాశుం డగు శివుండు కామమోహితుడై సదా విడువక పార్వతియందు రమించు చున్నాడు. నిత్యము గర్భము స్రవించుచున్నది కాని నిలచుట లేదు. దానంజేసి కార్యసిద్ధి కానేరదు. గాన శివుడు పార్వతితో రమించి నప్పుడు ప్రథమస్ఖలనము కాగానే పునస్సంభోగ మొనర్పకుండ మనము ప్రయత్నింపవలెను. అని రహస్యముగా యాలోచించి యీ కార్యసాఫల్యమునకు అగ్నిదేవుడే తగినవాడని నిశ్చయించి వీతిహోత్రుని పిలచి గౌరవించి దేవతలిట్లనిరి.

పావకా! నీవు దేవతలకందఱికిని ముఖమువంటివాడవు. నీవు బంధువు, నీవు సద్గతి, గాన నీవు శంకరుడు పార్వతితో రమించు ప్రదేశమునకు జని సంభోగానంతరము ప్రథమస్ఖలనమైన పిమ్మట వారి యెదుటకు నీవు వెడలి నిలువంబడిన ఆ పార్వతి నిన్ను జూచి సహజమగు సిగ్గుచేత యటనుండి కదలిపోవును. పిదప మరల సంభోగము జరుగనేరదు. ఎట్లనగా నీవు శిష్యునివలె వేదాంతవిషయక మగు సందియములను ప్రశ్నింపుచు, మన్మథసంహారకుడైన సాంబ శివుని సమీపించి, యీ వేదాంతగోష్ఠితో కపటముగా కాలమును గడపుము. అట్లు చాలాకాలము నీవట్లు గడపినయెడల పార్వతీదేవికి గర్భము నిలచి కుమారునిగాంచును. అని పావకుని దేవతలు ప్రార్థింపగా వీతిహోత్రుడట్లే చేయుదునని యంగీకరించి, శివుడుండు ప్రదేశమునకు వెడలెను. సంభోగము పూర్తికానందున పార్వతీదేవియందు శివుడు వీర్యము విడువలేదు. అప్పుడు అగ్నిదేవుని జూచి పార్వతి నగ్నమైయున్నందున సిగ్గుచే ప్రక్కగా వెడలెను. స్ఖలనసమయమున పార్వతి సంభోగమును వదలిపోవుటచే శంకరు డగ్నిదేవునిపై

కోపముగలిగి అగ్నిహోత్రుడా! పాపాత్ముడా! దుర్బుద్ధిగలవాడా! మా సంభోగమునకు భంగము కలిగించితివి. నా వీర్యము పార్వతి యందు విడువలేదు. గాన యట్టి దుర్భరమైన వీర్యమును నీముఖ మందు విడిచెదను. నీవే దానిని భరింపుముఅని పలికి శంకరుడు తన వీర్యమును అగ్నిహోత్రమందు వదలెను. అగ్నిదేవుడు దుస్సహమైన యా శంకరుని వీర్యమును తన హృదయమందుంచుకొని మిగుల పరితాపమును పొందుచు ప్రాణములో విడువబడితినని సంతసింపుచు యీ వీర్యభారమును వదలించుకొను టెట్లగునని మనమందు విచారింపుచు దేవతలవద్దకు వెడలి జరిగిన వృత్తాంతమును వారికిని వేదించెను.

అగ్నిదేవుని మాటలను దేవతలు విని సంతసమును దుఃఖమును గూడ బొందిరి. రుద్రుని వీర్యము సంభవించుటచే దేవతలు సంతసమందిరి. కాని యా వీర్యము పిండమై పుత్రుడుగా జనించు యుపాయము దోచక దుఃఖమును పొందిరి, అగ్నిగర్భమందున్న శంకరుని వీర్యము వృద్ధిపొంది పదిమాసములు గడచెను గాని అగ్నిదేవుడు తనవలన ప్రసూతికలుగక మిక్కిలి విచారించి యిందుకు తగు నుపాయమును దెలిసికొనుటకై దేవతలను శరణుపొందెను. వారగ్నిదేవుని దీసికొని లోకప్రసిద్ధిని వహించిన గంగానదికి వెళ్ళి యా గంగాదేవి ననేకరీతుల స్తుతిజేసిరి.

గంగాదేవీ! సర్వదేవతలకు నీవు మాతవు. అన్నిలోకములకు నీవధికారివి. దేవతలకోఱకు అగ్నిదేవుడు సాంబశివుని వీర్యమును తాను ధరించెను. ఆ వీర్యమువలన గర్భము వృద్ధిని పొందినను, అగ్నిదేవుడు పురుషుడగుటవలన ప్రసవింపజాలడు. గాన యా వీర్యమును నీవు భరించి మమ్ము కృపజూచి యగ్నిదేవుని మమ్ములను

కూడ రక్షింపుము. గంగాదేవి దేవతల ప్రార్థనల నంగీకరించి అగ్ని దేవుని గర్భమును తానే ధరింపఁదలచెను.

దేవతలు అగ్ని దేవునికి గర్భము వదలు మంత్ర ముపదేశించిరి. ఆమంత్రోపదేశమువలన లోకములకు దుస్సహామైన, తేజోపూరితమైన శంకరుని వీర్యమును అగ్ని దేవుడు గంగానదియందు వదలెను. గంగానదియు కొద్దిమాసములా గర్భమును ధరించి పిమ్మట భరింపనేరక శంకరుని వీర్యము యొక్క తేజస్సు వలన కలుగు వేడిమికి జలము లింకిపోగా జలములు లేని శుష్కరూపిణియై లోకపవిత్రయగు గంగానది మిక్కిలి విచారమును జెంది, తన పతివ్రతా మహాత్త్వముచేత గర్భమందలి పిండమును బయటకు దీసెను. ఆ తాపపూరితమైన శంకరవీర్యము రెల్లు పొదయందుంచగా రెల్లు దంట్లచే నా వీర్య మారుభాగము లయ్యెను. బ్రహ్మదేవునిచే ప్రేరేపింపబడినవారై ఆరుగురు కృత్తికలును అచటికి వచ్చి ఆరుభాగములుగానున్న శంకరుని రేతస్సును ఆరుముఖములు ఏకశరీరముగల పురుషునిగ నమ్మకమైన ప్రయత్నముతో చేసిరి. ఆయారుముఖములు యేక శరీరముగల పురుషాకారము రెల్లుపొదయందుంచబడి యెవరిచేతను చూడబడక, రక్షింపబడక చాలాకాలముండిపోయెను. ఒకప్పుడు పార్వతీ పరమేశ్వరులు వృషభవాహనము నెక్కి శ్రీశైలమును జూడ నేగుచు నా రెల్లుపొద సమీపమునకు జనిరి.

అచ్చట పార్వతీదేవి చన్నులనుండి పాలు స్రవించెను. పార్వతి యాశ్చర్యపడి స్తనములు స్రవించుటకు కారణమేమని భర్త నడిగెను. సర్వాంతర్యామి యగు సాంబమూర్తి ! పార్వతీ ! వినుమని చెప్పదొడంగెను. నీకుమారుడే క్రింద ప్రదేశమందుండెను. ఎట్లనగా పూర్వము నీతో నేను రమించుచుండగా నీయందు నేను వీర్యమును విడువకుండగనే అగ్ని దేవు డచటికి వచ్చెను. అంతట

నీవా యగ్నిం జూచి సిగ్గుచే నన్ను వదలి వేఱొక స్థలమునకేగి దాగితివి. అప్పుడు నేను అగ్నిదేవునియందు కోపముగలవాడనై దుర్భరమగు నా వీర్యమును అతని ముఖమందు వదలితిని. అతడు కొంత కాలము భరించి పిదప దేవతల దయవలన యా వీర్యమును గంగా నదిలో విడచెను. గంగానదియు వీర్య తేజస్సువలన తాపము పొంది భరించలేక రెల్లుపొదయందు వదలెను. ఆ వీర్య మాఱుభాగము లాయెను. షట్కృత్తికలువచ్చి యాఱుపిండములుగా దృఢపరచిరి. ఆయాఱుపిండము లొక్క శరీరముగలిగి పురుషాకారమును పొందెను. ఆ పురుషుని జూచినందువలన నీస్తనములు స్రవించుచున్నవి. గాన నా వీర్యమువలన పుట్టి శ్రీహరితో సమానమైన పరాక్రమముగల యాబాలుని నీవు రక్షింపుము. నీవు కన్నకుమారుడితడని నాకు దోచుచున్నది. గాన నీ బాలుని దీసికొనిపోయి పోషించితివేని యితని వలన నీ కమితమగు కీర్తి రాగలదు. శంకరునివలన యీ రీతిగా బోధింపబడి పార్వతీదేవి వెంటనే యా బాలుని దీసికొని తన తొడల యందుంచికొని స్తన్యపానము చేయించెను. యీ రీతిగా శంకరుని వలన భ్రమింపబడి పార్వతీదేవి దయతో కూడినదై భర్తంగూడి కైలాసమును చేరెను.

పార్వతీదేవి ఆ బాలకుని పెంచుచు మిక్కిలి యానందమును పొందెను. శ్రుతకీర్తి మహారాజా! ఈ విధమైన ఆశ్చర్యకరమగు కుమారస్వామి పుట్టుక నీకు చెప్పితిని. శుభప్రదమగు యీ కుమార స్వామి జననకథను ఏ మానవుడు వినునో అతడు యిహమందు పుత్రపౌత్రాది సుఖము లందగలడు. తపమందు నియమవంతుడై పునర్వివాహ మొనరించుకొనుట కిష్టములేని సాంబశివునకు అనిష్టమగు కార్యమును కల్పించి భ్రమగొల్పిన మన్మథు డీవిధముగా సజ్జనుల కప్రియమును కలిగించి శంకరుని తపోభంగమునకు కారణ

దైనందున పునర్జన్మను పొందినను మిక్కిలి విచారమును పొందెను. భగవానునకును, సజ్జనులకును నిష్టమగు నీ వైశాఖమాసధర్మము లను నిత్యమును వినుచుండిన వారికి విశేషఫలితము కాగలదు. దేవునికి ప్రీతికరమగుటవలన యీ మాసధర్మము సర్వవిధపాపము లను హరించి చాలాకాలము సువాసినిగానుండునట్లు చేసి పుణ్యమును కలిగించి సర్వసంపదలనిచ్చును. విశాఖుడనగా కుమారస్వామి యని కూడా తెలియదగును.

మారుడు శరీరము లేకున్నను, వైశాఖమాసధర్మ మహాత్మ్యముచేత శరీరమును పొందగలిగెను. వైశాఖమాసమున స్నానము చేయకుండినయెడలను ధర్మ మాచరించనియెడలను మానవు డెన్ని యితరకర్మధర్మముల నాచరించినను విచారమునే పొందును. అన్ని ధర్మములు చేయకపోయినను వైశాఖమాసధర్మములను మాత్రమే యాచరించినను మానవుడు సమస్తధర్మములను [illegible]

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున తొమ్మిదవ అధ్యాయము

---

## పదియవ అధ్యాయము

మిథిలానగరాధీశుడగు హేమాంగుడు చెప్పుచున్నాడు. విప్రోత్తమా! దేవతలచేత ప్రశంసింపబడి మదనుని భార్యయగు రతీదేవిచే నాచరింపబడిన అశూన్యశయనవ్రతమును గురించి నాకు సవిస్తరముగా జెప్పుము. ఏమిదానము చేయవలెను? ఎట్లు పూజ సలుపవలెను? ఈ వ్రతమును చేసినందున ఫలితమేమి? యీవిషయ

మును వినుటకు కోరిక గలిగియుంటినని అని హేమాంగు డడుగగా శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. మహారాజా! సర్వపాపములను పోగొట్టునదియు, రమాదేవికి శ్రీమహావిష్ణు వానతిచ్చినదియు నగు అశూన్యశయనవ్రతమును గుఱించి చెప్పుచున్నాను వినుము.

దేవతలకు ప్రభువును, మేఘమువంటి తనుకాంతిగలవాడును, సర్వపాపములను పోగొట్టువాడును, రమాకాంతుడును నగు పురుషోత్తముడే వ్రతమును చేసిన ప్రసన్నుడై రక్షించునో యట్టి యశూన్యశయన వ్రతమును గుఱించి చెప్పెదను మహారాజా! పాపములను అన్నిటిని పోగొట్టగల యీ వ్రతము నాచరింపక యేనరుడు గృహస్థాశ్రమధర్మములను నిర్వహించునో వాని ధర్మములన్నియు ఫలము లేకపోవును. అశూన్యశయన వ్రతము మిక్కిలి శ్రేష్ఠమైనది. దీనిని శ్రావణశుక్ల విదియనాడు చేయవలెను. ఈ వ్రతమును చేయు మనుజుడు చాతుర్మాస్యలయందు పరమాన్నమును తినుచు నాల్గు మాసములకు పిమ్మట పారణను పూర్తిగా చేయవలెను. పారణచేయు దినమున, లక్ష్మీదేవితో కూడిన జగన్నాథుడును, ముల్లోకాధిపతి యునగు శ్రీహరిని పూజచేసి నాల్గువిధములైన భక్ష్యములను నివేదన చేయవలెను. పిమ్మట కుటుంబీకుడైన బీదబ్రాహ్మణునకు వాయనము నుయివ్వవలెను. బంగారముతోగాని, వెండితోగాని, ఉత్తమమైన అందమైన ప్రతిమను చేయించి దానికి పట్టువస్త్రమును చుట్టి తులసిదండలు లోనగువానిచేత అలంకరించి ఆ ప్రతిమయందు రమావల్లభుని యావాహన మొనర్చి తెల్లని మల్లెపుష్పములు, సుగంధ ద్రవ్యములు లోనగువానిచేతపూజింపవలెను, శయ్యాదానము, వస్త్రదానము, దంపతులకు భోజనముపెట్టుట దక్షిణల నిచ్చుట, మొదలగు దానములచేత విప్రులను సంతుష్టిపరుపవలయును. ఇట్లు శ్రావణమాసము మొదలు, చాతుర్మాసముల పర్యంతము, రమా

శాంతుని పూజించి పిమ్మట మార్గశిరము మొదలు నాలుగు నెలలయందును పూర్వమువలె హరిపూజ సలుపవలయును. పిమ్మట చైత్రమాసము లగాయతు నాల్గు నెలలవరకు మెఱుపు వర్ణము గలిగినట్టియు, రుక్మిణీదేవినిగూడియున్న పురుషోత్తముని మునుపటివలెనే పూజింపవలెను. భూదేవితోనున్నట్టియు, సనకసనందనాది మునీశ్వరులచేత స్తుతిపొందుచున్నట్టియు, పాపరహితుడైనట్టియు, కృష్ణుని భక్తితో పూజ చేయవలయును. యీ రీతిగా పూజచేయుచు ఆషాఢ శుద్ధ విదియయందు పూర్తి చేయవలయును. శుభప్రదమైన అగ్ని హోత్రమున అష్టాక్షరీమంత్రమును పఠింపుచు హోమము గావింపవలెను.

మహారాజా! మార్గశీర్షము మొదలు నాల్గునెలలయందును పూజచేసి పిదప రమావల్లభుని గాయత్రీ మంత్రము నుచ్చరించి హోమము నాచరించి పారణ గావింపవలయును. [illegible] నాల్గు మాసములందును పురుషసూక్త శ్రీసూక్తములతో శుభకరముగా నగ్నియందు హోమము గావింపవలెను. గోవిందునికి పంచామృతములను, పరమాన్నమును, నేతితో వండిన పిండివంటను నైవేద్య మొసరింపవలెను. ఇట్లు శ్రావణము మొదలు నాల్గు మాసములవరకు పూజించి హోమములను జేసి, పిండివంటలను నైవేద్యమును చేసి వ్రతమాచరింపవలెను. ఇక ప్రతిమల విషయము దెల్పెదను వినుము.

లక్ష్మీనారాయణ ప్రతిమను పూజకు పూర్వమే దానమివ్వవలెను. శ్రీకృష్ణప్రతిమను పూజకు మధ్యసమయమున దానమివ్వవలెను. వరాహ లక్ష్మీనృసింహమూర్తి ప్రతిమను వెండితో చేయించి పూజకు పిమ్మట దానమివ్వవలెను. కేశవనామము మొదలు పన్రెండు నామములను పన్రెండుగురు బ్రాహ్మణులకు

నియమించి శక్త్యానుసారముగా ప్రతియొకరికి రెండేసి వస్త్రముల చొప్పున దానముచేసి భూషణములతో నలంకరించి పూజించి నేతితో వండినపిండివంటలను రకమునకు పండ్రెండు వంతున వారి కిచ్చి పిమ్మట వారికి భోజనము పెట్టవలెను. అటుపిమ్మట పడకతో గూడి చక్కగా నిర్మింపబడి భూషణములచేత అలంకరింపబడి పూర్వమందలి ప్రతిమపై లక్ష్మీనారాయణ విగ్రహము నావాహనముచేసి యా ప్రతిమను కంచుపళ్ళెరమందుంచి హరిప్రీతి గలవాడును కుటుంబీకుడును నగు విప్రునకు వస్త్రదానముచేసి అలంకరించి పూజించి దక్షిణనిచ్చి యా ప్రతిమను యా విప్రునకు దానమిచ్చి భక్ష్యభోజ్యాదులతో నా విప్రునేగాక తదితరులగు పూజనీయులైన విప్రులనుగూడ సంతృప్తిపరుపవలయును. నారాయణా! నీశయ్య రమాదేవితో కూడినదై సదా శూన్యము కాకయుండు పట్లు నా శయ్యకూడ సదా శూన్యము కాకయుండుగాక! నేను జీవించియుండునంతవరకు నా సతీమణి కూడ జీవించియుండవలయును. అను భావముగల శ్లోకమును చదివి విష్ణుమూర్తిని ప్రార్థించి దానమిచ్చి పిమ్మట తాను భుజింపవలెను.

శయ్యాదంపతీయుతముగా సదా నుండుటకై పురుషుడుగాని స్త్రీగాని, ముత్తైదువగాని, విధవగాని యెవ్వరైనను పరమోత్తమమగు యీ అశూన్యశయనవ్రతమును చేయవలెను. రాజశేఖరా! ఇట్లు విస్తరించి నేను నీకీ వ్రతమును చెప్పితిని. కేశవుని యనుగ్రహమున్న సర్వజనులు సుఖింతురు. అందరి దేవతలకును అధిపతి యగు ఈశానుడు సంతసించిన దేవతలకు కూడ పొందనశక్యమగు సంపదలను బొంది జనులు సుఖింపగలరు. గాన సర్వవిధములచేతను అశూన్యశయనవ్రతము నాచరింపవలెను. మహారాజా! విష్ణులోకమును తప్పక పొందవలెనను వాంఛ గలవాడీవ్రతమాచరింప

వలెను. ఈ వ్రతవిధానమును చెప్పితిని. వేరేదైనను వినవలెనను కుతూహలమున్నయెడల దానినడుగుము, ఇట్లు మునీశ్వరుడు చెప్పిన రాజదివిని మునివల్లభా! వైశాఖమాసమున గొడుగును దానమిచ్చినయెడల గలుగు పుణ్యవిశేషమును విస్తరించిచెప్పుము శుభప్రదములగు వైశాఖధర్మములను వినినకొలది వినవలెనను కోరిక జనించుచున్నది. అని బలికిన రాజుయొక్క కీర్తికరమును పుణ్యవర్ధనమును అగు పలుకును విని మహాభాగుండును గడు ప్రసిద్ధిని బడసిన శ్రుతదేవుడు యీరీతిగా చెప్పదొడంగెను.

వైశాఖమాసమందు యెండవేడిమిచే బాధపడుచున్న మహాత్ములకు గొడుగులను యెవరు దానమిచ్చుచున్నారో వారి, పుణ్యమునకు మితిలేదు. ఇందులకు పూర్వగాథకలదు. చెప్పెదను వినుము పూర్వమందు కృతయుగమున వైశాఖధర్మములనుగురించి జరిగిన కథనువినుము. పూర్వకాలమున వంగదేశమున హేమకాంతుడను రాజుగలడు. కుశకేతుని కుమారుడు. బహుబుద్ధిశాలి, కీర్తివంతుడు విలుకాండ్రలోగొప్పవాడు. ఒకప్పుడు హేమకాంతుడు వేటాడుట యందు ఆసక్తిగలిగి శారదవికిజనెను. ఆ యడవియందతడు అనేక విధములగు మృగములను, అడవిపందులు లోనగు జంతువులను, చంపి మధ్యాహ్నసమయమున అలసినందున విశ్రాంతికై మునులు నివసించు యాశ్రమప్రాంతముజేరెను. మహాతపోనిష్ఠాగరిష్ఠులై బాహ్యప్రపంచమెఱుంగక విప్రకృత్యమగు, అతిథిసత్కారము లోనగు నవితెలియక యింద్రియముల నిగ్రహించి సమాధియందున్నట్టులై యున్న శతర్చినులను మునులయాశ్రమమున కేగెను. వారు కేవలముతపమే కర్మగానుంచుకొని సమాధిలోనుండి చలింపనివారై హేమకాంతునిచూడక గౌరవించకయుండిరి. హేమకాంతుడుతనకు గలిగినయవమానమును సహింపలేక ఆ శతర్చినులను జంపనిశ్చయిం

చెను. కాని వారిశిష్యులనేకు లచ్చటికి వచ్చి రాజునువారించి వారితో నిట్లనిరి.

దురాత్మా! మేముచెప్పుమాటవినుము. మాగురువులగు శతర్చి నులు సమాధినిష్ఠాగరిష్ఠులై మనస్సుచేత పరమాత్మనుజూచి సంత సింపుచు బాహ్యప్రపంచధర్మములను విడచిరి. గాన నీవీసమయమున వారిపై కోపగించుటతగదు. అనిపలికినశిష్యులకు హేమకాంతు డతి కుపితుడై విప్రులారా! నేను వేటాడబోయి మిక్కిలియలసి మార్గా యాసముచే శ్రమజెందితిని. గాన మీగురువులకు వీలులేనిచో మీ రయినను భోజనమునొసంగుడు. అనిచెప్పెను. ఇట్లు పలికిన రాజు మాటలనువిని శిష్యులిట్లనిరి. రాజా! మేముగురువుల యానతిని బొంది యుండలేదు. వారుబెట్టినభిక్షనుతిని బ్రతుకుచున్నాము. వారియను మతిలోమెలగుమేము అతిథిసత్కారము చేయుట దుర్లభము. అని బదులుపలికిన శిష్యులపై రాజుకోపించి వారిని చంపుటకై విల్లును సంధించి యిట్లుచెప్పెను, దుర్మార్గమగు మృగములు, దొంగలు లేకుండ యీమహారణ్యమందు చక్కబెట్టితి. మీకుభయములేకుండ జేసితిని. మీరు మావలన అగ్రహారాది బహువిధోపకారములను సత్కారములును బొందియున్నారు. తుదకు మమ్ములనే బాధింప దలచినారు. అనేకబహూకృతులందిన యీ మునులు చేసిన మేలులను మఱచి నేనిచ్చటికివచ్చినను నావంకచూడరైరి. ఇట్టి క్రూరులను జంపినను నాకు పాపముండదు. అని శిష్యులతోబలికి విల్లుకు బాణము సంధించి విడువగా శిష్యగణముపాఱిపోయెను. హేమకాంతుడు వాని వెన్నంటితరిమి మూడువందలమందిని సంహరించెను. మిగిలినవారు భయముచే నాయాశ్రమమును వదలిపారిపోయిరి. పిమ్మట దుష్టులగు రాజసైన్యము హేమకాంతునియనుమతిని యాశ్రమమందుగల వంటపదార్థమంతయు దీసికొని భుజించిరి.

పిమ్మట ఆహేమకాంతమహారాజు తనసైన్యమునుదీసికొని సాయంకాలమునకు యింటికేగెను. కుశకేతుడు తనకుమారుడడవిలో జేసిన దుర్మార్గకార్యమునువిని కుమారునిపలువిధములదూరి, ఓరిమి లేనివాడీరాజ్యమేలతగడని తన దేశమునుండి వానిని వెడలగొట్టెను. హేమకాంతుడంత విచారగ్రస్తమానసుడై యొకకారడవింబ్రవేశించి బ్రహ్మహత్యాపాతకమువలన బాధపడుచు నిర్జనమగుపర్వత కందరతుల్యమైన వనమందు సంచరింపుచు బోయవానివలె మాంసాదికములను ఆహారముగాదినుచు బహుకాలముగడపెను. ఒకస్థలమందైనను నిలుకడలేక ఆవనమందట్లు తిరుగుచు హేమకాంతు డిరువదియెనిమిది వత్సరములు గడపెను. పిమ్మట ఒకనాడు త్రితుడను పేరుగల ఒక మునివర్యుడు పుణ్యతీర్థములను సేవింపబయలుదేరి యాయరణ్యమార్గమునం బడి వచ్చుచు చెట్లు, చేమలులేని యెడారిం జేరుసరికి రెండు ఝాములప్రొద్దెక్కి సూర్యుడు ప్రచండముగా ప్రకాశించుచుండెను. ఎండవేడిమికి యలసి, దాహపీడితుడై మూర్ఛను పొందెను. హేమకాంతు డాయలసి మూర్ఛనొందిన త్రితుని దైవవశముచేత చూచి, వానియందు దయగలవాడై మోదుగాకులను దెచ్చి గొడుగుగా కట్టి, వాని ముఖమునకు యెండ తగులకుండునట్లుచేసి యెండవేడిమిచే గలుగు తాపమును పోగొట్టి సొరకాయ బుఱ్ఱలలోనున్న నీటిని దాహమిచ్చి వాని సేదదేర్చెను. హేమకాంతుని యుపచారమువలన త్రితుడు మూర్ఛనుండి లేచి, యామోదుగాకుల గొడుగును వేసికొని, యలసటదీర్చికొని మెల్లగా సమీపమందుగల గ్రామముజేరి సుఖించెను.

మహారాజా! హేమకాంతు డట్లు త్రితుడను మునికి యెండ వేడిమినుండి రక్షించి గొడుగును యిచ్చినందువలన పుణ్యవిశేషము చేత, అతని బ్రహ్మహత్యలు మూడువందలును నశించినవి. హేమ

కాంతు డతిపవిత్రమైన మనస్సుగలవాడై నిర్మలమతితో నుండుటకు ఆశ్చర్యముగలవాడై యిట్లు తలంచెను. నేను బ్రహ్మహత్యలచే బాధ నొందితిని. ఇప్పు డవి నశించినవి. దీనికి కారణ మేమైయుండును? ఇట్లగుటకు ప్రతిక్రియ లేమిచేసియుంటిని? అని తన పాపవిముక్తికి కారణమాలోచింపుచుండగా యమదూతలు వచ్చి తమలోకమున కాతని బిలుచుకొనిపోవులకై వానికి ప్రాణహరణమగు నొక రోగ మును గలిగించిరి. ఆరోగమువలన హేమకాంతుడు ప్రాణములను వదలు స్థితికి వచ్చెను. అప్పుడు భయంకరాకారులగు ముగ్గురు యమ దూతలు, దీర్ఘములగు కేశములు గలిగినవారై వచ్చి హేమకాంతు నేమిచేయుదెను అను యూహతో నిలచిరి. పూర్వమందు వైశాఖ మాసమున త్రితునకు చేసిన గొడుగుదానము వలన గలిగిన పుణ్య విశేషముచే హేమకాంతునకు శ్రీహరి స్మరణజేయుట కూడ సంభ వించెను. హేమకాంతు డట్లు గోపాలుని తలచినందున, విష్ణుమూర్తి తనమంత్రియగు విష్వక్సేనుని బిలిచి, ఆర్యా! నీవు వెంటనే వెళ్ళి హేమకాంతుని ప్రాణములను దీసికొనిపోవ నుద్యమించి యేమిచేయు టకును దోచక నిల్చియున్న యమదూతలను తరిమివేయుమని, యాజ్ఞ నిచ్చెను. విష్వక్సేనా! హేమకాంతుడు వైశాఖమాస ధర్మములం దాసక్తి వహించెను. గాన వానిని కాపాడుము. పాపముక్తుడును నాకు భక్తుడునుఅగు హేమకాంతుని నీవుదీసికొనిపోయి వానితండ్రియగు కుశ కేతునిపట్టణమునకుచేర్చి వానితో నిట్లు చెప్పుము. నీకుమారుడు సర్వ ధర్మములను వదలినను, బ్రహ్మచర్యాదినియమములను త్యజించినను. వైశాఖమాసధర్మములయం దాసక్తి వహించినందున, మూర్ఛా గతుడైన త్రితుడను మునివర్యుని రక్షించెను. గాన యెన్ని పాప కార్యము లొనరించినను, అతని మునిరక్షణవలన నాకు పరమభక్తు డయ్యెను. వైశాఖమాసమున త్రితునకు మోదుగాకులతో నిర్మించిన

గొడుగును దాన మిచ్చుటచే పాపములం బాసి నీ కుమారుడు పుణ్యశాలియయ్యెను. అందువలన ఓరిమి, ఇంద్రియ నిగ్రహము, పూర్ణాయుర్దాయములను గలిగి శౌర్యౌదార్యాది సద్గుణములు పొంది, నీతో సమానత్వమును పొందెను, గాన మిక్కిలి బలముగల యితనిని నీరాజ్యమందుంచి వానికి రాజ్యాభిషేకము చేయుము. అని విష్ణుమూర్తి యానతిచ్చెనని కుశకేతునితో చెప్పి యీ హేమకాంతుని వాని తండ్రికి స్వాధీనపరచి తిరిగి నా యొద్దకు రమ్ము అనివిష్వక్సేనునితో విష్ణుమూర్తి చెప్పెను.

విష్వక్సేనుడు, హేమకాంతు నొద్దకు వెడలి, యచట గల యమదూతలను తఱిమివైచి, రోగబాధా పీడితుడైన హేమకాంతుని యవయవములను స్పృశించెను. విష్ణుభక్తుడగు విష్వక్సేనుని హస్తస్పర్శవలన హేమకాంతుని రోగ మంతరించెను. పిమ్మట విష్వక్సేనుడు హేమకాంతుని దీసికొని, వాని పట్టణమునకు వెళ్ళి కశకేతున కాశ్చర్యము గొలుపు వాని కుమారుని పాపనివృత్తికారణమును వివరించి చెప్పగా కుశకేతుడు విష్వక్సేనునికి సాష్టాంగదండ ప్రణామంబు లొనర్చి తనకుమారునితో గూడ విష్ణుభక్తుండైన విష్వక్సేనుని గూడ తన యింటికి గొంపోయెను. కశకేతుడు విష్వక్సేను ననేక రీతుల స్తోత్రముచేసి తన శక్తికొలది పూజింపగా నాతడు రాజుతో విష్ణుమూర్తి తనతో, రాజుకు చెప్పుమని యానతిచ్చిన విషయమంతయు విస్తరించి చెప్పగా విని కుశకేతుడు సంతసించి, కుమారుని రాజ్యమందుంచి, విష్వక్సేనుని యానతిగొని భార్యం గూడి, వనమునకేగెను. సత్స్వభావుడైన విష్వక్సేనుడు హేమకాంతుని వలన పూజింపబడి వాని యొద్ద సెలవుగైకొని విష్ణు నివాసంబగు శ్వేతద్వీపముజేరి వానివద్ద సుఖంబుండెను.

హేమకాంతుడు శుభప్రదమును, విష్ణుప్రీతికరమును, వైశాఖ మాస నియమితమునగు ధర్మములను ప్రతివత్సరము విడువక జేయు

చుండెను. బ్రహ్మజ్ఞానియు, ధర్మమార్గానువర్తియు, సమస్త యింద్రియనిగ్రహుడును, సర్వభూత దయాపరుడును, సర్వయాగ కర్తయు, సమస్తసంపదలచే నధికుడును, పుత్రపౌత్రాది సత్సంతాన యుతుడును అయి యిహమందనంత కల్యాణసంపదల నంది అంతమున హేమకాంతుడు వైకుంఠమును పొందెను. కాన కష్టములేక చేయ దగినవియు, విశేషపుణ్యఫలము నిచ్చునవియు, పాపములను దహించు శక్తిగల యగ్నివంటివియు, సులభముగా నాచరింప దగినవియు, ధర్మార్థ కామమోక్షములను చతుర్విధపురుషార్థములను సంపాదింప వీలగునవియు నగు వైశాఖమాసమం దాచరింపదగిన ధర్మముల కంటె వేరు ధర్మములు లేవని తలంపవలయును.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున పదియవ అధ్యాయము

## పదునొకండవ అధ్యాయము

హేమాంగు డడుగుచున్నాడు. శ్రుతదేవా! సులభముగా నాచరింపదగినవియు మిక్కిలిపుణ్యప్రదములును, విష్ణుప్రీతికరములును అగు వైశాఖధర్మములను చేసిన మరుక్షణముననే ధర్మార్థ కామ మోక్షములను, శాశ్వతసుఖములను కలుగగలవని వేదములందు చెప్పబడియుండియు లోకమున యెందువలన వ్యాప్తముగా లేదు. దుర్లభమును, బహుప్రయత్నముచేత చేయునవియు, మిక్కిలి ధన మును ఖర్చుపరచవలసినవియు నగు రాజస తామస ధర్మములు లోక మున ప్రసిద్ధిబడసినవి. కొందరు మాఘమాసము మిక్కిలి పుణ్యవంత మనదని యందురు మరికొందఱు చాతుర్మాస్యలు బహుపవిత్ర

వంతమైనవని పల్కుదురు. ఇంకను కొందఱు వ్యతీపాతాదిధర్మములు శ్రేష్ఠములని పెక్కురీతుల వర్ణింతురు గాన వీనినన్నిటిలో మిక్కిలి శ్రేష్ఠమైన వానిని విపులముగా వినవలయునని కోరిక జనించినది. గాన మీరు నాకు చెప్పవలెను. అనగా శ్రుతదేవుడు హేమాంగు నితో నిట్లనెను. మహారాజా! రాజస, తామస, ధర్మములు లోకము నందు ప్రశస్తివహించినవి. సాత్వికధర్మములు ప్రసిద్ధిని పొందలేదు. ఇందులకు కారణమేమని యడిగితివి గాన దెల్పెద నాలింపుము.

లోకమందు జనులు విషయలాలసులై పుత్రపౌత్రాదిసంతాన కాముకులై సంపదలనుగోరుచు, విశేషమైన రాజస, తామస, ధర్మము లను చేయుదురు. అనేకమందిలో ఒకడుమాత్రమే బహువిధ ప్రయత్నములు చేసి అతికష్టముతో యాగాది సత్కర్మల నాచ రించి స్వర్గమును బొందుటకు యత్నించును. మానవులు హీనమగు విషయసుఖములను కోరి, అనేకకర్మములను చేయుచు మోక్షమును గురించి ప్రయత్నింపరైరి. గాన లోకమందు రాజస, తామస, ధర్మ ములు వ్యాప్తమైయున్నవి. విష్ణుప్రీతికరమైన సాత్వికధర్మములు ప్రస్తుతి జెందలేదు. అజ్ఞానులు దైవమాయకు లోబడినవారై యిహ లోకమందును, పరలోకమందును సుఖముల నిచ్చునట్టి సాత్విక ధర్మములను గుర్తింపరైరి. సాధారణముగా మానవు డున్నతాధి కారమును పొందినయెడల అతనికోరిక లన్ని దీరినట్లు సంతసించును. అదేరీతిగా మోహాకాంక్షములగు ధర్మము లాచరించి నందువలన మానవునకు గల సకలసంపత్తులును నశింపక నిలచును. లోకమందు సాత్వికధర్మములును, వైశాఖమాసధర్మములును ప్రశస్తి నేల బొందియుండలేదో చెప్పెదనువినుము.

పూర్వకాలమందు కాశీక్షేత్రమందు ఇక్ష్వాకువంశమందు నృగమహారాజను వానికి కీర్తిమంతుడను కుమారుడు గలడు. అతడు

మిగుల కీర్తివంతుడును ప్రసిద్ధిగలవాడును, చక్రవర్తియై యుండెను. ఇంద్రియములను జయించి, కోపమనునది లేక జ్ఞానవంతుడై వెలంగు నీ కీర్తిమంతు డొకప్పుడు వేటయందు కోరికజనించి వసిష్ఠుని యాశ్రమమునకు పోయెను. ధర్మములను మాత్రమే చేయవలసిన వైశాఖ మందు రాజమార్గమందు పోవుచు వసిష్ఠుని శిష్యులచే నాచరింపబడు చున్న వైశాఖమాసమునందలి ధర్మకృత్యములను చూచుచుండెను. వసిష్ఠుని శిష్యులు వైశాఖమాసమున ఆశ్రమప్రాంతమందు ఒకచోట చలివేంద్రను, ఒకచోట విశ్రాంతికి నీడనిచ్చు మంటపమును, ఒక చోట చెఱువును, ఒకచోట దిగుడుబావిని నేర్పరచియు ఒకచోట చెట్లనీడను నాయాసముచే విశ్రమించినవారిని విసనకర్రతో విసరి యుపచారమును జేసియు ఒకచోట దాహమును దీర్చుటకు చెఱుకు గడలను యిచ్చియు మరియొకచోట గంధమును, యింకొకచోట పండ్లను యిచ్చియు మధ్యాహ్నమందు గొడుగులను దానమిచ్చియు సాయంకాలమున పానకమిచ్చియు, ఒక స్థలమందు తాంబూల మొసంగియు, వేఱొకచోట కండ్లకు కర్పూరమలరియు, అనేకరీతుల మాసధర్మములను నిర్వహించుచుండిరి. కొందఱు నీడతోనున్న చెట్లక్రిందను కొందరు చక్కగా బాగుచేసిన వాకిళ్ళయందును కొందఱు చల్లనిస్థలమందును యిసుకదిబ్బలమీదను ఆసనములను పఱచి కూర్చుండజేయుచుండిరి. ఒకచోట చెట్లకు నుయ్యాలలు గట్టి యూగించుచుండిరి.

ఈ రీతిగా వైశాఖమాసధర్మములను నిర్వహించుచున్న యామునిపుంగవులను వారి శిష్యులను చూచి మీ రెవరని కీర్తిమంతు డడిగెను. మేము వసిష్ఠమహర్షి శిష్యులమని వారు చెప్పిరి. మీరు చేయుచున్న యీ కృత్యము లెందునిమిత్తమని రాజడిగెను. వైశాఖ మాసమందు మానవు లాచరింపదగిన ధర్మములు మేము చేయు

చున్నాము. వీనివలన ధర్మార్థకామమోక్షములు ప్రాప్తించును, మా వసిష్ఠుని యాజ్ఞానువర్తులమై యిట్లు చేయుచున్నామని వసిష్ఠ శిష్యులు కీర్తిమంతునితో చెప్పిరి. వైశాఖమాసధర్మములు చేయుట వలన మానవులకు కలుగు ఫలితమేమి ? ఏదేవత ప్రీతిజెందును ! యీ విషయమంతయు విస్తరించి నాకు మీకు తెలిసినంతవరకు చెప్పుడని రాజడుగగా వసిష్ఠుని శిష్యులు యిట్లు చెప్పిరి. రాజా! మా గురువుయొక్క యానతి ననుసరించి మార్గమందు మంచి నదు పాయములను చేయుచున్నాము. గాన యీ వివరములను జెప్పుటకు మాకు అవకాశములేదు. మీరు మా గురువగు వసిష్ఠుని యథోచిత ముగా ప్రశ్నించి యీ విషయమంతయు తెలిసికొనుడు. మహాత్ముం డగు యాతడే యీ వైశాఖధర్మములను దెలిసినవాడు అని వసిష్ఠ శిష్యులు పలుకగా రాజామునియొద్దకు వెడలెను.

పుణ్యానంతమును, సమస్తవిద్యలకును, యోగములకును స్థాన మును అగు తన యాశ్రమమున కేతెంచుచున్న కీర్తిమంతుడను రాజును జూచి వసిష్ఠమహాముని సంతసించి, చతురంగబలయుక్త ముగా వానిం గూర్చుండ నియమించి ఆనందము బొంది యతిథి సత్కారము లాచరించెను. రాజందులకు సంతసించి వారితో నిట్ల నెను, మహామునీ! మీశిష్యులు చేయుచున్న ఘనమైనవియు, శుభప్రదములును, ఆశ్చర్యకరములును అగుపనులను జూచి వీని నేలజేయుచున్నారని వారినడిగినవారు మాటాడరైరి. మునిచంద్రమా నేను వేటయందు కోరికగలిగి యీ వనమునకు వచ్చి వేటాడి యలసి మీ శిష్యులచే గావింపబడిన యాతిథ్యమును పొంది యీ వైశాఖ ధర్మములను గురించి యడుగగా మీ శిష్యులు, మా వశిష్ఠుని యానతి ప్రకారము ధర్మములను నిర్వహించుటయేగాని, వాని మహాత్మ్య మును జెప్పుటకు మాకవకాశములేదు, గాన మా గురువు నడిగి

తెలిసికొనుడని చెప్పిరి. అందువలన మీ కడకు వచ్చితిని మునివరా! నీవు అందఱిలో మొదటివాడవు గాన ఆది ధర్మముల నన్నిటిని నీవు యెఱుంగుదువు. ఆ ధర్మములను యెఱుంగ నాసక్తి గలిగియుంటిని. నీకు నమస్కరించి శిష్యుడనైతిని. శ్రద్ధగలిగి వినదలచితిని. విస్తరించి చెప్పుము. అని ఇక్ష్వాకువంశమందు పుట్టిన కీర్తిమంతుడు గొప్ప తపోధనుడగు వసిష్ఠుని యడిగినందున మునిచంద్రు డతి సంతోష మును పొంది, యితడు మంచి ప్రశ్నను చేసినాడని మనంబున దలచి యిట్లు పలికెను.

రాజా! నీవు మంచి జ్ఞానవంతుడ వగుటవలన నీవు ధర్మము లను తెలిసికొనుటయం దాసక్తి వహించి యున్నందున నాక త్యాశ్చ ర్యము గొల్పుచున్నది. హరికథలను వినుటయందును, విష్ణుప్రీతికర ములగు ధర్మములను నిర్వహించుటయందును నీకు గల యాస్తికమైన యాసక్తి నీ పూర్వపుణ్య విశేషమువలన ఫలించినది అని వసిష్ఠ మహర్షి కీర్తిమంతుని బహురీతుల కొనియాడి రాజా! నీవడిగిన విష యమును చెప్పుచున్నాను వినుమని యిట్లు చెప్పసాగెను. సర్వవిధ ములగు విషయవ్యాపారములంబడి, సమస్త ధర్మములను త్యజింపక యుండ జేయునట్టియు, సమస్తపాపములను పోగొట్టునదియు, నగు వైశాఖధర్మములను చెప్పెదను. మహారాజా! వైశాఖమాసమున సూర్యోదయకాలమున స్నానమాచరించువాడు శ్రీహరికి ప్రియుడు. ఎన్నిధర్మము లాచరించినను, వైశాఖమాసమందు చేయవలసిన స్నానము, దానము, పూజ లోనగు పుణ్యకార్యములను చేయని మానవుడు శ్రీహరికి ప్రియుడు కాజాలడు. వైశాఖమాసమున స్నాన మును చేయక, దానమును యివ్వక కాలమును, గడపు జనుడు, తన కర్మవలన చండాలుడుగా పుట్టును. వైశాఖమాసమందు చేయ వలసిన మంచికార్యములను చేసి విష్ణుమూర్తి కిష్టుడగు నరుడు,

జగత్ప్రభువగు హరి దయవలన సమస్తపాపముక్తుడై, యిష్టార్థ సిద్ధిని బడయుచున్నారు. సులభమగు యితర పుణ్యకర్మలచేతను దుర్లభమగు కార్యములవలనను, సిరిసంపదలచేతను గోవిందు డానందింపడు. భక్తియుక్తుడై పూజించిన వానికి భగవాను డిష్టార్థము నొసంగును, గాన సదా నారాయణుని యందే భక్తియుండున ట్లభిషింపవలెను. భక్తితో శ్రీహరి నీటిబిందువుచే నారాధించినను అతడు ప్రీతుడై సర్వాయాపదలను బాపును.

దాహముగలవానికి జలమిచ్చిన నానందము నొందినట్లు శ్రీహరి భక్తి గలిగి పూజించినవాని ధర్మమునకు మిక్కిలి ప్రీతెందును. భక్తితో కూడిన కర్మలేశమైనను విశేషఫల మొసంగును. భక్తిశూన్యమైన కార్య మెంత ఘనముగా నొనరించినను తమా స్వల్పమే కనబడును. కర్మవలన మిక్కిలి ఫలితముకలు? నప్పుడు అది స్వల్పముని [illegible] కర్మానుసారములై యున్నవి. [illegible] తెలిసికొనుట కష్టము. వైశాఖమాస ధర్మములు సులభసాధ్యములు, ద్రవ్యమును వెచ్చపెట్ట వ్యయపరుచనక్కరలేదు. అయినను పురుషుని కర్మఫలితములకు కారణములుగావు. కాని విష్ణువు నానందిపచేయును, శుభములనొసంగును. అందువలన యీ శుభంకరఃలగు వైశాఖధర్మములను నీవు తప్పక చేయుము. నీరాజ్యమందు ప్రజలందరిచేతను చేయింపుము. అనేకరీతుల బోధించినను వినక మూఢుడై వైశాఖమాస ధర్మములను నిర్వహింపని మానవుని నీవు దండింపవలయును, ఇట్లు వేదములచే నివేదితమైన వైశాఖమా సలను పూర్తిగా వసిష్ఠుడు కీర్తిమంతునకు జెప్పగా రాజామాటలను విని గురువును భయభక్తులతో పూజించి తన గృహమునకు పోయి వైశాఖమాస ధర్మముల నన్నిటిని నిర్వహించెను. కీర్తిమంతుడు

దేవాది దేవుండును, వినయరహితుండును, నగు విష్ణువందు భక్తి కలిగి వేత్రాకరి యందు రక్తి లేకయుండెను.

కీర్తిమంతుడు తన రాజ్యమందుగల ప్రజలకు, యేనుగనెక్కి భేరీధ్వని జేయుచు నిట్లు పలికెను. నా రాజ్యమందు, యెనిమిది సంవత్సరములకంటె నెక్కువ వయస్సుగలవారును, యెనుబది వర్షముల వయస్సుకు తక్కువ గలవారును, అగు జనులందరు, సూర్యుడు మేష రాశియందుండగా వైశాఖమాసమున ప్రాతఃకాలమందు స్నానమాచరించవలెను, అట్లు చేయనివారు. నాచే దండ్యులును, వధ్యులును కాగలరు. లేదా నా నా రాజ్యమునుండి పోవలయునని చాటింపించెను. తండ్రిగాని, కుమారుడుగాని, భార్యగాని, మిత్రుడుగాని వైశాఖమాసమందు ధర్మములను చేయనివారిని నేను దొంగను శిక్షించినటుల దండింతును సూర్యోదయకాలమున లేచి పవిత్రమైన నీటిలో స్నానమాడి, విప్రులకు దానములు చేయవలెను. పుణ్యవంతులారా! చలివేంద్రలు మొదలగునవి పెట్టి ధర్మములను ఆచరింపవలెను. అని కీర్తిమంతుడు రాజ్యమంతటను చాటింపించెను. వైశాఖమాస ధర్మములనుగురించి చెప్పుటకు విప్రునొకని ప్రతి గ్రామమునందును శాపురముంచెను. ధర్మములను చేయనివారిని దండించుటకు పది గుఱ్ఱముల నొసంగి అయిదు గ్రామముల కొక యధికారిని నియోగించెను. యీరీతిగా కీర్తిమంతుడు తన రాజ్యమంతటను శాసనము చేసెను, అందువలన అతని రాజ్యమందు ధర్మవృక్షము స్థాపనమయ్యెను. అతని రాజ్యమందు, స్త్రీలుగాని, పురుషులుగాని మరణించిన యెడల విష్ణులోకమును పొందుచున్నారు. వైశాఖమాసమున సూర్యుడు మేషరాశియందుండగా యేవిధముచేతనైనను సూర్యోదయకాలమునస్నానముచేసినవారు సమస్తపాపముల చేతను విడువబడి హరిసాన్నిధ్యమును తప్పక పొందగలరు.

ఎవడు తన యజమాని యొక్క సొమ్మును అనుభవించు[ను] వాని పనిని జేయక యూరకుండునో వాడు తప్పక నరకము[ను] పొందును. ఆ మహారాజు దైవవశమున మరణించజేని బ్రహ్మదేవుని సత్యలోకమునకు వెడలి బ్రహ్మతో నీ విషయమును నేను చె[ప్పు]దను. అంతట నాలోకమునకు వచ్చి సుఖించును. అప్పుడు నావల[న] తప్పిదముండదు. అని యీ విధముగా నారదునితో యమధర్మరాజు చెప్పిపంపెను. పిదప యమధర్మరాజు భయంకరమైన యమదండమును ధరించి దున్నపోతువాహనమును అధిరోహించి, మరణము, రోగము, జ్వరము లోనగు దుర్మతులగు నేబదికోట్ల సైనికుల[ను] వెంటబెట్టుకొని వేగముగా భూలోకమునకేగి, కీర్తిమంతుని రాజ్యమంతయు ముట్టడించి, లోకములన్నియు భయపడునట్లు గొప్పదైన తనశంఖమును పూరించెను, ఆశంఖధ్వనిని కీర్తిమంతుడు విని భాస్క దని పుత్రుండగు యమధర్మరాజుగా [illegible] ంతను సమకూర్చుకొని [illegible] ఎదురు దేరెను.

రెండు సైన్యములకు [illegible] భయంకరమైన యుద్ధము జరిగెను. భయంకరాకారులగు మృత్యువు, కాలుడు, రోగము, జ్వరము మొదలగు యమదూతలనందరిని కీర్తిమంతుడతిత్వరితముగాజయించి, కోపమును బూని వారిని పారిపోవునట్లు గావించెను. అంతట యమధర్మరాజు కోపముగలవాడై కీర్తిమంతు ననేకరీతుల బాధగలుగునట్లు బాణములనువేసి పిమ్మట సింహనాదము గావించెను. కీర్తిమంతుడు మూడు బాణములనువేసి యమధర్మరాజుయొక్క ధనుస్సును ముక్కలు చేసెను. యమధర్మరాజు మరల చర్మముగల కత్తిని దీసికొని కీర్తిమంతుని జంపుట కుద్యమించెను యముని జూచి రాజుకోపముతో వానికత్తిని వరను తెగనరికి, కాలసర్పముతో సమమగు బాణమును ముఖముందు వదలగా యముడు కోపముతో,

తనకు ముఖ్యమగు ఆయుధమైన కాలదండమును తీసెను. బ్రహ్మాస్త్ర ప్రయోగమంత్రమును పఠించి కాలదండము నారాజు మీదకు విసరగా, జనులందరును మిక్కిలి క్రూరమగు కార్యము కలిగెనని యాశ్చర్యమును పొందిరి.

విష్ణువు, తన భక్తుని రక్షించుటకై తన చక్రమును పంపించగా, విష్ణుచక్రము వెంటనే యుద్ధభూమికి వచ్చి బ్రహ్మాస్త్రమంత్రముతో ప్రయోగింపబడిన యమధర్మరాజుయొక్క కాలదండమును ఓడించి, వెయ్యి అంచులు గల విష్ణుచక్ర మా యముని చంపుట కుద్యమించెను హరిభక్తుడగు కీర్తిమంతు డదిగని భయపడి చక్రమును ప్రార్థించెను. సహస్రారమును, మహాద్భుతాకారముగలిగి విష్ణుమూర్తి చేతి కలంకారమైయుండు చక్రరాజమా! నీకు నమస్కారము. పూర్వము సమస్తలోకములను రక్షించు నిమిత్తము నిన్ను తన కరమున బూనెను. నిన్ను, విష్ణుభక్తుడను బలవంతుడను అగు యముని రక్షించుటకు యిప్పుడు ప్రార్థించుచున్నాను. ప్రపంచాధిపతివగు చక్రమా దేవతల కపకారము చేయు మానవులను దండించుటకు యముడవు నీవే కాని వేరెవకుడు లేడుగాన యీ యముని రక్షింపుమని ప్రార్థింపగా నాచక్రము యముని విడచి, యాకాశమార్గమున దేవతలు చూచుచుండగా కీర్తిమంతుని చేరెను,

మహారాజా! వైశాఖమాసమున యీరీతిగా సూర్యోదయమందు స్నానమాచరించినందున మానవు లొక్కరును యమలోకమునకు వెళ్ళుటలేదు. అందువలన యమధర్మరాజునకు లెక్కలు చూడవలసినపని తగ్గినది. చిత్రగుప్తుడు లెక్కలు వ్రాయవలసిన పని లేనందున పనిలేక యూరకుండెను. పైగా ప్రస్తుత మాచరించిన పుణ్యమువలన పూర్వమందున్న పాపముల లెక్కకూడా తీసివేయ

వలసివచ్చెను. మానవు లీరీతిగా పుణ్యవంతులై విష్ణులోకమును జేరుచున్నందునను యమలోకమునకు పోనవసరము లేనందునను నరకలోకము లన్నియు శూన్యములైనవి. యములోకమునకు పోవు మార్గమున నడచువారు లేకుండిరి. మనుజులందరును మాధవభక్తి పరాయణులై రమాధవుని లోకమున పవిత్రమానసులై యుండిరి. దేవతాలోకములు గూడ శూన్యమైనవి. స్వర్గము నరకముగూడ శూన్యముకాగా నారదుడు యమలోకమున కేగి యమధర్మరాజుతో నిట్లు పలికెను. యమధర్మరాజా! పూర్వకాలమందు నరకలోకమున రోదనములు వినబడుచుండెడివి. ఇప్పుడట్టి ధ్వనులు వినబడుట లేదు. కారణమేమి? చిత్రగుప్తుడు జీవులపుణ్యపాపముల వివరణలను దెలుపు లెక్కలను వ్రాయుటలేదు. మౌనమువహించి పనిలేక మునులతో ముచ్చటకైన మాటాడక యూరకుండెను. ఏమి కారణము? సామాన్యముగా మానవులు మిక్కిలి పాపములను జేయుచు మాయలను మోసములను గావించుచు దుర్గుణవంతులై యుండి మరణించినపుడు నీలోకమునకు వచ్చుచుందురుగదా! అట్లు రాకుండుటకు కారణమువేమి? అని నారదు డీవిధముగా యమధర్మరాజు నడుగగా మిక్కిలి దీనమగు వదనముతో యముడిట్లు చెప్పెను.

నారదమునిచంద్రమా! ఇప్పుడు భూలోకమును పాలించు కీర్తిమంతుడనురాజు సర్వదేవతాచక్రవర్తి యగు శ్రీమహావిష్ణువునకు భక్తుడు ఎనిమిదియేండ్లు పైబడినవాడును యెనుబదిసంవత్సరములకు లోపువాడును వైశాఖమాసధర్మములను చేయవలెనని ఘోషింపజేసి ... తన రాజ్యమందు రాజు చాటింపించెను. వైశాఖధర్మములు చేయనివారిని దండింతు ననెను. గాన ఆరాజు శాసనమువలన భయపడి జనులందరును తప్పక వైశాఖధర్మములను జేయుచుండిరి.

దేవమునివల్లభా! పుణ్యమువలన హరిమందిరమును మనుజులు చేరుచున్నారు. అందువలన నాలోకమునకు యెవరును రాకుండిరి. మార్గము నడచువారులేక శూన్యగతిని పొందినది. నరకము లన్నియు పాపులు లేక శూన్యముగానున్నవి. యాగాదిక్రతువులు చేయనందున దేవేంద్రాదిలోకములు శూన్యమైనవి. ప్రజలందరు కర్మల నన్నిటిని విడచి విష్ణుభక్తిని మాత్రమే పొందియున్నారు. లేఖకుడైన చిత్రగుప్తుడు వ్రాయుటకు తగిన లెక్కలు లేనందున పనిలేకయున్నాడు. వెనుకటిపాపములుకూడ యీ పుణ్యములవలన తీసివేయవలసివచ్చినది. గాన యీ వైశాఖమాసమందలి ధర్మము లను ఆచరించుటవలన గలుగు ఫలిత మింత మహత్తుగలిగియున్నది. మనుజులు యీ పుణ్యమువలన బ్రహ్మహత్యాదిమహాపాపములనుండి కూడ విడువబడి శ్రీహరిలోకమును చేరుచున్నారు. నేను యీ కారణమువలన యేపనియులేక కట్టెవలె అట్టె నిలిచియుంటిని. గాన మహాబలముగలవాడైనను కీర్తిమంతుని చంపవలెనని నేను తలంచి యుంటిని.

యమధర్మరాజు మిక్కిలి భయముగలవాడై కష్టపడుచు బ్రహ్మలోకమునకు వెడలి సమస్తవిధములగు జీవులచేతను చుట్టు కొనబడియున్న బ్రహ్మదేవుని జూచెను. బ్రహ్మదేవుడు దేవతలకు ఆధారభూతుడు. లోకములకు కారకుడు అన్నిలోకములకంటె పూర్వమువాడు అష్టదిక్పతులచేతను యితరదేవతలచేతను కూడ సేవింపబడువాడు. దేహసహితులగు యితిహాసములు, పురాణములు, వేదములు, ఆకారమును గలిగిన సముద్రములు, నదులు, సరస్సులు, రావిచెట్టు లోనగు తరువులు దిగుడుబావులు, మాతలు, పురములు, పర్వతములు, దినములు, రాత్రులు, పక్షములు, మాసములు, సంవత్సరములు, కళలు, కాష్ఠలు, నిమేషములు, ఋతువులు, అయనములు,

యుగములు, సంకల్పములు, వికల్పములు, రెప్పపాటులు, నక్షత్రములు, యోగములు, కరణములు, పూర్ణిమలు, అమావాస్యలు సుఖములు, దుఃఖములు, భయములు, లాభములు, నష్టములు, జయములు, అపజయములు, సత్వ, రజస్తమోగుణములు గల వారును, శాంతము, అజ్ఞానము, క్రూరత్వము, వికారము, ప్రకృతి లోనగు మాయామోహితగుణములును, దేవతల కాధారమగు వాయువు, శ్లేష్మము, పైత్యము లోనగు గుణములును పరివేష్టించి పరిపూర్ణవంతమై విరాజిల్లుచుండ బ్రహ్మదేవుడు నిండు పేరోలగంబున సుఖాసీనుండై యుండెను. ఆ సభాంతర్భాగమునకు సిగ్గుచే తడబడు తరుణీమణివలె యమధర్మరాజు నేల చూపులతోనే వెడలి కూర్చుండగా విన్ననైన దీనమగు వదనముతో నున్న యముని యతని యనుచరులను గూడ దిలకించి సభయందు గల వారిట్లు తమలో దాము చెప్పుకొనసాగిరి.

యమధర్మరాజు లోకమందు సృష్టికర్తయు సమస్త ప్రాణికోటి కాదిదేవతయు నగు బ్రహ్మదేవునివద్దకు యెందుల కేతెంచి యుండును? ఇతడు పని లేక యిట్లు ఒక క్షణకాలముగూడ యూరక యుండువాడు కాడు. ఇతడు దేవతల శుభమునిమిత్తమై వచ్చి యుండునా? ఇతర కారణ మేదైన గలదా? పాపములను రద్దు పరచినపటమును జూడగా ఆశ్చర్యము కలుగుచున్నది. లేఖరియగు చిత్రగుప్తుని ముఖము విచారముతో నున్నది. యముని వెంబడించి వచ్చుచున్నాడు. ధర్మమును గుఱించి భయమును కలిగియున్న చిత్రగుప్తుడు వ్రాసిన పద్దును తుడిచియుండుట యెన్నడును కని విని యెరుగము. ఇప్పుడది జరిగినది. అని సభయందున్న దేవతలందరును చెప్పుకొనుచుండిరి. అంతట భూతములకు దండనాధికారియైన యమ ధర్మరాజు రక్షింపుము రక్షింపుమని యాక్రోశించుచు యేడ్చుచు

మొదలునరికిన తరువువలె బ్రహ్మదేవునికి సాష్టాంగ ప్రణామము గావించెను. బ్రహ్మదేవా! దేవాదిదేవా! నేనొక మనుజునిచేత పరిభవింపబడితిని. పుణ్యపాపములను వ్రాయుచున్న పద్దులపత్రములు రద్దుకాబడినవి. నీవు ప్రభుత్వము వహించియుండగా చేయుటకు పనిలేక తీరికగా నే నెన్నడును యుండలేను. అని యమధర్మరాజు చెప్పి సభలో నిన్నకుండెను.

బ్రహ్మదేవుని సభయందు గల జనులందరును పెద్దధ్వని గలుగునటుల తమలోతా మిట్లు చెప్పుకొనసాగిరి. యముడు సర్వజీవులను అచలము లగు పర్వతములు మొదలగు వానిని విచారమును పొందునట్లు బాధింపుచుండును. సూర్యకుమారుం డగు నీయముడు తానే విచారమును పొంది యెందువలన యేడ్చుచుండెనో తెలియదు. ఎవడు జనులను బాధించునో వాడే తప్పక బాధను పొందును. చెడుకార్యములను చేయువాడు మేలును పొందడు. అని సభలో మాట్లాడుచున్న సభికుల మాటలను వాయువు యాటంకపరచెను. సమస్తజీవులతో కూడియున్న బ్రహ్మదేవుని యభిమతము నెఱింగి సర్వజీవులకు ఆధారభూతుడును గొప్ప స్వభావముగలవాడును అగు వాయుదేవుడు యముని సమీపమందు గల సభికులను తొలగించి యేపిచెట్లవలె బలమైన తన భుజములచేత వానిని లేవదీసి మెల్లగా కూర్చుండజేసెను. మనస్సు నిలకడలేక స్వతంత్రములేక వికలుడై యున్న కాలుని వాయుదేవుడు ఆసనమందు ఆసీనుంజేసి యిట్లు పలికెను. యమధర్మరాజా! నీవు యే మనుజునిచేత తిరస్కారమును పొందితివి? ఎవడు నిన్ను నీ యధికారస్థానమునుండి వెడలగొట్టెను. పుణ్యపాపవివరణములు గల పద్దులపట మెవ్వరు రద్దుపఱచిరి? శ్వేతకేతు మహారాజు సమక్షమున నీవు జఱిగిన యావద్వృత్తాంతమును విడువక చెప్పుము. పిమ్మట నీకు నాకు అందఱికిని అధికారియగు

బ్రహ్మదేవుడు నీ మనోదుఃఖమును వారింపగలడు. అని వాయు దేవుడు సూర్యతనయుడగు యమునితో చెప్పగా యమధర్మరాజు కుశకేతుని కుమారుడగు కీర్తిమంతుని ముఖము చూచి బహు దీనత్వముతో వికలత్వముతో నిజమైన స్థితిని యీ రీతిగా చెప్పు చున్నాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున పదునొకండవ అధ్యాయము

## పండ్రెండవ అధ్యాయము

యమధర్మరాజు చెప్పుచున్నాడు. వాయుదేవా! బ్రహ్మ నా వాక్యములు వినుండు—నేను నా యధికారమునుండి తొలగ బడితిని. గాన నా యుద్యోగము పోవుట నాకు చావుకంటె హీన ముగా దలచితిని. అధికారిగా నియమించినప్పుడు అతడు తన యుద్యోగధర్మమును చక్కగా నిర్వర్తింపవలెను. అట్లు చేయని వాడు యజమానియొక్క ధనమును అన్యాయముగా ననుభవించు టయే గాక కర్రను దొలుచుకొని తిను కీటకజన్మమును పొందును. ఎవడు మిక్కిలి ప్రజ్ఞావంతుడయ్యును ధనమందాశచే తన యుద్యోగ ధర్మమును నిర్వహింపక స్వామివిత్తమును గ్రహించునో వాడు మూడువందల కల్పములవరకు నరకలోకమునం బడి తిర్యగ్యోని జాతుండై యుండగలడు. ఉద్యోగమందు నియమింపబడి ధనాశ లేక ఉద్యోగధర్మమును నిర్వహింపకయుండునో వాడు మిగుల కష్ట మగు నరకము ననుభవించి తుదకు కాకిజన్మమును పొందును.

ఏనరుడు తపనిని నిర్వర్తించుకొని స్వామికార్యమునకు భంగ మొకలిగించునో, వాడు పాపాత్ముడగును గాన మూడువందల కల్పములవరకు ఎలుకయై పుట్టును. ఎవడు అధికారిగా నియమింపబడి పనియందు సమర్థుడై యుండియు పనిచేయక యుంటియందే కాలము గడపునో వాడు పిల్లియై పుట్టును. బ్రహ్మదేవా! నేను మీ యానతి ప్రకారము పుణ్యపాపములను విచారించి జీవులను పరిశీలించి, పాపాత్ములను దండించించి పుణ్యవంతులనే వదలుచు ధర్మమును దప్పక పరిపాలించుచున్నాను. ధర్మశాస్త్రవిదులగు మహామునులతో బాగుగా సంప్రతించి ప్రళయకాలమందు ఆదియందును అంతమందును గల కష్టములను కలిగించుచుందును. నీ యానతిని పాలింపదలచిన నేను నీ యేర్పాటు ననుసరించిన యధికారమును వహించుటకు సమర్థుడను కాను. ఆ యధికారమును కీర్తిమంతుడను రాజు తొలగించినాడు. దానిని నీవు గమనింపలేదు. లోకాధిపా! ఆకీర్తిమంతుడు చతుస్సముద్రాముద్రితమైన భూమండలమంతయు వైశాఖమాస ధర్మములను వ్యాపింపజేసి పాలించుచుండెను.

వైశాఖమాసధర్మములనగా తలిదండ్రులను పూజించుట, పెద్దలను గౌరవించుట, తీర్థయాత్రలను సేవించుట, సాంఖ్యాదియోగములను, ప్రాణాయామాది నియమములను, హోమము, స్వాధ్యాయములోనగునిష్ఠలను విడచి అనేకవిధములగు పాపములను చేసినను, వైశాఖమాసధర్మములను నిర్వహించిన మానవులు వారి తాతతండ్రులం గూడి స్వర్గలోకమును పొందిరి. ఇంకను వారి పితృ, పితామహ, ప్రపితామహాదులందరును హరిసాన్నిధ్యమును పొందిరి. వారి సోదరులు, మాతయు కూడ వైకుంఠమును జేరిరి. నాకు కల్గిన యీ విచారమును, అవమానమును తలచుకొనిన నా శిరస్సును ఖండించినట్లున్నది. భార్యాసంబంధులగువారు తమ పాపములను

పద్దులను వ్రాయు పత్రములందు తుడిచివైచి విష్ణులోకమును పొందు చున్నారు. తండ్రులవలన ఉపమాతలయందు జన్మించినవారు కూడ వైశాఖ ధర్మనిర్వహణమువలన కలిగిన ఫలితమువలన వైకుంఠమును పొందుచున్నారు. పుణ్యముచేసినవాడు పుణ్యగతిని పాపమాచరించినవాడు పాపఫలమును పొందుట స్వాభావికమైయున్నది. ఇప్పు డట్టిది జరుగుటలేదు. ఏమానవుడైనను వైశాఖమాస ధర్మములను అనుష్ఠించిన యెడల, అతడు తన వంశమందుగల యిరువది యొకు తరములవారిని పాపరహితులనుగా జేయుటకు సమర్థత గలుగు చున్నాడు. జగన్నాథా! భార్యాసంబంధు లందరును వైకుంఠమును పొందుచున్నారు. మీ యుద్యోగమువలన సుఖములేదు. వైశాఖ మాసమునందు జేయదగు ధర్మములయం దాసక్తిగలవాడు, పాప రహితుడై, శుభమును పొంది నన్ను వదలి యిరువది యొక్క తర ములవారితో గూడ వైకుంఠమును పొందును. యోగము చేసినను పొందనేరని విష్ణులోకమును, వైశాఖమాస ధర్మములను నిర్వహించి నన్ను విడచిన యెడల పొందగల్గుచున్నాడు.

మానవు డెన్ని తీర్థయాత్ర లొనరించినను, దానము లొనర్చి నను, తపస్సులు గావించినను వ్రతములు చేసినను, ధర్మములు నిర్వర్తించినను వైశాఖమాసమున జేయు ధర్మములతో సమానమగు ఫలితమును పొందనేరడు. మనుజులు ప్రయాగతీర్థమును సేవించుట చేతను, రణమందు మరణమొసంగుటచేతను భృగుప్రస్రవణములను నీటికుండములందు మునిగినను, కాశీపుణ్యక్షేత్రమున కాలగతిని పొందినను, వైశాఖమాస ధర్మములను జేసినందున గలుగు ఫలిత మును పొందజాలరు. సూర్యోదయకాలమున స్నానమాచరించి శ్రీహరిని పూజించి వైశాఖమాస ధర్మములను విని, చేయదగిన హరి ప్రీతికరములగు కార్యములను చేసిన మనుజుడు శ్రీహరి సాన్నిధ్య

ముసుచేరును. పాపాత్ములు కూడ నాలోకమునకు రానేరక, వైశాఖమాస ధర్మాచరణ జనితపుణ్యలేశమువలన విష్ణులోకమే తమ కాశ్రయమని తలచుచున్నారు. బ్రహ్మదేవా! సత్కర్మలను చేసినవారు, చేయనివారు, పవిత్రులు, అపవిత్రులు కూడ రాజాజ్ఞను పాలించి వైశాఖ ధర్మములను చేసి, విష్ణులోకమును పొంది యచ్చటనే నివసింపుచున్నారు.

బ్రహ్మదేవా! మాకు శత్రువులైనవారు మీకు కూడ విరోధులే గాన కీర్తిమంతుని తప్పక శిక్షింపుము. ఉపనయనాదికము లేని అపత్రువిలుకూడ, అన్ని సత్కర్మలనువిడచినను, ఒక్కసారియైన వైశాఖమాసమందు సూర్యోదయకాలమున స్నానము చేసిన శ్రీహరివైకుంఠమును పొందుచున్నారు, కీర్తిమంతుడు, శ్రీహరిపదముల నాధారముచేసికొని, మనము మిన్నకుండుటవలన మానవలోకమునంతను మాధవ మందిరమున కనుపుచున్నాడు. ప్రభో! నా నమస్కృతులగొనుము-పాపపుణ్యములను వ్రాయు పుస్తకమును దీసికొనుము నాకిక వీనితో పనిలేదు. నీపాద సన్నిధినుంచితిని. కీర్తిమంతుడు నా పదవిని తొలగించెను. నావంటి పుత్రుడు గలుగుట తల్లికి చేటుగల్గుటకు గాని వేరుకాదు. జ్యేష్ఠమాసమున మార్తాండుడు ప్రకాశించునట్లు" విరోధులను నిరోధింపనివాడు వ్యర్థుడు. ఉపయోగములేని కుమారుని గనిన తల్లియు నట్టిదియే యగును. మేఘము నుండి కలిగిన మెరుపు యొక్క కాంతి ప్రకాశించుట యెట్లు నిలకడలేదో ఆలాగుననే వ్యర్థుడగు పుత్రుని గనిన యాతుదాని కీర్తియు గూడ ప్రకాశింపజాలదు. కుమారుడు, తన విద్యచేతనుగాని, బలము చేతనుగాని, తండ్రి యొక్క పాపములను బాపజాలడేని, అతడును వ్యర్థుడేయగును. కీర్తివంతుడుగాని కుమారుడు భూమియందు తల్లి కడుపున బుట్టినరోగమే పురుషాకృతివహించినదని ఘోరుంగున్ను

ధర్మార్థకామములను పురుషార్థములను సంపాదింపని పుత్రుడు వ్యతిరేకధర్మముల నాచరించి హీనుడై మాతృహత్యాది పాపములను చేసినవాడగు ననుటలో సందియము లేదు. కీర్తిమంతుడు యితరులకు దుర్లభమగు నా వ్రాతలను కూడ రద్దుపరచెను. కమలాసనా! కీర్తిమంతుని తల్లియే వీరమాతయనదగును. క్షత్రియ గృహిణియగును. లోకత్రయప్రశంసనీయమగు సత్కార్యాచారిణియగును. ఇట్టి కీర్తి యితరులకు రాదు. పూర్వము ఏరాజును యిట్టి ప్రయత్నమును చేయలేదు. ఇప్పు డట్లు జరిగినది. మహాభాగా! పురాణములం దెన్నడును పద్దులు రద్దుచేయుట యెఱుంగము. జగత్పతీ! హరియందు భక్తిగలవాడును, భేరీవాద్యములను గొప్పగా మ్రోయించి వైశాఖ ధర్మములను పాటించిన కీర్తిమంతుడను రాజుగాక వేరెవరును, నాలోకమునకు జీవులను చేరనివ్వక నాలోకమునకు వచ్చు మార్గమును శూన్యము చేసి యుండలేదు అని తలంచుచున్నాను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమందు
నారదాంబరీష సంవాదమున పంద్రెండవఅధ్యాయము

## పదమూడవ అధ్యాయము

బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడు—యమధర్మరాజా! ఇది చాల వింతగానున్నది. నీవేల విచారించెదవు? సజ్జనులకు చేసిన యపకృతి ఆమరణాంతము నుండగలదు. నామస్మరణమాత్రముననే వైకుంఠమును పొందజాలునట్టి భగవంతునికి ప్రియమగు వైశాఖ ధర్మములను రాజాజ్ఞచే నిర్వహించినవారు విష్ణులోకమును బొంది రనుటకు యాశ్చర్యము లేదు. శ్రీ మహావిష్ణువునకు ఒకమాఘ

నమస్కరించినంతమాత్రమున నూరుయాగములు చేసి పిమ్మట యవ భృథస్నాన మాచరించినందువలన గలుగు ఫలితమును పొందును. యాగమును జేసినవాడు పునః జన్మించుచున్నాడు. కాని శ్రీహరికి నమస్కారమును చేసినవాడు తిరిగి జన్మింపనేరడు. సదా విష్ణునామ మును నాలుకయందు స్మరించువాడు కురుక్షేత్రము సరస్వతీ తీర్థము లోనగు తీర్థాటనములు చేయవలసిన పనిలేదు. చండాలవనితను గూడిన యుత్తమవిప్రుడైనను రజస్వలయైన కాంతను గూడిన పాపుడైనను, చనిపోవునప్పుడు శ్రీహరి నామస్మరణ మాచరించిన యెడల వైకుంఠమును చేరగలడు. హరిని స్మరించుటవలన విష్ణుప్రీతి యగును. అందువలన మనుజులు సామాన్యముగా తినరాని పదార్థ ములను తినినందువలన కలుగు పాపములను పోగొట్టి హరిసన్నిధాన మున నుందురు.

యమధర్మరాజా! వైశాఖమాస ధర్మములను వినినంత మాత్రముననే సర్వపాపములు హరించుచున్నవి. వైశాఖమాసము విష్ణువునకు ప్రీతికరమైనది. వైశాఖమాసధర్మములను చేయుటయం దాసక్తి కలిగినంతనే శ్రీహరి సంతసించునపుడు వానిని నిర్వహించిన యెడల విష్ణుపదప్రాప్తిని పొందుననుటకు సందియములేదు. పురు షోత్తముడు మనలనందఱను పుట్టించి లోకరక్షకుడై యున్నాడు. భగవంతుని సేవించినవాడు తప్పక వైకుంఠమును పొందును. విష్ణు ప్రీతికరములగు వైశాఖధర్మములను ఆ వైశాఖమాసమున చేయు వానికి శ్రీహరి యనుగ్రహించి సదా సహాయుడుగానుండును. గాన కీర్తిమంతుని శిక్షించుటకు నాకు సమర్థత చాలదు. హరిభక్తి గల వారికి పరాజయమెన్నడును కలుగదు. జన్మ, రోగ, జరామరణాదులవలన అట్టివారికి భయముండదు. స్వామి నియమించిన పనులయందు తనశక్తి వంచనలేక సాధనచేయుటకు ప్రయత్నించవ

వలెను. కార్యనిర్వహణ చేసినట్లు ఆ ప్రయత్నమువలననే
బడి నరకమును పొందడు. మానవు డొకపనిని సాధింపయత్నించి
అనేకరీతులుగా చేసి సఫలత పొందుటకు సమర్థత లేకయున్నప్పుడు
తన యజమానితో నీ విషయమును చెప్పినయెడల అతని సేవకుడు
ఋణము దీరిపోవును. దానివలన పాపముండదు. సుఖముకలుగును.
ఎవడైనను తాను చేయుకార్యమందు ప్రయత్నించి సమర్థత లేక
విఫలుడైన దానివలన దోషములేదు. గాన యమధర్మరాజా! నీవు
శక్యముగాని పనినిగుఱించి విచారపడకూడదు.

కమలాసను డీ విధముగా సూర్యకుమారునితో చెప్పగా
నతడు విని మిక్కిలి విచారమును పొంది కండ్లవెంట నీటిని వదలుచు
దీనమగు స్వరముతో నిట్లు చెప్పెను. మహానుభావా! నీ పాదసేవ
నముపలన నేను సర్వమును సంపాదించితిని. పద్మసంభవా! నేను
మఱల యుద్యోగమును జేయను. కీర్తిమంతుడు భూలోకమున
మిక్కిలి పరాక్రమవంతుడై రాజ్యపాలనము చేయుచుండగా నాకు
యుద్యోగము వలదు. కీర్తిమంతుని వైశాఖమాసధర్మముల నాచ
రింపకుండ భ్రష్టుని చేయవలెను. అప్పుడు గయలో పిండమును
వేసిన కుమారునివలె కార్యము సానుకూలమగును గాన దయా
ఘనా! యీ కార్యమును నీవు చేసి నా యుద్యోగమునకు భంగము
లేకుండ గావింపుము. నేను చెప్పిన రీతిని నీవు గావించితివేని శత్రు
వులవలన భయములేనివాడనై నీ యానతిమేరకు నా యుద్యోగ
మును చేసికొందును అని కాలునిచే పలుకబడిన మాటలకు బ్రహ్మ
దేవుడు కొంతవడి విచారించి అనేకరీతులుగా యమధర్మరాజును
బ్రతిమాలుచు యిట్లు చెప్పెను.

సూర్యపుత్రా! కీర్తిమంతుడు శ్రద్ధగలవాడు గాన నీచే
శిక్షితుడు కాడు. నీకతనిని ధర్మభ్రష్టునిగా జేయవలెనను సంకల్ప

మున్న యెడల మనము హరిమందిరమునకు జని జరిగినదంతయు విన్నవించి చేయదగు కార్యమును గురించి యాలోచింతము. ఆయన చెప్పినరీతిని చేయుదము. అతడే లోకములను సృజించుచున్నాడు. అతడే ధర్మములను రక్షించును. అతడే దండనాథుడై మనలను శిక్షించుటకు కర్తయైయున్నాడు. ఆయన మాటకు మాఱువల్కుటకు మనకు సమర్థత లేదు. ఆయన భక్తుడగు కీర్తిమంతుని మాటకు తిరిగి బదులు మాటాడువా రీ భూలోకమందు లేరు. అని బ్రహ్మదేవుడు యమునితో మంచిమాటలు చెప్పి పాలసముద్రమునందు ప్రకాశమానుడును, గుణరహితుడును; సాంఖ్యాదియోగ పురుషులతో గూడినవాడును. అసమానుడును, సమస్తమగువారిలో నుత్తముడున్నగు నా పరమాత్మను ప్రార్థింపగా శ్రీహరి బ్రహ్మదేవునికి ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మదేవుడును, యమధర్మరాజును వెంటనే గోవిందునకు ప్రణామంబు లొనర్చిరి. పురుషోత్తముడు గర్జితధ్వనితో వారితో నిట్లు పలికెను.

బ్రహ్మదేవా! మీ రిరువురు యీ రీతిగా వచ్చిన కారణమేమి? రాక్షసులవలన బాధ యేమైన కలిగినదా? యమధర్మరాజు వదనము విన్నబోయి యున్నదేమి? అత డెందుల కిట్లు ముఖమును క్రిందికి వంచుకొని యుండెను? యీ విషయమంతయును చెప్పుమని బ్రహ్మదేవుని విష్ణుమూర్తి యడుగగా బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడు. ప్రభూ! పురుషోత్తమా! నీ వరముచే కీర్తిమంతు డధికబలుడై భూమిని పాలింపుచుండగా జనులు వైశాఖమాస ధర్మముల నాచరించి అచలమగు నీ సన్నిధానమును జేరుచుండుటవలన యమలోకము శూన్యమైనది. దానివలన యముడు మిక్కిలి విచారించుచున్నాడు. కీర్తిమంతునితో యుద్ధముచేసి తన కాలదండము నాతనిపై బంపగా యాతడు నీ చక్రమువలన రోషింపబడి విమ్ముఖ

నాయొద్దకు వచ్చెను. మహానుభావా! నీ భక్తులను దండించుటకు మేము సమర్థులముకాము. గాన నిన్ను శరణుపొందితిమి. అందు వలన కీర్తిమంతుని దండించిన సేవకుడగు యముని రక్షింపుమని బ్రహ్మ చెప్పగా విని విష్ణువు చిరునవ్వు నవ్వి బ్రహ్మదేవుని తోడను యమధర్మరాజుతోడను యిట్లు చెప్పెను.

రమాదేవి, ప్రాణములు, శరీరము, శ్రీవత్సము, కౌస్తుభము, వైజయంతి, శ్వేతద్వీపము, వైకుంఠము, క్షీరసముద్రము, ఆదిశేషువు, గరుత్మంతుడు లోనగువానినైన విడువగలనుగాని భక్తుని మాత్రము విడుచుటకు నే నుత్సహింపను. సర్వసుఖములను వదలి నా కొఱకు ప్రాణములను గూడ విడువ నుద్యుక్తులైనట్టియు, నా స్వరూపులును, మహాభాగులును అగు నా భక్తులను ఎట్లు విడుతును? గాన కాలుడా! నీ విచారమును తొలగించుటకు వేఱొక యుపాయ మాలోచింతును. కీర్తిమంతునకు భూలోకమున పది వేలవత్సరము లాయుర్దాయ మొసఁగితిని. ఆ పదివేలవత్సరములలో యెనిమిదివేల వత్సరములు గడచినవి. మిగిలిన రెండువేల వత్సరముల తదనంతరము కీర్తిమంతుడు నాసదనము జేరును. పిమ్మట వేనుడనురాజు పుట్టును. అతడు చెడు స్వభావముగలవాడై వేదములయందు ప్రసిద్ధి పొందిన యీ ధర్మములన్నిటిని నశింపజేయును. వైశాఖ ధర్మములు కూడ నశించును. అందువలన వేనుడు తన పాపములచే తానే నశించును. నేను పృథుడనుపేర రాజుగా పుట్టి ధర్మములను నడపి, వైశాఖ ధర్మమును కూడ జేసెదను. నాకు భక్తుడును, నాయందు ప్రాణముంచినవాడును, సమస్తసంపదలను సుఖములను వదలినవాడును, అగువాడరుదుగా వేయి కొక్కడుండెనేని అతడు ధర్మశేషమును నడపును. భూలోకమందు నాకు ప్రీతికరమగు ధర్మముల నెఱింగిన వాడొకడేయుండును. గాన నీ కార్యము సానుకూలమగును. విచా

రింపవలదు. వైశాఖమాసధర్మముల నాచరించు మహానుభావు లందరి చేతను నీకు కొంత భాగము నిప్పించెదను. పరాక్రమించి కీర్తిమం తునిచే గైకొనబడిన నీ భాగము నీ కిప్పించెదను. బలాధికుడగు శత్రువు అనుభవించును. తను భాగమును అనుభవించువారికి విచార ముండదు, గాన నీ భాగమును నీవు గ్రహించి సుఖింపుము.

వైశాఖమాసమున నిత్యమును స్నానము, అర్ఘ్యముచేయుచు, ఆఖరు దినమున నీటితోనిండిన కలశమును, పెరుగుతో గూడిన యన్నమును, నీ కొఱకై యే నరులు నివేదన గావింపరో, వారు వైశాఖమాస ధర్మకర్మములనుండి ముక్తులై వ్యర్థులగుదురు. గాన నాభక్తుడును, నీకు భాగము నిచ్చువాడును అగు కీర్తిమంతునిపై కోపమును విడువుము. లోకమున నీకు భాగమివ్వని వారి వైశాఖ ధర్మములకు విఘ్నమాపాదింపుము. న్యాయాన్యాయపరిపాలనాధి కారివగు నిన్ను వదలి నన్ను మాత్రమే పూజించిన వారిని, నా యానతి ననుసరించి శిక్షింపుము. నీకు కీర్తిమంతుడు భాగమిచ్చు టకై సునందుని పంపెదను. అతడు నా యానతి ప్రకారము నీకు భాగ మిప్పింపగలడు. అని శ్రీహరి చెప్పి యము డచ్చట నుండగానే కీర్తిమంతున కీ వృత్తాంతమును చెప్పి యమునకు భాగమిచ్చునట్లు చేయుటకు సునందుని పంపెను. అత డట్లు యేర్పాటుగావించి తిరిగి విష్ణు సన్నిధానమునకు వచ్చెను. ఇట్లు విష్ణువు యముని సమాశ్వ సించి యచ్చటనే యంతర్ధాన మందెను. బ్రహ్మయు ఆశ్చర్యముతో యమునికి బోధింపదగు విషయములను బోధించి, తన యనుచరులం గూడి సత్యలోకమునకు వెడలెను. యముడును సంతసించుచు తన లోకమునకు బోయెను.

విష్ణుమూర్తి యానతివలన సునందునిచేత యాజ్ఞాపింపబడి వైశాఖమాస ధర్మాసక్తులగువారు యమునికి భాగము నిచ్చుచుండిరి,

నరులు యముని ప్రమేయములేక యే ధర్మము లాచరించినను, వారి సంబంధమగు వైశాఖమాస ధర్మకర్మాచరణమువలన గలుగు ఫలితమును యమధర్మరాజు తానే తీసికొనుచుండును. వైశాఖమాసమున నిత్యమును స్నానమాచరించి, యమునికి గూడ నర్ఘ్యము నివ్వవలెను. అట్లు చేయని వారి పుణ్యమంతయు నశించును. వైశాఖమాసమున పూర్ణిమకు ముందు జలకలశమును, పెరుగుతో అన్నము యము నుద్దేశించి దాన మివ్వవలెను. పిమ్మట పితృదేవతలను గురువులను పూజింపవలెను. పిదప మధుదైత్యుని సంహరించిన శ్రీహరి నుద్దేశించి చల్లని నీరు, పెరుగు కలిపిన యన్నము, తాంబూలము దక్షిణసహితముగు పండ్లను కంచుపాత్రయందుంచి విప్రునకు దాన మియ్యవలెను. మిక్కిలి ప్రకాశమానమగు విష్ణుమూర్తి విగ్రహము గల ప్రతిమను వైశాఖమాస పురాణమును జెప్పు విప్రునకు దాన మిచ్చిన యెడల దేవుడు ప్రసన్నుడగును. వైశాఖ ధర్మములన్ను గుఱించి చెప్పువారిని తన సంపదకొలది పూజింపవలెను. సునందుని యానతి మేరకు కీర్తిమంతుడు రాజ్యము చేయుచుండెను. కీర్తిమంతుడు, ధర్మముల నాచరింపుచు న్యాయరీతిని రాజ్యమును పరిపాలించి పుత్రపౌత్రాదులతో గూడి యిష్ట సుఖముల ననుభవించి మిగిలిన యాయుర్దాయ కాలమును గడపి పిమ్మట వైకుంఠమునకు సకుటుంబముగా వెడలెను.

కీర్తిమంతుడు వైకుంఠమునకు వెడలిన పిదప వేనుడను రాజాధముడు రాజ్యమును చేయ మొదలిడెను. సమస్త ధర్మములను నశింపజేసెను. వైశాఖ ధర్మము లంతరింపజేసెను. దుర్మార్గ స్వభావుడై సంచరింపసాగెను. అందువలన భూలోకమున మోక్షసాధనమైన ధర్మములన్నియు పూర్తిగా రూపుమాసెను. ఒకడైనను శుభముల నిచ్చునట్టి వైశాఖమాస ధర్మములన నేవో యెరుగరైరి.

అనేక వేల జన్మలయందుగల పుణ్యలేశము చేతగాని వైశాఖ ధర్మములయందు శ్రద్ధకలుగదు బుద్ధిమంతుడవగు శ్రుతదేవా! పూర్వమన్వంతరమందున్న వేనుడు దుర్మార్గుడనియు. యిత డిక్ష్వాకు వంశమునందు బుట్టి వైవస్వతమన్వంతరమున నుండెననియు మున్నే నేను వింటిని. మీరు కీర్తిమంతుని పిమ్మట వేనుడు రాజయ్యెనని చెప్పితిరి. నాకు సందియము కల్గినది. దానిని వివరించి చెప్పుడని శ్రుతదేవు నడిగెను.

శ్రుతదేవు డిట్లు చెప్పెను. యుగములు, కల్పములు మొదలగు వ్యవస్థలచేత పురాణములందు కథలకు భేదమున్నను, వాటికి గల ప్రమాణమును కాదనుటకు వీలులేదు. నిత్యకల్పములు నడచుచుండగా కథ లెట్లు జరుగునో మార్కండేయుడు నాకు చెప్పెను. దానిని నీకు చెప్పితిని. అందువలన వైశాఖమాస ధర్మములు ఆ కాలమున ప్రసిద్ధివహింపలేదు. సంసారమందు విరక్తుడై వైశాఖ ధర్మముల నేరొక డో తెలిసియుండెడివాడు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున పదమూడవ అధ్యాయము

## పదునాల్గవ అధ్యాయము

శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. వైశాఖమాసమందు మార్తాండుడు మేషరాశియం దుండగా సూర్యోదయకాలమున స్నానమాచరించి శ్రీహరిని పూజించి హరికథను వినినవాడు సర్వవిధపాపముల నుండి ముక్తుడై విష్ణుమూర్తియొక్క యుత్తమలోకమైన వైకుంఠమును పొందగలడు. శ్రీహరికథను చెప్పుచుండగా నాకథను వినక

యితరమైన పనులను జూచు మూర్ఖుడు రౌరవమను నరక[illegible] పొంది పిశాచమై పుట్టును. ఇందుకు సంబంధించినదియు పూర్వ[illegible] జరిగినదియు పాపములను తొలగించునదియు పవిత్రమైనదియు [illegible] రూపముగలదియు నమస్కృతిని బొందదగినదియు నగు [illegible] యితిహాసము గలదు. దానిని చెప్పెదను వినుము.

పూర్వకాలమందు గోదావరీ నదీతీరమందు బ్రహ్మేశ్వరమను పుణ్యతీర్థము కలదు. అక్కడ సమస్తసం[illegible] విషయక పరిత్యాగులును బ్రహ్మము నెఱుంగగోరువారును వేదాంతవిద్యావిమర్శలు జరుపువారును వాంఛారహితులును, [illegible] టనవల్ల జీవితము గడపువారును, పుణ్యవంతులును, ముల్లో[illegible] యందు ప్రసిద్ధిని బడసినవారును అగు సత్యనిష్ఠుడు, తపోనిష్ఠుడు యిరువురు మునివల్లభులు భృగుప్రస్రవణమను పుణ్యస్థలమున నివసిం[illegible] చుండిరి. వారిలో సత్యనిష్ఠుడు సదా విష్ణుకథలను విను దుత్సాహము గలిగి వినుటకు చెప్పుటకు జనులు లేకున్నను బంధమగు కర్మలను చేయుచుండెను. ఒకప్పుడు వినుట కుత్సాహ[illegible] గలిగినవా డెవడైన సంభవించిన వానికి రాత్రింబవళ్ళు వి[illegible] విష్ణుకథలను వివరించి చెప్పుచుండెను. పవిత్రమును శుభప్ర[illegible] నగు పురుషోత్తముని కథ యే జనుడైన చెప్పుట సంభవించెనేని [illegible] పనులను మానుకొని ఆ కథలను వినుచుండును. దూరమునందు గ[illegible] తీర్థములను దేవాలయములను విరుద్ధకథలను యితరకర్మలను విడ[illegible] ఉత్తమమగు పురుషోత్తముని కథలనే వినును. వినువా రున్న యెడ[illegible] తానే చెప్పును. అతనికి విష్ణుకథలయందు గల ఉత్సాహము [illegible] యితరములందు లేదు. తనకు ధర్మబోధను చేయువారికి దుర్గ[illegible] లోనగు యాపదలు సంభవించినప్పుడు తానే నూతివద్దను స్నాన[illegible] [illegible]సి విష్ణుకథను వినును. కథ ముగిసిన వెనుక తన కర్మ[illegible]

చేయును. గాన శ్రీహరి కథలను వినువారికి మఱల జన్మముండదు. పురుషోత్తముని కథ వినుటవలన మనశ్శాంతి కలుగును. శ్రీహరి కథయం దనురక్తి కలుగును. సజ్జనులయందు ప్రీతికలుగును. సమస్త మైన కళంకములచే విడువబడి గుణరహితమైయున్న పరబ్రహ్మము వాని మనమందు విరాజిల్లును. జ్ఞానశూన్యునికర్మలు వృథాయగును. చెడుబుద్ధి గలవా రనేకకర్మలు చేసినను గ్రుడ్డివాని కద్దమువలన గలుగు ప్రయోజనమే కలుగును. గాన మనశ్శాంతి గలుగుటకు యత్నింపవలెను. నిర్మలహృదయమువలన పురుషోత్తముని కథా శ్రవణము కలుగును. దానిచేత జ్ఞానము సిద్ధించును. జ్ఞానసిద్ధివలన భగవద్భక్తి కల్గును. అనేకరీతులుగా హరికథలను వినుట, నమస్క రించుట వేదముల ననుసరించి విమర్శించుట భగవద్భక్తివలన కలు గును. పవిత్రమైన గంగానదీతీరమయినను విష్ణుకథలును, విష్ణుభక్త లును, సజ్జనులును ఉండనియెడల అవశ్యమును త్యజింపదగినది. తులసిచెట్టుగాని, హరిమందిరముగాని, విష్ణుకథాశ్రవణముగాని లేని చోట మానవుడు మరణించెనేని తమస్సు అను నరకమునం బడును. విష్ణాలయముగాని, లేడిగాని, హరికథాశ్రవణము గాని, సజ్జనులు గాని లేనిచోట మరణించినవా డనేకవేల జన్మలయందును కుక్కగా పుట్టును.

సత్యనిష్ఠుడను ముని వేదాంతము నామూలాగ్రముగా పరి శీలించుటకు నిశ్చయపరచుకొని విష్ణుకథలను సదా వినుట, హరి ధ్యానమును చేయుటయం దుత్సాహవంతుడై విష్ణుకథాశ్రవణము కంటె వేరొక దానిని ఎక్కువగా యెన్నడును తలచియుండలేదు. రెండవ మునియగు తపోనిష్ఠుడు కర్మలుచేయుటయం దాసక్తుడై అహంకారము కలవాడై విష్ణుకథల నాకర్ణించుటగాని చెప్పుటగాని చేయక, యితరులు చెప్పుసమయమున యే తీర్థమునకో స్నానార్థ

మరుగుచు, అచ్చట గూడ విష్ణుకథలు చెప్పుచుండినను వినక, విన్నచో తన కర్మలకు భంగము కల్గునను భయమును పొందుచు, నటనుండి వేరొక దూర ప్రదేశమునకు వెడలుచుండెను. అతని పార్శ్వమందుండు కర్మఠులుగూడ, పుణ్యతీర్థమందు సూర్యోదయ కాలమున స్నానాదికర్మల నాచరింపుచు సంగమన కాలమువరకుండి పిమ్మట యింటివద్ద గృహకృత్యములు నిర్వర్తింపుచుండిరేగాని, విష్ణుకథలను వినుటయందుగాని చెప్పుటయందుగాని ఆసక్తులై యుండ రైరి. ప్రభూ! యీ రీతిగా కాలముగడచుచుండెను. గాని ఒక దినమందునను చెడుబుద్ధిగల దురాత్ముడు విష్ణు కథలను నాలుకతో పలుకుటగాని, చెవులతో వినుటగాని చేయలేదు.

తపోనిష్ఠుడను ముని విష్ణు కథలను విననందువలనను, చెప్పనందువలనను చెడు స్వభావము కల్గినందువలనను, అహంకారము గల్గియున్నందునను కాలగతిని పొంది సిడప విష్ణుకథాశ్రవణము లేని పాపముచేత పిశాచమై చెవులు లేక ఛిన్నకర్ణుడను పరబలహీనుడై, ఆధారశూన్యుడై, ఆహార రహితుడై, శుష్కకంఠుడై, ఓష్ఠము తాలువులు నీరసించి యొక జమ్మిచెట్టుయందు వసించుచుండెను. ఈ రీతిగా పదివేల సంవత్సరములు గడచినవి. ఒకరును యితనిని రక్షింప బూనరైరి. అజ్ఞానుడైన యాతడు తన పూర్వజన్మార్జిత పాపలేశమునకు దుఃఖించుచు, ఆకలిబాధచే నలమటించుచు, మద మున పిచ్చెత్తినవానివలెసంచరింపుచు నివృత్తియను పదిలేక యుండెను. వాయుదేవు డితని దేహమునంటినంతనే అగ్నిమాదిరిగా నుండెను. నీరు తగిలిన ప్రళయాగ్ని బోలె నుండెను. ఫలములు, పువ్వులు విషతుల్యములుగా నుండెను. కర్మాసక్తుడగు ఆపిశాచము దీనుడై సుఖమించుకంతయు లేక జనసంచారములేని, విష్ణు కథలు వినబడని, సజ్జనశూన్యమైన అరణ్యము ఆధారముగా జేసికొని యుండెను. ఆ

మార్గమున దైవవిధిచేత సత్యనిష్ఠుడు పైఠీనసమను పురమునకు వెడలుచుండెను. మార్గమందు మిక్కిలి కష్టపడుచు, ఆకలిబాధ నొందుచు, తన్నుజూచి యేడ్చుచున్న ఛిన్నకర్ణుని జూచి సత్యనిష్ఠుడు భయపడకుమని యూరడించి నీవెవరవని యడిగెను. మరియు యిట్టి స్థితి నీకెందువలన కలిగెను? నీకష్టమింక తీరిపోవును. అని వాని నోదార్చెను. ఛిన్నకర్ణు డిట్లు చెప్పసాగెను.

మహానుభావా! నేను పూర్వకాలమున తపోనిష్ఠుడను మునీశ్వరుడను. దూర్వాసమహర్షికి శిష్యుడను. బ్రహ్మేశ్వరమను క్షేత్రమందు వసించెడివాడను. కర్మాచరణయందు అనురక్తుడను. దురాగ్రహముకలవాడను, చెడుస్వభావముగలిగి వివేకశూన్యుడనై కర్మలోపమునకు భయపడి సజ్జనులు చెప్పు విష్ణుకథలను విననైతిని. అనాదరవృత్తి జూపితిని. వినువారే తెంచినను వారికి పుణ్యప్రదమగు హరి కథలను చెప్పనైతిని. ఆపాపమువలన మరణించిన ఛిన్నకర్ణుడనుపేర విచారముతో కూడిన పిశాచమునైతిని. ఇట్టి కష్టమునుండి నన్ను తప్పించువారిని గానకుంటిని దైవవిధిచేత మీరిచ్చట కరుదెంచితిరి. మీ దర్శనభాగ్యముచేత నా పాపములన్నియు దూరమైనవి. నా యిష్టదేవతలు, గురువులు, సజ్జనులు లోనగువారందరును సంతసించిరి. శ్రీ హరియు నాయందు ప్రసన్నుడయ్యెను. అని చెప్పి మిక్కిలి యేడ్చుచు రక్షింపుమని తపోనిష్ఠుడు సత్యనిష్ఠుని పాదములను పట్టుకొని భూమిని ప్రాలెను.

కీర్తిమంతుడగు సత్యనిష్ఠుడు దయగలవాడై ఛిన్నకర్ణుని బలమైన తన భుజములతో లేవదీసి కూర్చుండజేసి నీటినితాకి వైశాఖమాసఫలితమును విన్నందువలన కలిగిన పుణ్యములో రెండుగడియల శ్రవణఫలితమును మాత్రము వానికి దానమిచ్చెను. ఆ మునిదత్తమగు పుణ్యలేశమువలన అతనియొక్క సమస్తపాపములు నశించెను.

ఛిన్నకర్ణుడు పిశాచరూపమును వదలి మంచిశరీరమును పొందెను. సత్యనిష్ఠుని చుట్టును తపోనిష్ఠుడు ప్రదక్షిణ మాచరించి నమస్కరించి యానతివడసి దివ్యవిమాన మెక్కి వైకుంఠము చేరెను. పిమ్మట సత్యనిష్ఠుడు వైశాఖమాస మాహాత్మ్యమును వినుటవలన యింతగొప్ప పుణ్యము కలదని పలుమారు తలంచుకొనుచు వైదీనసమను పట్టణము చేరెను.

శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. పుణ్యప్రదమును, శుభప్రదమును, పాపనాశనకరమును, నగు పురుషోత్తముని పుణ్యగాథ యెచ్చట ముచ్చటించుచుందురో అచ్చట సర్వవిధపుణ్యతీర్థములు, క్షేత్రములు కలవని తెలియవలెను. విష్ణుకథయను నది యెచ్చట ప్రవహించునో ఆ ప్రదేశమునం దుండువారికి మోక్షము కరతలామలకమని పెద్దలు పల్కుదురు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున పదునాల్గవ అధ్యాయము

## పదునేనవ అధ్యాయము

శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. మహారాజా! పాపములను తొలగించు వైశాఖమాసఫలితమును భగవానుడైన శ్రీహరియొక్క మహాత్మ్యను గురించి చెప్పుచున్నాను వినుము. పూర్వకాలమునందు పాంచాలరాజ్యమందు మిక్కిలి యశోవిరాజితుడగు పురుయశుడను రాజుండెను. అతనికి సుగుణవంతుడగు పుణ్యశీలుడను కుమారుడు గలడు. పుణ్యశీలుడు తండ్రి చనిపోగానే రాజ్యపరిపాలనను జేయుచు, శౌర్యౌదార్యాది సుగుణసంపద గలిగి ధనుర్విద్యాపారీణుడై ధర్మా

శక్తి గలిగి బహుయోచనపరుడై ధర్మముదప్పక సర్వరాజ్యమును పరిపాలించుచుండెను. దోషరహితుడవైన రాజా! ఆ పుణ్యశీలుడు పూర్వజన్మమున జలదానమును వైశాఖమాసమున చేయనందున పాపమును పొంది క్రమశః ఐశ్వర్యమంతయు పోగొట్టుకొనెను. ఏనుగులు, గుఱ్ఱములు, గొప్పరోగమువలన మృతినొందెను. మానవులందఱును నశించిపోగల కరవు మిక్కిలి గొప్పది కలిగెను. రాజ్యము నష్టపడెను. బొక్కసములలోని రొక్కమంతయు ఖర్చులేకనే యేనుగు మ్రింగిన వెలగపండురీతిగా నశించెను.

మహారాజా! చతురంగబలము, ధనము నశించినందువలన, పుణ్యశీలుడు బలహీనుడై యున్నందున, వాని శత్రువులందఱును, వీనిని జయించుటకిదే సమయమని తలచి, దండెత్తివచ్చి పుణ్యశీలునితో యుద్ధమాచరించి, వానిం బట్టుకొనిరి. పుణ్యశీలుడు యోడిపోయి శిఖినియను భార్యంగూడి పర్వతగుహాయందు ప్రవేశించి యోరిమితో తన నివాస మెవరికిని దెలియకుండునట్లు రహస్యముగా నుండి బహువిధముల కలతజెందుచు నేబదిమూడు సంవత్సరములు గడపెను. మిక్కిలి విచారముతో పుణ్యశీలుడు తనలో నిట్లు తలంచెను. ఇట్టి కష్టము నాకేల సంభవించినది! నేను నా పుట్టుక వలనను, నా కర్మలవలనను మిక్కిలి పవిత్రుడను. తల్లిదండ్రుల నతి భక్తితో పోషించితిని. గురువుయందు భక్తిగలవాడను, సత్కార్యములను జేయుటయం దనురక్తుడను. బ్రహ్మజ్ఞాన సంపదగలవాడను, ధర్మాసక్తిగలదు. సర్వభూత దయాపరుడను, దైవభక్తిగలవాడను, ఇంద్రియ నిగ్రహముగలవాడను, నా యొక్క సోదరులు, కుమారులు, మిత్రులు లోనగువారందఱు దయాపౌరుషములు గల్గి కీర్తి గాంచిరి. అధర్మపరులు మచ్చునకైన లేరు. అటువంటి సద్వంశమందు పుట్టిన నాకీవిధమగు కష్టము లెందుకు కల్గెనన! యీ శరీ

ద్రము ఏ చెడుకార్యమువలన కలిగినది ? ఏ కార్యమువలన పరాజయము పొందితిని ? అడవియందు కాపురముండుటకు కారణమేమి? అని రాజు తలంచుచు, వికలమగు మనస్సుతో సర్వవిదులగు మునులును, అగుయాజ, ఉపయాజకులను పేళ్ళుగల గురువులను దలంచెను.

పుణ్యశీలుడు మనంబున దలంచినంతనే యాజోపయాజకులిరువురు మునులును వచ్చిరి. రాజు, వారికి సాష్టాంగ నమస్కారమాచరించి, వనవాసమాచరించినందువలన కల్గు దుఃఖముచేతను, రాజచిహ్నములు లేకుండుటచేతను, రహస్యవాస మొనర్చుటచేతను, యేమియు మాటాడనేరక కండ్లవెంట నీర్గార్చుచు యుండెను. పిమ్మట వారతనిని లేవదీయగా, శుభప్రదములును, వన్యజములునగు పుష్పాదులచే రాజు వారిని పూజించెను. మునులిరువురు సుఖాసీనులైన పిమ్మట పుణ్యశీలు డవనతవదనుడై యిట్లనెను. విప్రులారా ! నేను రాజును. జన్మకర్మలచేత పవిత్రుడను, పితృదేవతా భక్తుడను, పాపభీతిగలవాడను, గురుభక్తిగలవాడను, భూతదయాపరుడను, నాకీ కష్టమేల కల్గెను, ధనము పోయి దరిద్రము సంభవించి దాయాదులచేత రాజ్యమును పోగొట్టుకొని యరణ్యమున నొంటిగానుండుట సంభవించిన హేతువేమి? కుమారుడనిగాని, సోదరుడనిగాని, మిత్రుడనిగాని, బంధువు అనిగాని పక్షము వహింపక సమదృష్టితోనుంటిని. ఇట్టి నాదేశమందు కరువు యెందుకు కలిగెను? ఆపదలేల కలిగెను? అనతిందని యడిగెను. ఆ మునులు కొంతసేపు యోగమువలనంబిరంబున దివ్యదృష్టిని గనుంగొని యిట్లు చెప్పిరి.

రాజా! నీ విచారమునకు కారణము చెప్పుచున్నాము వినుము. పూర్వజన్మములందు పదిజన్మములవరకు లోభకలవాడవై యుంటివి. సర్వజనులకును కఠినుడవైయుంటివి. హింసాత్మకబుద్ధి కలిగియుంటివి.

కొంచమైన ధర్మకార్యాచరణము గావింపలేదు. ఇంద్రియ నిగ్రహాది సుగుణసంపద నీయందు లేనే లేదు. నీ నాలుక యెన్నడును శ్రీహరి పేరు యుచ్చరింపలేదు. పరుషవాక్యములనే పలికినది మనస్సు మాధవుని తలంపలేదు.

ముకుందున కెన్నడును వందన మాచరించియుండలేదు. ఇట్లు క్రూరస్వభావముతో తొమ్మిదిజన్మములు గడపితివి. పదవజన్మమందు సహ్యాపర్వతమందు యెఱుకలవాడవై పుట్టితివి. క్రూరత్వము వహించి మానవులను లోకములను బాధింపజొచ్చితివి. దయా రహితుడవై శస్త్రసహాయమున జీవింపుచు, హింసాపరుడవై సుగుణ హీనుడవై, భార్యారహితుడవై మార్గమందు నడచువారిని బాధిం పుచు మూర్ఖుడవై యుంటివి. గౌడదేశమున మనుజమాంసమును దిను రాక్షసుడవైతివి. క్రూరమగు వృత్తిచేత సంచరింపుచు, మంచి తనమును పొందు యుపాయమును గానక కొంతకాలము గడపితివి. పిల్లలను, మృగములను, పక్షులను చంపుచు చెడుస్వభావముతో దయాశూన్యుడవై యున్నందున నీవు సంతతి లేకయుంటివి. నమ్మిన వారిని హింసించుటచేత సోదరీసోదరులు నీకు లేరు. మార్గమందలి బాటసారులను బాధించుటచేత మిత్రులు లేరు. సజ్జనులను నిరాకరించి నందువలన శత్రువులు నిన్ను ఓడించిరి. ఎప్పుడును దానముచేయక యున్నందున గృహమందు దరిద్రము సంభవించెను. సదా యితరు లను బాధించుటవలన వనవాసము సంభవించెను. అప్రియమగు పనులు చేయుటచే అనేకదుఃఖములను పొందితివి. మహానుభావా! పూర్వకాలమున మానవులను తినుటచేత తిండి లేనివాడవైతివి. సదా క్రూరకార్యములను చేయుచుండుటవలన నీ రాజ్యము శత్రువులచేత హరింపబడినది. నీవు మంచివంశమందు పుట్టుటకు కారణమును వివరించెదను.

గౌడదేశమున నీవు బెస్తకులవాడవై పుట్టి కంటక నికటంబగు యటవిం బడి దయారహితుడవై సమస్తజీవులను హింసింపుచు బాటసారుల బాధింపుచు చెడుమార్గమున బ్రదుకుచుంటివి. దైవయోగమువలన విత్తవంతులును, ధర్మబాహ్యులును నగు యిద్దరు వైశ్యులు వేదశాస్త్రములను చదివి జడలను వల్కలములను ధరించి కమండలువును గలిగియున్న పుణ్యవంతుడగు కర్షణుడను మునియు ఆ యడవిదారిని పోవుచుండిరి. కిరాతుడవైన నీవా ముగ్గురను ఆటంకపఱచి వారిని వెంబడించి ఆ వైశ్యులలో నొకరినిజంపి వారిధనమును గ్రహించి రెండవవానిం గూడ చంపనెంచిన నాతడు దనయొద్ద గల ధనమును సమీపమందలి పొదలో దాచి ప్రాణములను రక్షించుకొనుటకు పారిపోయెను. కర్షణుడును కిరాతుడు చంపునను భయముచేత పారిపోవుచుండెను. ఇట్లా యిరువురును వెళ్ళుచుండగా యెండలో పరుగెత్తుటచే అలసి దాహపీడితుడై మూర్ఛాగతుడై చెమట గారుచు కొనయూపిరితో కర్షణుడను ముని పడియుండగా తన ప్రాణరక్షణనిమిత్త మా కోమటి వానిని విడచివెళ్ళెను. అంత నీవు వారిని వెంబడించి భూమింబడియున్న విప్రునిజూచి కోమటి యొక్క వృత్తాంతమును అతడు దాచిన ధనవివరమును తెలుసుకొనునిమిత్తము ఆ విప్రుని బ్రతికింపదలచి తెలివిగా నుండుటకు చెవులలోనూది చిన్న మురికిగోతులలోని పురుగులతో కూడిన నీటిని దెచ్చి కండ్లు తుడిచి ఆకులతో ముఖమునకు తగులునట్లు చల్లనిగాలి వీచుచు విప్రుని సేదదేర్చి స్థిరమైన మనస్సుతో వానితో నిట్లంటివి. విప్రోత్తమా! నేను ఆయుధములను గలిగియున్నందున చంపుదునని భయపడకుము. లోకమందు ధనము లేనివానికి భయముండదు. దరిద్రునికి భయమేల? నీ పాత్రకూడ పగిలియున్నది. బుద్ధిమంతుడా! కోమటి యెచటికి వెళ్లెను? పారిపోవునపు డాతని ధన మేపొదలో

పారవైచెదు ? నిజముచెప్పుము. వేరుగా తలచి అనృతమాడితివేని చంపెదను. అని నీవడుగగా విప్రుడు ఇట్లుపలికెను.

అయ్యా ! యీ పొదలో కోమటి ధనముంచెను. యీ మార్గమున అతడు వెడలెను అని ప్రాణభయమున విప్రుడు నీతో పలుకగా నీవా విప్రునితో, ఆర్యా! నావలన నీకు భయములేదు. నీవు సుఖముగా యింటికి పొమ్ము ఇక్కడకు దగ్గరగా ఒక చెరువు కలదు. దానిలో పరిశుద్ధమైన నీరుకలదు. ఆనీటిని త్రాగి, అలసట దీర్చుకొని, నీయూరు జేరుము. నీవలసట జెందినందున నిన్ను కొంత వరకు పంపదలచితినిగాని వీలుగాలేదు. కోమటియొక్క యాక్రోశము విని రాజభటులు నన్ను వెదకుచు యిప్పుడే రాగలరు. గాన నీవీ యాకులతో విసరుకొని అలసట దీర్చుకొనుమని చెప్పి. మరల యడవికేగితివి. వేసవికాలమున నీ స్వలాభమునకా విప్రుని కుపచారము సల్పి బ్రతుక నిచ్చినందున వైశాఖమాసఫలితముగా గొప్పదగు రాజవంశమున బుట్టితివి. సుఖదుఃఖములుగాని ధనధాన్యాది సంపత్తులుగాని రాజ్యభోగముగాని, స్వర్గప్రాప్తిగాని, విష్ణుపదము గాని, మోక్షముగాని, నీవేదికోరినను, వైశాఖమాస ధర్మములనాచరించినందువలన కలుగును. వైశాఖమాసమున అక్షయ తృతీయ యందు యిదివరకే ప్రసవించిన ఆవును విప్రునకు దానమిచ్చిన యెడల రాజ్యము కలుగును. సూర్యోదయ స్నానమువలన విష్ణులోక ప్రాప్తి కలుగును.

జయమును, నీతోసమానులగు పుత్రులను కోరిన, మంచి విష్ణుప్రతిమను దానమివ్వవలెను. చలివేంద్రను యేర్పరచుము. సమస్త జీవులకు హితమును గలిగించు వైశాఖ ధర్మములను చక్కగా నిర్వహింపుము. ఫలాపేక్షలేక వైశాఖ ధర్మములను నిర్వహించితివేని ఆపుణ్యమువలన సమస్తలోకములు నీ యధీనమందుం

డును. పుణ్యవంతమగు వైశాఖ మాసమున పవిత్రమైన మనస్సు కలిగి విష్ణువు ప్రీతికొరకై ధర్మమును నిర్వహించిన యెడల శ్రీహరి సాక్షాత్కరించును. శుభప్రదమైన వైశాఖ ధర్మములను చేయు వారికి శాశ్వతమగు పుణ్యలోకములు కలుగునని పురాణములందు వేదవిదులు చెప్పిరి. మహారాజా! మేము చూచినవి, వినినవి, వైశాఖధర్మములను నీకు చెప్పితిమి. అని రాజునకు విప్రులును, పురోహితులును అగు యాజోపయాజులు చెప్పి వారి నివాసము నకు వెళ్ళిరి. అంతట రాజు మిగుల బలముగలవాడై శ్రద్ధతో మునులు చెప్పినట్లు శ్రీహరిని పూజింపుచు సర్వవిధ వైశాఖ ధర్మ ములను నిర్వహించెను. ఆరాజు ఆ వైశాఖ ధర్మముల మహిమ వలన గొప్ప బలమును గలిగి అందలి బంధువులను గూడికొని, తనకు మిగిలియున్న సేనలను చేర్చుకొని మరల పాంచాలపట్టణమునకు వెళ్లెను. రాజులందరును యుద్ధ సన్నద్ధులై వచ్చిరి. పుణ్యశీలుడు యితర రాజులతో యుద్ధ మొనరించెను. మహారథికుడైన పుణ్య శీలుడు రాజుల నందరిని జయించెను. రాజులందరు పరాజితులై పారి పోయిరి. రాజు బలవంతుడై వందున, ధనమును, యిండ్లను, ఏనుగు లను, గుర్రములను తన యధీనము చేసికొనెను. మూడు కోట్ల ఏనుగులు అనేక వేల గుర్రములు, అర్బుదములగు రథములు, పది వేల ఒంటెలు, మూడు లక్షల గాడిదెలు, ఆపురమున నిండియుండెను. వైశాఖమాసధర్మ మహిమవలన శత్రురాజులందరును ఓడిపోయి, పుణ్యశీలునకు పాదాక్రాంతులై పన్నుల నిచ్చుట కంగీకరించిరి.

ముకుందుని దయవలన పాంచాలదేశమందు సుభిక్షముగా నుండెను. పుణ్యశీలుడు చతుస్సముద్రముద్రిత మగు భూమండల మేలెను. పరాక్రమౌదార్యాది సద్గుణయుతులును, కుమారస్వామితో సమానులైన ధృష్టకీర్తి, ధృష్టకేతువు, ధృష్టద్యుమ్నుడు, విజయుడు

చిత్రకేతువు అను పేర్లుగల అయిదుగురు కుమారులను పుణ్యశీలుడు పొందెను. రాజ్యమును ధర్మము దప్పక పరిపాలించుటవలన జనులందరు పుణ్యశీలునియందు ప్రేమగలవారైరి. వెంటనే బుట్టి మహిమను గుర్తించుటవలన వైశాఖమాసధర్మములందు మిక్కిలి నమ్మకము రాజునకు గలిగి గోవిందుని హితముగోరి ఫలాపేక్ష లేక నిర్మలమగు మనస్సుతో మరల వైశాఖమాసధర్మములను నెరవేర్చుచుండెను. షడ్గుణైశ్వర్యయుతుడైన మధుసూదను డాపుణ్యశీలుని పుణ్యకర్మలకెంతయు సంతసించి వైశాఖశుక్లతదియ యగు అక్షయ తదియనాడు సాక్షాత్కరించెను.

పరమాత్మరూపుడును, నాశనము లేనివాడును, నాల్గుచేతులు గలవాడును, శంఖచక్రగదాద్యాయుధములను ధరించినవాడును, పట్టుబట్టలను గట్టుకొనినవాడును, స్వప్రకాశుడును, తులసీవనమాలికలను ధరించినవాడును, రమాదేవియు, అనుచరులును వెంటగలవాడును, గరుడవాహనారూఢుడును అగు ముకుందునిజూచి పుణ్యశీలు డాశ్చర్యమును పొంది వాని యతీతమైన తేజస్సును చూడలేక కండ్లు మూసికొని గొప్ప యదృష్టమ గలిగెనని సంతసింపుచు, మద మెక్కి పిచ్చితోనున్నవానివలె యెగిరి గంతులు వేయసాగెను. సర్వాంగపులకాంకురములతో కన్నులవెంట నీరు గార్చుచు ఆనందముతో భక్తితో భూమియందు పడి సాష్టాంగదండనములు గావించెను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున పదునేనవ అధ్యాయము

# పదునారవ అధ్యాయము

శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. దేవుని దివ్యదర్శనముచే సంతసము గల మనస్సుతో ఆనందబాష్పములతో నిండిన కండ్లతో శ్రీహరిని జూచుచు సర్వవ్యాపియై ఆత్మరూపమున లోకమంతయు నిండియుండి లోకాధిపతియై యుండు విష్ణుదేవునికి పుణ్యశీలుడు నమస్కరించెను. శ్రీమహావిష్ణువుయొక్క పాదములందు జనించి గంగ బ్రహ్మదేవుని ప్రపంచమును పవిత్రవంతముగా జేయును. అట్టి భగవంతుని పాదములను కడిగి ఆ జలముచే తన శరీరమంతటను జల్లుకొని మిక్కిలి విలువగల వస్త్రాభరణగంధపుష్పమాల్యాదులచే పూజించెను. సర్వవ్యాపియు, పురాణపురుషుండును త్రిగుణరహితుడును అతీతుడు నగు నారాయణునికి నమస్కరించెను. సంసారబంధరహితుడును, జగత్సృష్టికధిపతియు, జీవాధికపరమాత్ముడును, బ్రహ్మాది దేవతలచేత స్తుతింపబడువాడును, జ్ఞానాధికుల నైనను మాయామోహితులను గావించువాడును అగు భగవానుని స్తుతించెను. అజ్ఞానులు భగవంతుని యొక్క మాయచేత, జరుగుచున్న కార్యములవలన మోహితులగుదురు. దేవుని చేష్టలన్నియు వింతగానుండును. దేవుడు, యేకోటిక తనకు లేకున్నను, అనేకరీతులుగా ప్రపంచమును సృష్టించును. రక్షించును, నశింపజేయును. గుణములు లేనివాడును, జగత్స్వరూపుడును అగు దేవా! నీకు సర్వమును సిద్ధించినది. అయినను దేవతల సుఖముకొరకు, రాక్షసులను భజించుటకు, అవతారముల నెత్తి సత్వగుణమును పొంది, నీ భక్తులను, రక్షింపుచు, తమోగుణముచేత దుర్మార్గులను శిక్షింపుచు, రాక్షసులను రజోగుణముచే బంధింపుచుందువు. గాన నీకు ప్రణతులర్పించువారి పాప ముక్తికొరకు, గంగాది సర్వతీర్థములకు నిలయమైన నీ

పాదములను నా పూర్వజన్మ పుణ్యమువలన, అదృష్టము చేత నా మనస్సున నిలుపగలుగుట కలిగినది. మిక్కిలి భక్తి చేత తానే జీవుడను భేదమును నాశనము గావించి నీపాదముల నారాధించిన వారు నీలోకమును చేరుదురు. నీ పాద ధ్యానము లేక సంసార మను గొప్ప సర్పముచేత నావృతుడనై, జన్మజరామరణాది యవస్థలను పొందుచు అనేక విధములైన జన్మలను బొందుచు, ఎలుకలను ఆహ రించి తిరుగు మార్జాలమువలె సంచరించు చుంటిని గాని ఒకరికైనను దానమును చేయలేదు. నీ సత్కథలను వినలేదు. సజ్జనులను సేవింప లేదు.

నిన్ను ధ్యానింపనందున నారాజ్యము విరోధులచే హరింప బడినది. నేను అడవిని ప్రవేశించితిని. కొంతకాలమునకు గురుదేవు లను గొలిచితిని. ఆపదయందు రక్షింపు స్వభావముగలవారు నా యొద్దకు వచ్చి నా విచారమును పోగొట్టిరి. శాస్త్రములందు చెప్ప బడి, శుభముల నిచ్చుచు, మోక్షమును, స్వర్గమును కలిగించు పురు షార్థములకు సాధనమైన వైశాఖమాస ధర్మములను ఆమునులు నాకు బోధించిరి. అంతట నే నా శుభప్రదములైన వైశాఖమాస ధర్మముల నన్నిటిని నిర్వహించితిని. అందువలన శ్రేష్ఠమైన నీదయ నాకు కలిగి నది, సర్వసంపదలు సమకూరినవి. అగ్ని సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, భూమి, నీరు, ఆకాశము, గాలి, వాక్కు మనస్సు లోనగు వానిని నేను సేవించుటలేదు. వానిని సేవించినందున కొంత కాలమున కవి నాశనము పొందును. గాన వేదవిదులైన విద్వాం సులు త్రుటికాలమైనను పాదసేవ చేసిన, తరించుచున్నారు. ఈషణ త్రయమును త్యజించి, నీపాద పద్మ ధ్యాన పరాయణులగువారు నీవు వారి కొసంగదలచిన యభీష్టమును పొందగలుగుదురు.

సర్వస్వతంత్రుడవు, ఆత్మైశ్వర్యమగు కర్మలను జేయుదువు సజ్జనులయందు దయగలవాడు, పరమ పురుషుడవు. అట్టి నీకు వవ

స్కారము. నీమాయచే మోహితుడనై అనవసర విషయములందు కోరికగలవాడనై త్రిగుణరూపములగు దారాపుత్రాదిసంపదలయందు ప్రేమను గలిగి వర్తింపుచున్నాను. మహానుభావా! అజ్ఞానమును నాశనమొనరించునట్టిదియు, సర్వపాపములను పోగొట్టునదియు, కల్మషరహితమైనదియు నగు నీపాదపద్మములధ్యానముండగా దానిని విడచి సుఖాపేక్షపొంది మిక్కిలి సంతసింపుచు తనకు పొందనశక్యమైన విప్రజన్మమును పొందియు సర్వవిధ పురుషార్థములకు కారణభూతుడవైన నిన్ను సేవింపక భార్యాపుత్రాదులనే ప్రేమించి నిద్రాసుఖములను పొందనేరక యుంటిని. మూఢుడనై విషయలోలుడనై నీ పాదపద్మములను సేవింపలేకపోతిని. కర్మలంపటుడనై యితరుల కేమియు యివ్వజాలక మిక్కిలి సంతసపడుచుంటిని. కార్యములను చేయవలెనను తలంపుమాత్రమేగాని చేయజాలకుందును. లోకస్వరూపుడ వగు నీదయ మానవునియందు కర్తనాచరించినపుడే మాడగలుగుదువు. అతీతమైన శక్తిగల్గిన స్వామీ సత్కర్మల నాచరింపుటవలన సంసారసాగరమును ఆవుపాదమును దాటినరీతిగా సులభముగా తరించుటకు సాధనమైన సజ్జనసహవాసము లభించును. మహానుభావా! సత్సహవాసమువలన దేవుడవైన నీయందు భక్తి కలుగును.

బ్రహ్మ, దేవతలు, రాక్షసులు, వాంఛారహితులగు పరమహంసలగు జ్ఞానులు పొందజాలని నీదయ నాయందు వేగముగా కలిగినది. ఆ దయవలన నాకు సమస్తరాజ్యసుఖము లబ్బినట్లయినది. ప్రభూ! నాశరహితమై సంసారబంధనిర్మూలనమై సంపదలు లేనివారిచే స్మరింపబడునదియై మిక్కిలి మెక్కువగు యైశ్వర్యము నొసంగునదియై యుండు నీ పాదపద్మములను తప్ప వేరేమియు నేను తలంచుటలేదు. మట్టివలన చేయబడిన కుండవలెనే యీ శరీరము

అనిత్యమై నశించు స్వభావము గల్గియుండును. గాన రాజ్యము పుత్రులు, భార్య, ధనము. వీనిని కోరను. శాశ్వతమై సేవింపదగి నదియు మునులచే సేవింపబడునదియు నగు ప్రఖ్యాతిగల నీ పాద పద్మములను సేవింపుచున్నాను. దేవాదిదేవుడవును జగదాధార భూతుడవును అగు భగవానుడా! దయచూపుము. నీ పాదపద్మము లందు దయగలుగునట్లు గావింపుము. త్రిగుణవికారములగు ఆత్మ పదార్థములందు భార్య పుత్రుడు, ధనము లోనగువానియందు కోరిక లేకుండునటుల గావింపుము. నా మనస్సు నీ పాదపద్మములందుంచి తిని. నా వాక్కులు నీ కథలను వర్ణించుటయం దుంచితిని. నా నేత్ర ములు నీ దివ్యరూపమును జూచుటకై యుంచితిని. నా చెవులు నీ కథలను వినుటయం దుంచితిని, నా నాలుక నీయందే సమర్పించితిని. నా ముక్కు నీ పాదపరిమళమును వాసన చూచుటకై వినియోగించి తిని. నా శరీరమును భక్తుల సేవకై యుంచితిని. నా చేతులు నీ యింటియందు సదా తుడుచుటలో నగు పనులయం దుపయోగించి తిని. నా పాదములు నీయొక్క సత్కథలను వినుటకు పుణ్యతీర్థముల యందు తిరుగుటకును, నా శిరస్సు నీకు సాష్టాంగ నమస్కారము లొనరించుటకును నా కోరికలు నీ సత్కథలను వినుటకును, నాబుద్ధి నిన్ను ధ్యానించుటకును యుపయోగించితిని. నా జీవితమంతయు నీ సత్కథలచేతను స్తుతింపదగిన సజ్జనుల సేవయందును గడచునట్లు గావింపుము.

సదా అతిథులగుమునుల పూజయందును, శ్రీహరి కథాశ్రవ ణమందును నాకాలము గడచునటులనుగ్రహింపుము. నేను బ్రహ్మపద మును గోరుటలేదు. చతుస్సముద్రముద్రిత రాజ్యమును వాంఛించుట లేదు. స్వర్గలోకసుఖమును అభిలషింపలేదు. బ్రహ్మ, శివుడు, దేవేంద్రుడు, రమాదేవి మొదలగు వారిచేతను, యితర దేవతల

చేతను సదా ధ్యానింపబడు నీపాదపద్మముల సేవను మాత్రము గోరుచున్నాను. పద్మపత్రములవంటి నేత్రసంపదగల శ్రీహరి యీ రీతిగా రాజుచేత స్తోత్రము చేయబడి, దయగలిగి మేఘ ధ్వనితో సమానమైన గంభీర వాక్యములతో నిట్లు చెప్పెను.

రాజా ! వాంఛాశూన్యుడవును, కల్మషరహితుడవును, అగు నీవు నాకు ముఖ్యమైన భక్తుడవని తెలిసికొంటిని. దేవతలకైనను పొందశక్యము కాని వరమును నీకొసంగెదను. నీవు పదివేల సంవత్సరములు ఆయుర్దాయము కలిగి, సంపదల ననుభవించి, అచలమైన భక్తి నాయందు కలిగి జన్మాంతమందు నా సన్నిధినియుండ గలవు. నీవు చేసిన యీ స్తుతిని భూలోకమున యెవరు నన్నుగురించి చేయుదురో వారికి యిహలోక సుఖమును పరలోక ముక్తిని నేను సంతసించి యివ్వగలను. నేను నీకు సాక్షాత్కరించి, భుక్తి ముక్తు నొసంగిన దివసమునకు భూలోకమందు అక్షయతదియయని ప్రఖ్యా జెందును. అజ్ఞానులైనను, యెరిగిగాని, యెరుగకగాని వైశాఖమాస మందు స్నానదానాదులను చేయువారు, నాశనరహితమైన నా సాయుజ్యమును పొందుదురు నరులు, అక్షయ తదియనాడు, చేయు పితృదేవతల శ్రాద్ధములకు మిక్కిలి విశేషమైన ఫలితము పొంద గలరు. ప్రపంచమునందు అక్షయతృతీయవంటి తిథిగాని, దానికంటె శ్రేష్ఠమైన తిథిగాని లేదు. అతిథినాడు గావించిన ధర్మమెంత కొంచె మైనను, శాశ్వతమైన ఫలమొసంగును. కుటుంబముగల విప్రునకు గోదాన మిచ్చిన నరునికి సర్వసంపదలు సంభవించి, భోగము, మోక్షము గూడ కరతలామలకమై యుండును. సర్వపాపహరమగు యెద్దును దానముచేసిన వానికి మరణభీతిగలుగదు. దీర్ఘాయువును పొందును, వైశాఖమాసమున నాకు ప్రియమైన వ్రతధర్మములను చేయువాడు, జరామరణములు, పాప, భీతులు లేక శాంతిగా

నొందునట్లు చేయుదును, వైశాఖధర్మములను చేసినందుకు నాకు ప్రియమైన వైశాఖమాసమున సంతోషించినట్లు యితరమాసము లందు సంతోషింపను.

సర్వధర్మములను చేయక వదలినను, బ్రహ్మచర్యమును విడచినను వైశాఖ ధర్మములను చేయుటయం దుత్సాహవంతులైయున్న నరులు నాశన రహితమైన నీ స్థానమును పొందగలరు. సాంఖ్యులు తపస్సులచేతను యోగములచేతను, యాగములచేతను, యే పదవిని పొందజాలరో అట్టి పరమోత్తమ స్థానమును వైశాఖ ధర్మములను చేయువారు పొందగలుగుదురు. రాజా! కల్మషము లేనివాడా! వైశాఖమాసమున వెయ్యి దోషము లాచరించినను, ప్రాయశ్చిత్తము లేని నా పాదములను తలచినందు వలన పాపము లెట్లు హరించునో అట్లే నశించును. నీ గురువులు ఉపదేశించిన రీతిగా వననుండుఁడి వైశాఖ ధర్మములయం దుత్సాహవంతుడవై ప్రపంచాధిపతినగు నన్ను సేవించితివేని సమస్త సంపదలను పొందగలవు. నీవాచరించిన ధర్మములవలన నేను సంతసించినవాడనై నీకు సాక్షాత్కరించితిని. దేవతలకు గూడ లభింపని సర్వభోగములను నీయిష్టము ప్రకారము అనుభవించి, అంత్యమందు నాసాయుజ్యమును పొందుదువు. దేవాది దేవుండగు రమాకాంతు డీరీతిగా చెప్పి పుణ్యశీలుడు కోరినవరముల నొసంగి, అందరు చూచుచుండగా అదృశ్యుం డయ్యెను.

మహారాజా! పుణ్యశీలుడు మిక్కిలి సంతసించి, ఆశ్చర్యము గలవాడై, పోయిన ధన మబ్బినవానివలె యుబ్బిన దేహముగల వాడై యుండెను. పుణ్యశీలుడు భగవానునియందు మనస్సుగల వాడై సదాభజింపుచు, నిత్యము గురువులచేతను, పుణ్యవంతుల చేతను బోధలను పొందుచు రాజ్యము పాలించెను. అతడు ముకుందుని తప్ప యన్యుని తనకు యిష్టునిగా తలంపలేదు. పుణ్యశీలుడును

తఱచుగా వైశాఖమాస ధర్మములను నిర్వహించుచుండును, రమా కాంతుని యనుగ్రహామువలననే మంత్రులను. పుత్రులను, భార్యను ప్రియమైన వారిగా రాజు గాంచెను. ఆ పుణ్యమువలననే రాజు పుత్రపౌత్రాదులతో సర్వ సిరిసంపదలతో తుల తూగెను. రాజు దేవతలకు పొంద నశక్యమైన సర్వవిధసుఖములను అనుభవించి అంత్యమందు చక్రధారియు, దేవాదిదేవుడునగు శ్రీహరి యొక్క సాయుజ్యమును పొందును. పరమ పవిత్రమైన యీ చరిత్ర మును యెవరు వినుచున్నారో, యితరులకు వినిపించుచున్నారో, వారందఱు సర్వవిధ పాపములచేతను ముక్తులై శ్రీహరి యొక్క యుత్తమలోకమును పొందుదురు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున పదునాఱవ అధ్యాయము.

## పదునేడవ అధ్యాయము

శ్రుతకీర్తి పలుకుచున్నాడు—కీర్తిప్రదా! యిహపరసుఖముల నిచ్చునట్టి వైశాఖమాసమందలి ధర్మములనన్నియు వినుచున్నకొలది తృప్తితీరుటలేదు. నిష్కల్మషమైన ధర్మములు, శ్రీహరి కథలు వినుట కానందమును గూర్చు శాస్త్రములు యెంత వినినను తృప్తి తీరదు. విప్రోత్తమా! నీవు నాయింటికి వచ్చినందున, నీవు అతిథి వైనావు. నే జేసిన పూర్వపుణ్యవిశేషముచే నాగృహమునకు విచ్చేసి నన్ను పవిత్రుని జేసితివి. నీ వదనపద్మమునుండి వచ్చిన వాక్కులను అమృతమును త్రావి తృప్తిని జెందిన నిజమ మోక్ష మును గాని బ్రహ్మలోకమును గాని వాంఛింపను; గాన యిహపర

సుఖముల నిచ్చునట్టియు, విష్ణుప్రీతికరములగునవియు, ఉత్తమములైన వైశాఖమాస ధర్మములనే తనివిదీర చెప్పి యానంద పరుపుము. అని శ్రుతకీర్తి యడుగగా శ్రుతదేవుడు ఆనందముతో శుభప్రదమైన వైశాఖ ధర్మములను చెప్పసాగెను.

రాజా! పాపనాశనమును మునులచే గౌరవింప బడునదియు నగు వైశాఖమాసమందలి ధర్మములనుగుఱించిన కథను చెప్పెదను వినుము. పూర్వమందు అఖండమైన కీర్తిగల శంఖుడను విప్రుడు పంపానదీతీరమున నివసించుచుండెను. ఆయన యొకానొక సమయమున సింహరాశియందు బృహస్పతి ప్రవేశించియుండగా పుణ్యప్రద మగు గోదావరీనదికి వచ్చెను. శంఖుడు పుణ్యవంతమగు భీమరథీ నదిని దాటి ముండ్లు, రాళ్లుగల్గి జన జలశూన్యమైయుండు వనమందు బడిపోవుచు వైశాఖమాసమగుటచే మధ్యాహ్నకాలమున మార్తాండు డతితేజోవంతుడై తన ప్రతాపమును ప్రకాశింపజేయుచుండ తప నుని తాపముచేత తపింపబడి యొకచెట్టుక్రింద శ్రమతీర్చుకొనెను. అప్పుడు దుర్మార్గుడై విల్లును చేబూని భూతఘాతకుడై మూఢుడై అపరయమునివలె నున్న కిరాతు డాచెట్టుసమీపమునకు వచ్చి మకరకుండలధారియై యాగాదిక్రతువులను చేసి భాస్కరునివలె ప్రకాశింపుచున్న విప్రునిజూచి దుర్బుద్ధికలవాడై ఆవిప్రుని చెట్టునకు కట్టిపెట్టి వానికి గల మకరకుండలములను పాదుకలను, గొడుగును, కమండలువును, చంకనుగల మూటను తీసికొనెను. పిమ్మట కిరాతుడు శంఖుని విడచిపెట్టెను.

శంఖు డారాళ్ళలోనిండినదియు, సూర్యరశ్మిచే తపించు నదియు, జలశూన్యమైనదియు, కంటకావృతమైనదియు నగు మార్గంబున నడచుచు పాదములు కాలినప్పుడు గడ్డిప్రదేశములందు నిలచుచు వేగముగా నడచి యొకచోట నిలచుచు కష్టమును దలంచు

కొనుచు ప్రాణములను బిగబట్టుకొని ప్రయాణము సాగించుచుండెను. ఈ రీతిగా మధ్యాహ్నకాలమున పరమబాధను పడుచున్న విప్రుని జూచి వాని విచారమును దిలకించి పాపబుద్ధిగలిగి ధర్మశూన్యుడైన యా కిరాతుడు విప్రుని పాదుకలను మరల వాని కొసంగవలెనను దయ వహించెను. అడవియందు కిరాతుడు దొంగతనముచేత సంపాదించిన ధనము వాని హక్కుగలదై యుండునని కిరాతశాస్త్రమందు నిర్ణీతమైయున్నది. అందువలన బాధనొందు బ్రాహ్మణునికి పాదుకలను యిచ్చి పాపమును బాపి పుణ్యమును సంపాదింతును. నాకు పాతవియు, గట్టివియు నగు జోళ్ళుకలవు. నాకు జోళ్ళు అవసరముండదుగాన యీ జోళ్ళు విప్రునకిచ్చెదను. ఇట్లు కిరాతుడు మనంబున నిశ్చయంబు చేసికొని బాధపడుచున్న బ్రాహ్మణునికి కాలిజోళ్ల నిచ్చెను. శంఖుడా చెప్పులను ధరించి సుఖమును బొంది చిరకాలజీవివగుమని కిరాతుని దీవించెను. వైశాఖమాసమున చెప్పుల నిచ్చుట వలన కిరాతుని పుణ్యము పరిపక్వమైనది. పుణ్యవంతుడైనందున కిరాతుడు దుర్మార్గుడైనను శ్రీహరి ప్రసన్నత్వమును గనును. యీ చెప్పులను ధరించుటవలన నేను మిక్కిలి సుఖవంతుడనైతిని. ఆ శంఖుని వాక్యములను విని కిరాతుడా బ్రహ్మజ్ఞానసంపన్నునితో నిట్లనెను.

విప్రోత్తమా! నీవు చెప్పినమాటలు వింతగానున్నవి. నా వస్తువునే నీకు యిచ్చినందువలన నాకు పుణ్యమెట్లు లభింపగలదు? వైశాఖమాసమందు చేసిన ధర్మములకు శ్రీహరిప్రసన్నుడగునని చెప్పుచున్నావు. వైశాఖమాసమనగా నేమి? శ్రీహరియనగా యెవరు? ధర్మమనగానేమి? ధర్మముచేసినందువలన ఫలమేమి? దయామయా! నీకు నేను సేవజేసెదను. నేనడిగిన ప్రశ్నలకు సమాధానమిమ్ము. అని కిరాతుడు వినయవిధేయతలతో విప్రు నడుగగా కిరా

తునిమాటల నాకర్షణను మునివిని సంతోషమానసము గలవాడై వైశాఖధర్మములను ప్రశంసింపుచు ఆశ్చర్యముతో పలుకుచున్నాడు. కిరాతుడు మూఢుడైనను ప్రాణరక్షణ మొనర్చు పాదరక్షల నిచ్చినాడు. కిరాతుడు స్వభావముచేత దుష్టబుద్ధియైనను యిప్పుడు మంచి బుద్ధిని కలిగియున్నాడు. సమస్తధర్మముల ఫలితమువలన వేఱొకజన్మ కలుగును. కాని వైశాఖధర్మములవలన వెంటనేజన్మఅంతమగు నంతలోనేఫలితముకలుగును. పాపుడును, దుష్టుడును నగు కిరాతుడు దైయోగమువలన మంచిబుద్ధిగలిగి పాదుకలను విప్రునకొసంగెను. శ్రీహరిని సంతసపరచునదియు, సంతసపడుచు చేయునదియునగు కర్మను ధర్మమని మనువు మొదలగువారు చెప్పిరి. వైశాఖధర్మము లన్నియు విష్ణుప్రీతికరములు. ఏదానములు, తపస్సులు, యాగములు చేసినను శ్రీహరిసంతసింపడు కాని వైశాఖధర్మములను నిర్వహించిన యధికముగా సంతసించును. వైశాఖధర్మములను చేసినమానవుడు గంగానదికిగాని గయ, ప్రయాగ, పుష్కరము, కేదారక్షేత్రము, ప్రభాస తీర్థము. స్యమంతకక్షేత్రము, గోదావరి, కృష్ణానది, సేతువు, మరుద్వృధమ్‌లోనగు పుణ్యప్రదేశములకు వెడలనక్కరలేదు.

వైశాఖపురాణ కథనమును నదీస్నానమొనరించినవారికి వెంటనే శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై వారిమనంబునందు నివసించును. వైశాఖమాసమం దెంత స్వల్పవ్యయముతో ధర్మమాచరించినను ఫలితము కోటిగుణితమగును. యితరమాసములందు విశేషధనము వెచ్చించి చేసినధర్మములవలన యింత ఫలముండనేరదు. వైశాఖమాసము పుణ్యమును వృద్ధిజేయును. నీవు పాదుకలనిచ్చుటచేత నా బాధ దీరినది. నీ పూర్వజన్మపుణ్యము ఫలించినది. శ్రీహరిప్రీతుడై నీకు శుభము చేకూర్చగలడు. అట్టిదే కాకున్న యీరీతిగా నీకు మంచి యాలోచనకలుగనేరదు, అని ముని పలుకగా ఆ యువవిప్రుం

దొక సింహము మృత్యుదేవతచేత ప్రోత్సహింపబడి మిక్కిలి క్రోధముతో నొక పెద్దపులిని చంపుటకు పరుగెత్తెను. ఆ మధ్యలో నొక పెద్దయేనుగ యీశ్వరసంకల్పముచే నెదురయ్యెను. సింహము ఏనుగకాలు పట్టుకొని చంపుటకు సిద్ధపడగా సింహదంతావళంబులకతి భయంకరమైన యుద్ధము జరిగెను. ఆ రెండుమృగములును యుద్ధమును చాలించి అలసటచేత యిటునటు చూచుచుండగా కర్షణముని కిరాతునికి చెప్పుచున్న వైశాఖధర్మముల పుణ్యవిశేషమును వినుట జరిగెను.

ఆ గజసింహములట్లు మునివాక్కులవలన విన్న వైశాఖమాస మాహాత్మ్యమువలన సర్వపాపములనుండి ముక్తులై వెంటనే దివ్యరూపమును ధరించి దేవలోకమునందు గంధముచే పూయబడినవారై దివ్యవిమానారూఢులై దేవతాస్త్రీలచే సేవ్యమానులై దేవతాస్వరూపములతో వియన్మార్గగాములై చేతులు జోడించి నమస్కరించిరి. కిరాతునిగూర్చి వైశాఖధర్మములను చెప్పుచున్న కర్షణుడు వియన్మార్గగాములగు దివ్యపురుషుల నిరువురను మీరెవరని యడిగెను.

మీ కీగజసింహజన్మ లెట్లు కలిగెను? ఒకరి నొకరు చంపుటకు సిద్ధమై యుద్ధమున నొకేమారు మరణించిరి కల్మరహితమైన దేవతలారా! యీ వివరములన్నియు విశదీకరింపుమని యడుగగా కర్షణునితో వారిట్లు పలికిరి. మతంగమునికి దంతిలుడు కోహలుడు అను పేరుగల యిరువురము పుత్రులై యుంటిమి. మేము శాపవశులమై యుంటిమి. సౌందర్య యౌవనవంతులమై సర్వశాస్త్రముల నభ్యసించినవార మగు మమ్ముల నుద్దేశించి మాతండ్రియగు మతంగుడు సర్వధర్మవిశారదుండగు బ్రహ్మర్షి యగుటచే నిట్లు చెప్పెను. శ్రీ కిష్టమగు వైశాఖమాసమందు, మార్గమున చలివేంద్ర మేర్పరచు

టయు, ఎండవలన తాపము నొందిన జనులకు సేదదేర్చుటయు మార్గమున నీడనిచ్చు విశ్రాంతి మందిరములను నిర్మించుటయు, అన్నదానమును జలదానమును చేయుటయు, ప్రాతఃకాలమందు స్నానమాచరించుటయు, సంసారబంధ వినిర్ముక్తుల గావింపు భగవానుని పూజించి హరిసత్కథలను వినుటయు గావింపవలెను. మతంగు డీరీతిగా యుపదేశించినను, దుర్మతులమగు మేమిద్దరము కోపించుకొని మ త్తిలి, యా వైశాఖ ధర్మములను నిర్వహింప మైతిమి.

మా తండ్రియగు మతంగుడు వైశాఖధర్మములయం దాసక్తి గలవా డగుటవలన నా ధర్మములను మేము చేయనందున మాయందు కోపించి, యిట్లనెను. ధర్మముల నాచరింపని కుమారుని, అప్రియముగా భాషించు భార్యను, దుర్మార్గులను శిక్షించుట కూడదని చెప్పు రాజు కొలువును వెంటనే విడువవలెను. అట్లుచేయని యెడల నష్టము వాటిల్లును. భార్యాపుత్రులను, పైన వివరించిన లక్షణములు గల వారిని స్వీకరించినను, ధనాశచే రాజు కొలువును వదలకున్నను, అట్టివారు పదునాల్గు యింద్రకల్పములవరకు నరకమందుందురు. అని చెప్పి మతంగుడు మమ్ములను శపించెను కోపముగల నేను దంతిలుడను సింహమైతిని. మదించిన కోహలుడు అను నతడు యేనుగ యయ్యెను. పిమ్మట మేము పశ్చాత్తప్తులమై శాపవిమోచనార్థ మడుగగా మాతండ్రి శాపము నిట్లు మార్చెను. పుత్రులారా! మీరు నా శాపమువలన గజసింహములై కొంతకాల మడవియందుండి పిమ్మట మీరిరువురు కలసి యొకరితో నొకరు పోరుపడి యేకకాలమందు మరణ మొందుదురు. అప్పుడు శంఖుడనుముని కిరాతునకు వైశాఖ ధర్మములను బోధించును. దైవవిధిచే వానిని వినుటవలన మీరు శాప ముక్తులగుదురు. అంత మీరు పూర్వరూపములతో నాయొద్దకు రాగలరు. నా వాక్యమునకు తిరుగులేదు. అని మాతండ్రి శపింప

హీనమగు మృగములమై దైవవిధిచేకలసి యుద్ధమాడి, మీవలన వైశాఖధర్మములను విని మాగజసింహ జన్మములను విడచితిమి. అని మతంగ కుమారులు కర్షణునితో చెప్పి నమస్కరించి ఆయన యానతిగొని వారి తండ్రి యొద్దకు వెళ్ళిరి. ముని కిరాతునితో చెప్పెను. కిరాతుడా! వైశాఖ ఫలమును కంటివా! వైశాఖ ధర్మములను ఒక క్షణమందు వినుటవలన మునికుమారులకు మోక్షము కలిగెను. అని మునీశ్వరుడు చెప్పగా కిరాతుడు విని చేతినున్న బాణములను వదలి సత్స్వభావము, దయ, కోరిక లేకయుండుట, ఉత్తమ జ్ఞానము, మనశ్శుద్ధి, పుణ్యానిలయమునగు సద్గుణవంతుడగు మునివల్లభునితో మరల నిట్లు చెప్పసాగెను.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమందు
నారదాంబరీష సంవాదమున పదునేడవఅధ్యాయము

---

## పదునెనిమిదవ అధ్యాయము

కిరాతుడు చెప్పుచున్నాడు. మునివల్లభా! దుష్టుడను పాపుడను అగు నేను మీవలన కరుణింపబడితిని. మహాభాగులను సజ్జనులు స్వభావసిద్ధముననే సర్వప్రాణులయందును భూతదయ కలిగి యుందురు. దురాత్ముడనై వికలచిత్తుడ నగు నేను కిరాతుడనై ముక్తిని కలిగించు వైశాఖధర్ములం దాసక్తిని కలిగియుండుట తమ దయవలననే యని తలంతును. మహాభాగా! నీకు శిష్యుడనై నీ పుత్రునితో సమానుడనై నీవు నన్ననుగ్రహింప దగు దయకు తగినవాడనైయున్నాను గాన నన్ను కరుణింపుము. పాపమును గలిగించు దుర్వివేకము మరల నాకు ఎన్నడును కలుగకుండునట్లు చేయుము,

సజ్జనసాంగత్యమువలన మానవు డెన్నడును దుఃఖమును పొందనేరడు. ముక్తిని బొందగోరువారు సంసారసముద్రమును దాటుటకు ఎట్టి పుణ్యకథలను విందురో, అట్టివానిని నాకు బోధింపుడు. అందరి యందును, సమభావముగలిగి సర్వజీవులయందును సమానదయగలిగి యుండు సజ్జనులకు నీచాధిక్యతల తారతమ్యముండనేరదు. సజ్జనులు తమ శిష్యుల గుణగణములను రహస్యముగా పరిశోధించి వారిచిత్త శుద్ధిని ఖరికించుచుందురు. పాపసహితుడై ధర్మములను విడచి దుష్టుడైయున్నను మానవుడు తన నడతకు పశ్చాత్తాపమునంది గురువు నాశ్రయించి జ్ఞానమార్గమును బోధింపుమని యడిగినపుడు తాపత్రయాత్మకమగు సంసారబంధమునుండి ముక్తుడగు జ్ఞానమును అతడు ఉపదేశించును. గంగానది మానవకోటియొక్క అనంత పాపములను నాశనము చేయును. అట్లే సజ్జనులు అవివేకులను తరింపజేయుదురు. దయారూపియు భక్తులయందు అనురక్తుడవును అగు విప్రోత్తమా! నీ సాంగత్యమునవలన నేను పవిత్రుడనైతిని. మీకు సేవకుడను, నమస్కరించుచున్నాను. ధర్మములను వినుటకు అర్హుడ నైతిని. గాన నీవు నా కుపదేశించుటకు సందేహము పొందవలదు.

కిరాతు డిట్లు పవిత్రమైన మనస్సుతో పలికిన కర్షణుడు విని వింతపడి వానిం గొనియాడి ధర్మబోధ చేయసాగెను. కిరాతా! నీవు సుఖలాలసుడవైతివేని శ్రీహరికి యిష్టమైనదియు, సంసారసాగర మును తరింపజేయునదియు నగు వైశాఖమాసధర్మములను నీవు ఆచరింపవలెను. ఇక్కడ ప్రచండమైన ఎండచేత మెండగు తాపము కలిగినది. విశ్రమించుటకు నీడగాని త్రాగుటకు నీరుగాని లభింపదు. గాన ఛాయాపరివృతమైన వేరొక ప్రదేశమునకు వెళ్ళుదము. అచ్చట నీరును త్రావి నీడయందు శ్రమదీర్చికొని నేను కనివినియున్న శ్రీహరి కథలును వైశాఖమాసధర్మములను పాపరహితమగునట్లుగా

జెప్పుదును అని పలికిన మునిపాలకులకు కిరాతుడు చేతులు జోడించి యిట్లు నుడివెను, విప్రోత్తమా! యిచ్చటకు సమీపమున సరస్సు గలదు. దానిలో పరిశుద్ధమైన జలము గలదు. ఆ సరస్తటమున ఫలభరితమైన వెలగచెట్లు గలవు. అచటికి బోయి మనము పోదము, అని పలికిన కిరాతుని మాటలు విని మునియు కిరాతుడును కలిసి సరస్తీరమును చేరిరి.

కర్షణ కిరాతులు ఆసరస్సును చేరిరి కొంగలు, కారండవపక్షులు, చక్రవాకములు, హంసలు, సారసములు, క్రౌంచములు, లోనగు అండజమండలముచే మండనాయమానంబైన సరస్సును చూచిరి. ఆసరస్సున వెదుళ్ళు, తుమ్మెదలు, లోనగు వాని ధ్వనులు, మొసళ్ళు, తాబేళ్ళు, చేపలు, లోనగు జలజంతువులును, గంభీర మనోహరమై, తెల్ల, నల్ల, ఎఱ్ఱ, రంగులు కలువపూవులును, తెల్లని తామరపూవులును గలిగి శ్రేష్ఠమైన దృశ్యమును జూచిరి. నూరుపత్రములుగల పద్మములును, ఎఱ్ఱకలువలును, వికాసమును గలిగించుచు కండ్లకు ఆనందమును గూర్చు పక్షిగణ, కోలాహల మధురనిస్వన, వ్యాప్తమై ఆసరస్సు విరాజిల్లుచున్నది. ఆ తటమున వెదురు పొదలును, వివిధవృక్షములును, మఱ్ఱిచెట్లును, గానుగతరువులును, కడిమి భూజములును, అమ్మపాలము లును, వేప, జువ్వి, మొరదు, చంపక, పొగడ, పున్నాగ, ఉదుంబర, వెలగ, ఉసిరి లోనగు వృక్షములు విరాజిల్లుచున్నవి. పక్వమైన జంబూఫలములచేత నిండియున్న తరురాజములచే వ్యాపింపబడి ప్రకాశమానమైయున్నది. ఏనుగులు, సారంగములు, వరాహములు, మహిషములు లోనగు వన్యజాతి, మృగసంఘము అంతయు ఆ సరస్తటమందే నివసించుచుండెను. శశకములు, ఆవంటి సాధుమృగములు, కస్తూరీమృగము, పెద్దపులి, తోడేలు మొదలగు

లగు క్రూరమృగములు, గాడిదలను చంపునట్టి మృగములు, శరభములు, చమరీమృగములు, కొమ్మనుండి కొమ్మకు గంతులువేయు వానరము మొదలగు మృగము లన్నియు నచ్చటనే సంచరింపు చుండెను. పిల్లులు, భల్లూకములు, దుప్పులు లోనగు భీతిని గొల్పు మృగముల గర్జనలతోడను, యీలపురుగుల నిస్వనములచేతను, వెదురు జొంపముల ధ్వనులచేతను, వ్యాప్తమై పెనుగాలిచే పడియున్న తరుశాఖలచే నిండియున్నదియు నగు సరస్సును వారిరువురు చూచిరి.

కర్షణుడు ఆసుందరమైన సరస్సున స్నానమాడి, పూతమగు వస్త్రములు ధరించి, మాధ్యాహ్నిక కర్మలనాచరించి, దేవతార్చన గావించి, ఆకలిచే బాధపడుచున్నవాడై యందున శ్రమహరమును, కిరాతునిచే తేబడినదియు నగు వెలగపండ్లను రుచికరముగా భుజించి స్వస్థమానసుడై, సుఖాసీనుడై, ధర్మాసక్తుడైన కిరాతుని యిట్లని ప్రశ్నించెను.కిరాతా! నీకు శ్రవణానందమగు ఏధర్మము నుపదేశింప వలయును? అనేక ధర్మముల నేకరీతులవ్యత్యాసములు గలవై యున్నవి. వానిలో వైశాఖమాస ధర్మములు సులభసాధ్యములై యున్నను, స్వల్పవ్యయముతో కూడినను, ఫలమధికమై ప్రాణికోటికి ఐహికాముష్మికాది సుఖంబుల నొసంగును, నీమనోవాంఛానుసారమైన ధర్మములనే నీవడుగుము. అని కర్షణుడు పలుకగా కిరాతు డిట్లనెను: మహానుభావా! అవివేకయుక్తమైన యీ కిరాత జన్మ సంభవించుటకు కారణమేమి? మంచిబుద్ధియు, సజ్జన సాంగత్యము, సంభవించుటకు గల కారణమేమేమి? దీనిని వివరింపుము! అని పలికిన కిరాతకునికి కర్షణ శంకరుడని పేరుకలిగిన మునీశ్వరుడు వదనమండలమున చిరునవ్వు తాండవింప మేఘగంభీర స్వరమున యిట్లని చెప్పసాగెను. వ్యాధశ్రేష్ఠా! తొల్లి పూర్వజన్మమున తేజ

శ్యాలివై వేదవిదుడవై శ్రీవత్సగోత్రజుడవై స్తంభుడను పేర వి[illegible]డవై బరగితివి. అప్పుడొక భోగముదాన నీకు ప్రియురాలై యుండెను. ఆ సాంగత్యదోషమువలన నీవు నిత్యకర్మలను త్యజించి శూద్రునిరీతిగనే సంచరించితివి. ఆచారశూన్యుడవై దురాత్ముడవై విప్రకర్మలను త్యజించిన నీకు కాంతిమతియను నొక విప్రాంగన భార్యగా నుండెను. ఆమె కర్మహీనుడవైనను, నీకును నిన్ను ప్రేమించిన వేశ్యకును పరిచర్యలు సేయుచు నీయందలి ప్రేమచే మీ యిరువురిపాదములను కడుగుచుండెను. ప్రియదంపతులగు మీ యిరువురు పరుండు శయ్యకు క్రిందుగా తన శయ్య నేర్పరచుకొని మీమాటలను వినుచు వలదనిచెప్పినను పతివ్రతాధర్మముచే మీ యిరువురకు పరిచర్య సలుపుచుండెను. ఈరీతిగా బహుకాలము గడిచెను. ఒకనాడు శూద్రునివలె గేదెపెరుగు, ముల్లంగిదుంప నువ్వులతో కలిసిన అనుములు లోనగువానిని తినుటచే జీర్ణముకాక డోకులు, విరోచనములు కలిగెను. ఆ దోషమువలన మర్మస్థానమందు భగంధరమను రోగము సంభవించి రాత్రియందు బహుధా బాధపడితివి. నీ గృహమందు ధనమున్నంతవరకు వేశ్య నీవద్దనుండి ధనాభావము రాగానే వదలి వెళ్ళిపోయెను. ధనములేని నిన్ను వదలి వేశ్య మరియొకని నాశ్రయించెను. నీవా రోగబాధచే పీడితుడవై మనస్థిమితములేక విచారింపుచు భార్యతో నిట్లంటివి.

ప్రాణప్రియే! వేశ్యానురక్తుడనై దుర్మార్గుడనగు నాయందు కరుణజూపుము. సుందరీ! నీవు నాకు చేసిన పరిచర్యకు విశ్వాసములేక పాపాత్ముడనై ఉపకారము గావింపనైతిని. భక్తిగలభార్యను దూషించు పాపాత్ముడగు భర్త పదునైదు జన్మముల పర్యంతము నపుంసకుడై పుట్టును. సజ్జనులచే సదా దూషింపబడితిని. పాపాత్ముడనై పతివ్రతవగు నిన్ను పరాభవించుటవలన నేను నీచజన్మనెత్తితిని.

నీ శుశ్రూషకు సంతోషింపక తిరస్కార మానుటవలన నీకోపాగ్నిచే దహింపబడితిని. అని పలికిన నిన్నుజూచి నీభార్య బద్ధాంజలియై యిట్లు పలికెను. ప్రాణవల్లభా! దీనములగు వాక్కులు పలుకరాదు. నా వలన సిగ్గుపడరాదు. నాకు కోపములేదు, పూర్వజన్మకృత పాపములే. యిహలోకమందలి దుఃఖము లగుచున్నవి. అట్టి దుఃఖములను సహించిన పతివ్రతగాని, పురుషుడుగాని ఉత్తముడనబడెదరు. పాపురాలు నగు నేను పూర్వజన్మకృత పాపఫలము ననుభవించుట వలన నాకు విచారములేదు. అని శాంతిమతి నీతోగలిసి ప్రవర్తించెను. ఆమెతండ్రిని బంధువులను ధనమడిగిదెచ్చి నిన్ను పోషించుచు నిన్నే క్షీరవారాశినిగా బవళించిన నారాయణునిగా తలంచెను. రాత్రింబవళ్లు నీయొక్క మూత్ర పురీషములను తొలగించి గాయము లందలి క్రిములనుతీసి శుభ్రపరచుచుండెను. రాత్రింబవళ్ళు నీ దుఃఖమును గని నిద్రించుటమాని యిట్లనెను. దేవతలును, పితృదేవతలును గూడ నా భర్తను రక్షించి రోగరహితునిగాను, పాపరహితునిగాను జేయవలెను నా భర్త ఆరోగ్యమునకై రక్తము, మాంసము, పెరుగు లోనగు వానితోగూడిన అన్నమును దుర్గాదేవికి సమర్పించెదను. మహాత్ముడగు వినాయకునికి కుడుములను నైవేద్యము గావింతును. ప్రతిశనివారమును ఉపవసించెదను.

ఉపవాసమునాడు మధుర, పదార్థములను భుజింపక శుష్కోపవాస మొనరింతును. అభ్యంగనముచేయను. కేశముల నలంకరింపను. దీక్షవహింతును. రోగరహితుడై నాభర్త నూరుసంవత్సరములపర్యంతముజీవించునటుల ప్రార్థించి కొంత కాలము గడచిన పిమ్మట మహాత్ముడైన, ధర్మమూర్తియైన దేవలముని నైశాఖమాసయుక్త సాయంకాలమున మీయింటికి వచ్చెను. విప్రున కతిథిపూజగావించిన రోగము హరించును అను యాలోచనతో వైద్యుడైన దేవలమునిని

పిలువగా నతడు మీయింటికి వచ్చెను. ధర్మశూన్యుడవైన నీవు మునిని లోనికి బిలిచి పాదములను కడగి శాంతిమతి ఆ జలము నీపై జల్లెను. ఆసాయంకాలమున ఎండవలన తపించిన మునియొక్క వేసవి తాపమును బోగొట్టజాలు పానకమును నీ యనుజ్ఞగొని నీ భార్య నా మహానుభావున కొసంగెను. పిమ్మట దేవలుడు ఉదయమున లేచి యింటికేగెను. పిమ్మట కొంతకాలమునకు నీకు సంధిసంభవించెను. తన్నివారణమునకై గరళమును నీ నోటియందుంచగా నీ వామె వ్రేలును కొరికితివి. రెండు దంతముల మధ్యను శ్లేష్మప్రకోప మధిక మయ్యెను. శాంతిమతి భర్తయగు నీచే కొరుకబడిన తునకను బయటకు దీసెను. వెంటనే నీవా జన్మమున మృతి నొందితివి. నీవు ప్రాణములను త్యజించునపుడు మనోహరశయ్యాగతుడవై, వారాంగనను దలంచుచుంటివి. నీ భార్యచేతి కడియము నమ్మి కాష్ఠము నేర్పరచి నిన్ను పరుండబెట్టి నీతో కూడ ఆ చితియందు మృతి జెందెను. అట్లు సహగమించుట వలనను, వైశాఖమాసమున జలమును దాన మిచ్చుటవలనను, విప్రుని సేవదీర్చి పాదప్రక్షాళన మొనరించుట వలనను యోగీశ్వరులకు గూడ నలభ్యమగు విష్ణుసాయుజ్యమును గూడ పొందగల్గెను. మృత్యుసమయమున నీవు వేశ్యను దలంచినందున పాపసహితుండవై మరుజన్మమున కిరాతుడవై ప్రాణిహింసచేయుచు దుర్మార్గుడవై నిట్లు సంచరింపుచుంటివి. పండ్రెండు మాసములలో పరమోత్కృష్టమైన వైశాఖమాసమున ఎండ వేడిమిచే మెండుగ బాధనొందిన విప్రునికి నీభార్యయగు శాంతిమతి పానకమును పానీయముగా నివ్వదలంచి నిన్నడిగినపుడు యనుజ్ఞ నొసంగితివి గాన దురాత్ముడగు కిరాతుడవై పుట్టినను సుఖప్రదములైన ధర్మములను తెలుసుకొనవలయునను వాంఛ నీకు జనించినది. పాపనాశనమైన మునివల్లభుని పాదప్రక్షాళనము ని శిరస్సున నీ భా

మార్జన మొనరించుటచే యీ కారడవియందు నాతో సాంగత్యము లభించినది. సంతానమును, సంపదయు సంభవించినవి. కిరాతుడా! యిట్లు నీవు పూర్వజన్మమందు చేసిన పాపముగాని, పుణ్యముగాని నా దివ్యదృష్టిచే జూచి నీపూర్వజన్మవృత్తాంతమును జెప్పగలిగితిని రహస్యమైన యే విషయమైనను నీకు విన కుతూహలము యున్నదేని అడుగుము చెప్పెదను. నీమనస్సు పవిత్రమైనది. నీకు శుభమగును.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున పదునెనిమిదవ అధ్యాయము

## పందొమ్మిదవ అధ్యాయము

కిరాతుడు చెప్పుచున్నాడు. విప్రవల్లభా! రమా కాంతుని కిష్టమగు ధర్మములను వైశాఖధర్మములను శుభప్రదమగు భగవానుని కథలను వినిపించితివి. శ్రీహరి యెట్టివాడు? అతని గుణగణము లెట్టివి? అతడు కలడనుటకు నిదర్శనమేమి? అతని సేవించినవారు యెట్టివారు? విష్ణుప్రీతికరములైన ధర్మము లేవి? వేనివలన ముకుందుడానందము నొందును? యీ విషయములన్నియు శిష్యుడనగు నాకు విస్తరించి చెప్పుడని యడిగెను. ఆ బ్రాహ్మణుడు జగదీశుడును సమస్తబాధలను పోగొట్టువాడును అగు రమావల్లభునికి నమస్కరించి యిట్లు చెప్పసాగెను.

కిరాతుడా! పాపశూన్యమైన బ్రహ్మాది దేవతలచేతను, మహాత్ములగు మునులచేతను తెలియ శక్యముగాని శ్రీహరి స్వరూపమును దెల్పెద నాలింపుము. శ్రీమహావిష్ణువు పరిపూర్ణమైన శక్తి కలవాడు,

పరిపూర్ణమైన గుణములు గలవాడు, కల్మషరహితుడు, సర్వమునకు ప్రభువు, గుణరహితుడు, కలాకాష్ఠాది కాలనియమము లేనివాడు, అనంతస్వరూపుడు, సచ్చిదానంద విగ్రహుడు, సంచరించు మనుష్యాదులును, చలనములేని పర్వతాదులును గల జగత్తు సదా యొకేరీతిగా నుండును. ప్రపంచాధీశునితో గూడి యాధారము గలదై యాశ్రయమును పొంది సదా యొకరి యధీనమందే యుండును. పరమాత్ముడైన పరబ్రహ్మముయొక్క స్వరూపమును చెప్పెదను. పుట్టుక, నిలకడ, నాశనము, వచ్చుట, పోవుట, నడచుట, ప్రకాశము, బంధము, మోక్షము, లోనగునవి యెవరివలన కలుగునో అట్టి ప్రభువగు శ్రీమహావిష్ణువునే పరబ్రహ్మమని పెద్దలు చెప్పుదురు. నిశ్చయజ్ఞానులు శ్రీహరినే ప్రత్యక్షమైన పరబ్రహ్మముగా నెంతురు. బ్రహ్మదేవునికి గల బ్రహ్మశబ్దము రూఢివాచకమేగాని యోగశబ్దము కాదు. పరిపూర్ణబ్రహ్మమగు వానియంశగానుండిన బ్రహ్మదేవుడు పరబ్రహ్మ మెట్లగును ? "జన్మాద్యస్యయతః" అను వేదాంతశాస్త్ర వచనానుసారముగా శ్రీమన్నారాయణుడు సర్వాంతర్యామియైన పరబ్రహ్మమని నిర్ణీతమైనది. వేదములు, శాస్త్రములు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, పాంచరాత్ర్యాద్యాగమములు, భారతము యీ విధమైన వానిచేత శ్రీమహావిష్ణుస్వరూపము నెఱుంగ వలయును. వేఱురీతిని వేదవేత్తకాని పురుషుడు విష్ణువు నెఱుంగ జాలడు. అధిపతియు, ప్రకాశవంతుడును, వేదవేద్యుడును, పురాణపురుషుడు నగు శ్రీమహావిష్ణువును యెఱుంగుటకు ఇంద్రియములు గాని, ప్రత్యక్షప్రమాణములుగాని తర్కశాస్త్రాది యుక్తులుగాని సరియైనవి కానేరవు. జీవకోటులన్నియు శ్రీహరియొక్క యవతారాది మహిమలను గుణగణములను బుద్ధికొలది యెఱింగి ఆయన సాన్నిధ్యమున మోక్షమును పొందుచున్నారు. మహిమోపేతమైన శ్రీహరి

చరిత్రమును క్రమముగా తెలిసికొనవలెను. సర్వశక్తులు గలిగి యుండువాడు, దేవతలు, మునులు, పితృదేవతలు మొదలగువారు నియతశక్తి గలిగినవారు. బలము, జ్ఞానము, సుఖముగలిగియుండుట వలన ప్రత్యక్షము, ఆగమము, అనుమానములను ప్రమాణములచేత ప్రాణికోటియందు మానవుని అధికుడుగా తెలిసికొనవలెను. ఆ మానవులకంటె అధికునిగా రాజును చెప్పిరి. రాజుకంటె గంధర్వులు నూరురెట్లు అధికులు. సప్తర్షులకంటె నీతిహోత్రుడును, వీతిహోత్రుని కంటె సూర్యుడును, సూర్యునికంటె గురువును గురువుకంటె ప్రాణమును, ప్రాణముకంటె యింద్రుడును మిక్కిలి బలవంతులుగా తెలియవలయును.

ఇంద్రుని కంటె పార్వతియు, పార్వతికంటె సదాశివుడును, సదాశివునికంటె ప్రకాశవంతమగు జ్ఞానముకంటె ప్రాణము అధికమని చెప్పుదురు. ప్రాణముకంటె శ్రేష్ఠమైన దేదియులేదు. సర్వమును ప్రాణమునందే కలదు. ప్రపంచమంతయు ప్రాణమువలన కలిగినది. ప్రాణముతో కూడియున్నది. ప్రాణమందే జగత్తుకలదు. ప్రాణమువలననే గడచుచున్నది. నీలమేఘముతో తుల్యమైన తను కాంతిగల శ్రీహరిని సర్వాధారమగు దారమువలె ప్రపంచమునకాధారభూతునిగా తెలియవలెను. రమాధవుని కరుణావిశేషముచే ప్రాణము నిలచియుండును. పద్మాలయయగు లక్ష్మీదేవి, దేవాదిదేవుండగు శ్రీహరియొక్క కరుణావిశేషమందొక యంశమును బొందినదేగదా! ముకుందునితో తుల్యుడును, వాని కంటె అధికుడును లేరు. ప్రాణము దండకు దారమువలె, జీవులకు సూత్రము తీరుగా నున్నది. అని చెప్పిన విప్రునకు కిరాతు డిట్లనెను.

స్వామీ! శ్రీహరి ప్రాణములకంటె యధికుడో, లేక శ్రీహరికంటె ప్రాణములే యధికమో నిర్ణయించి యానతిమ్ము. అని పలికిన

కిరాతునకు శంఖు డిట్లు చెప్పసాగెను. కిరాతుడా! నీవడిగిన ప్రశ్న సర్వజీవులచేతను నిర్ణయింపబడినది. ప్రాణమే అధికమని యెఱుంగ వలెను. దానిని వివరింతును వినుము పురాణపురుషుండగు పురు షోత్తముండు బ్రహ్మాండమును సృజించుతరి బ్రహ్మాది దేవతలను సృష్టించి వారితో నిట్లనెను. దేవతలారా! మీ దేవతారాజ్యము నకు బ్రహ్మదేవుని అధిపతిగా జేయుచుంటిని. గాన మీరు మంచి నడత శౌర్యౌదార్యాది సద్గుణములను గలిగియుండిన యెడల మీలో నొకరికి, యువరాజపదవిని యిచ్చెదను. అట్టివానిని తెల్పు డనగా, యింద్రాది దేవతలు నే నధికుడను, నేనధికుడను అని తమలో తాము పోట్లాడిరి. కొందరు సూర్యుడు గొప్పవాడనిరి. కొందరు దేవేంద్రు డధికుడనిరి. కొందరూరకుండిరి. దేవతలిట్లు అధికులెవరో నిర్ణయింప లేక శ్రీహరిని సమీపించిరి. దేవతలు హరికి నమస్కరించి, మహాప్రభూ! మీరు అడిగిన యధికులను తెలియ జేయుటకై మాలో మేము నిర్ణయించుకొనజాలకుంటిమి. గాన నీవే నిర్ణయింపుము. అని యడిగిన దేవతలకు కేశవుడు చిరునగవుతో యిట్లనెను.

ఈ శరీరము తెలివిగలిగియున్నప్పుడు, దీనినుండి యే దేవత బయటకు వచ్చిన, అచేతనమగునో, శరీరముపడియుండునో, మరల నే దేవతలోనప్రవేశించిన చేతనమై నడక గలిగియుండునో ఆ దేవతయే అధికమని తెలియవలెను అని శ్రీమహావిష్ణువు పలుకగా దేవత లట్లే యని అంగీకరించిరి. జయంతుడను దేవతాశ్రేష్ఠుడు హరిపాదములను విడచి బయటకు వచ్చెను. పాదములు, యింద్రియశూన్యమగుటవలన జయంతుడు కుంటివాడయ్యెను. కాని శరీరము పడిపోలేదు. వినుట, త్రాగుట, మాట్లాడుట, వాసన జూచుట, చూచుటకదలుట లోనగు యింద్రియవ్యాపారములను జరుపుచుండెను. మర్మస్థానములనుండి దక్షుడను బ్రహ్మ వెలువడెను. అతడు నపుంసకు డయ్యెను. గాని

దేహము పడిపోలేదు. యింద్రియ వ్యాపారములను చేయుచుండెను. దేవేంద్రుడు చేతులనుండి బయలు వెడలెను. యింద్రియ శూన్య మగుటవలన చేతులతో నేమియు చేయలేక, దేహము నిలబడి, సర్వ విధవ్యాపారములను గావించెను. సూర్యుడు నేత్రములనుండి వెడలి వచ్చినను వాసన తెలియకుండెను గాని వినుట లోనగు యింద్రియ వృత్తులను చేయుచుండెను. చెవులనుండి దిక్కులు బయటకు పోయి నవి. గాని శ్రవణేంద్రియము లేనందున చెవిటి వాడైనను శరీరము పడిపోక యింద్రియవ్యాపారమును చేయుచుండెను.

వరుణుడు నాలుకనుండి వెలువడి రుచిని గ్రహింపలేకుండెను గాని దేహము పడిపోక యింద్రియ వ్యాపారములను చేయుచుండెను. అగ్నిహోత్రుడు వాగింద్రియమునుండి వెలువడి మూగవాడైనను యింద్రియవ్యాపారమును కలిగియుండెను. రుద్రుడు జ్ఞానరూపుడై మనస్సునుండి వెడలివచ్చి జడస్వరూపుడైయుండి వ్యాపారములను నడపుచుండెను. పిమ్మట ప్రాణము లేచిపోయినందున దేహము పడి పోయినది. అందువలన మరణించిన దానినిగా గ్రహించి దేవత లత్యాశ్చర్యమును పొంది యిట్లనిరి. ఎవడు దేహమందు మరల ప్రవేశించునో, అందువలన మరల జీవింపజేయునో వాడే గొప్పవాడు గాన అతడే యువరాజునకు దగినవాడు. అని వారు ప్రతిన బూనిరి. దేవతలందరు యే యింద్రియము వలన యేదేవత బయలువెడలెనో ఆ యింద్రియమున ఆదేవత మరల లోన బ్రవేశించెను. ప్రథమ మున బయలుదేరిన జయంతుడు మరలపాదములందు ప్రవేశింపగా దేహము లేవలేదు. దక్షుడు గుహ్యస్థానమును, ఇంద్రుడు చేతులను సూర్యుడు నేత్రములను, దిక్కులు చెవులను, వరుణుడు నాలుకను, అశ్వినీదేవతలు నాసికమును, అగ్ని వాక్కును, రుద్రుడు, మనస్సును ప్రవేశించిరి, గాని శరీరము కదలలేదు. అంతమందు ప్రాణము ప్రవే

శింపగా శరీరము చలనముకలిగి లేచెను. బలము, జ్ఞానము, ధైర్యము, వైరాగ్యము, జీవము లోనగువానియందు, ప్రాణమే అధికమైనది గాను, దేవతలకు అధికారిగాను నిశ్చయపరచి నా ప్రాణమును యువరాజుగా నియమించిరి. ప్రాణము దేహము జీవించుటకు ఆధారమైనందున దానిని గొప్ప దానినిగా చెప్పిరి. చరాచరప్రపంచమంతయు ప్రాణముతో కూడియున్నది. ప్రాణము బలపూర్ణమైన తన అంశచేత జగత్తున నిండి అధిపతియై యుండెను. ప్రాణములేని వస్తు వేదియును నిలువదు. ఉండనేరదు. గాన ప్రాణమే సర్వజీవుల కంటె మిన్నయనియు, బలమైనదియు, అంతరాత్మయునై యున్నది. ప్రాణతుల్యముగాని ప్రాణముకంటె అధికముగాని యగు పదార్థమును నేను చూడలేదు. శాస్త్రములను వినలేదు. ప్రాణమొక్కటైనను ఆయాకార్యములను బట్టి అనేక రూపములను పొందియుండును. గాన ప్రాణోపాసన జేయువారు ప్రాణమునే అధికముగా తలంతురు.

ప్రాణుడు తన విలాసముచేతనే ప్రపంచమును సృష్టించుట, రక్షించుట నాశన మొనర్చుటగావింప సమర్థుడైయున్నాడు. శ్రీమహా విష్ణువుగాక మిగిలియున్న ఆదిశేషువు, శివుడు, ఇంద్రుడు లోనగు చేతనాచేతనములన్నియు ప్రాణమును తిరస్కరింపజాలరు. సర్వదేహాంతర్వర్తియు, సమస్తదేవతా రూపుడును, సర్వసమర్థుడగు ప్రాణుడు శ్రీమహావిష్ణువు ననుసరించి వశవర్తియై యుండును. శ్రీహరి వ్యతిరేకమగువానిని ప్రాణుడు వినడు, చూడడు. రుద్రేంద్రాదులు శ్రీహరికి వ్యతిరేకము చేయగలరు. సర్వాంతర్యామియగు ప్రాణుడు విష్ణువునకు వ్యతిరేకము గావింపడు. అందువలన హరికి ప్రాణము బలమని పండితులందరు. యీరీతిగా శ్రీమహావిష్ణువుయొక్క గొప్ప లక్షణములను యెఱింగి పూర్వజన్మకర్మలవలన సంభవించిన దేహాత్మ రూపమగు సంసార బంధమును, పాము కుబుసమును విడిచినట్లు

విష్ణువును, నాశన రహితమైన పరమపురుషుండగు రమావల్లభుని పొందుచున్నాడు. ఇట్లు శంఖుడు చెప్పిన మాటలను విని కిరాతుడు మిక్కిలి నిర్మలమగు మనస్సుతో వినయవిధేయతలు చూపుచు నమస్కారము గావించి మరల మునితో నిట్లనెను.

విప్రపుంగవా! మహాత్ముడును, జగత్తునకు గురువగు ప్రాణము యొక్క గొప్పతనము లోకమునందు యెచ్చటను ప్రసిద్ధిగాంచలేదు. కారణమేమి ? దేవతలు, మునులు, రాజులు, సజ్జనుల యొక్క గొప్పతనము లోకమున పురాణములందు ఖ్యాతిజెందియున్నది. కారణమేమి ? విప్రోత్తమా! నాకు వినవలెనని యున్నది గాన సవిస్తరముగా జెప్పుము. అనిన శంఖుడు చెప్పసాగెను. పూర్వ కాలమున ప్రాణుడు సంతసపడుచు నాశనరహితమైన శ్రీమహావిష్ణుని గురించి అశ్వమేధయాగమును చేయుటకై గంగానదీతటమును చేరెను. ప్రాణుడు గంగానదీతీరమందు యాగమునకై భూమిని సరిచేయుటకు నాగలితో దున్నింపగా పుట్టలో సమాధియందుండిన కణ్వుడను ముని నాగలిదెబ్బకు బయటికివచ్చి కోపముతో నిట్లు తన ముందున్న ప్రాణునిజూచి శపించెను. "ఇకమీదట మూడులోకము లందును నీకీర్తికి ప్రతిభతగ్గును. భూలోకమున నీకు ప్రశస్తి యుండదు. ముల్లోకములందును రామకృష్ణాది అవతారములే కీర్తి గాంచును." అని కణ్వుడు శపింపగా వాయుదేవుడు కూడ మిగుల కోపించి యిట్లు పలికెను.

కణ్వమునీంద్రా! అకారణముగా సమానశక్తి కలిగియు కూడ నన్ను తప్పులేకుండగనే శపించితివి, గాన నీవు గురుద్రోహి వైతివి. దూష్యమైన ప్రవర్తనగలవాడవు కాగలవు. అని ప్రాణ వాయువు కణ్వునికి ప్రతిశాపమిచ్చెను. అది మొదలు ప్రాణవాయువు నకు కీర్తి నశించెను. భూలోకమందు జనులే అంతరించెను. కిరాతుడా!

యీ రీతిగా శపింపబడిన కణ్వుడు గురువును తిని సూర్యునకు శిష్యుడయ్యెను, గాన నీ వడిగిన విషయమంతయు జెప్పితిని, యింకను వినదలచిన దడుగుము, చెప్పెదను, అని పలికెను,

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున పందొమ్మిదవ అధ్యాయము,

## ఇరువదవ అధ్యాయము

కిరాతుడు అడుగుచున్నాడు, మహానుభావా! సమస్త జగత్తుల కధిపతి యగు నారాయణమూర్తి అనేకకోట్ల జీవరాసులను సృజించుటకు గల కారణమేమి ? జీవు లనేకస్వభావములు గలవిగా అనేక రీతుల సంచరింపుచు చాలాకాలమునుండి రాగల అనేక కర్మలను జేయుచుండుటకు కారణమేమి ! గాన విశదీకరించి చెప్పుము అని యడిగిన కిరాతునికి శంఖుడు చెప్పెను, జీవులు సత్వరజ స్తమో గుణములను త్రిగుణాత్మక భేదములవలన మూడువిధములుగా నుండిరి, సత్వగుణప్రధానులు సాత్విక కర్మములును, రజోగుణ ప్రధానులు రాజసకర్మమును తమోగుణప్రధానులు తామసకర్మమును క్రమ ప్రకారము చేయుదురు, జీవులు జన్మకర్మవలన సంసారమందుబడి గుణభేదముచే కర్మలను జేయుచు వానియొక్క శుభాశుభములను బట్టి ఫలితము ననుభవింపుచుందురు, జనులు వారివారి కర్మల ననుసరించి సుఖదుఃఖములను బొందుచున్నారు, ఈ జీవులు ప్రకృతి యందు త్రిగుణాత్మకమగు గుణకర్మలను జేయుచు అందుకు తగిన ఫలితమును పొందుచు గుణానుసారమైన మాయను పొంది ఫలితము ననుభవింతురు,

మాయారూపమగు జీవులు మాయకు లోబడి గుణకర్మల ననుసరించి జన్మములను పొందుచు మాయామార్గమునే యనుస రింతురు, మాయారూపులైన జీవుల కీభేదముకలదుగాని మాయ కేమియు మార్పులేదు. తమోగుణప్రధానులు సదా దుఃఖభాజనులై నిర్దయులై కఠినులై యీ లోకమున శత్రుభావముతో జీవింపుచు రాక్షసజన్మ, పిశాచజన్మ లోనగు జన్మలను బొందుచు తమోగుణ ప్రధానమగు మార్గములను అనుసరింతురు. రజోగుణస్వభావులు మిశ్రమబుద్ధి గలవారై పుణ్యములను పాపములను గూడ జేయు చుందురు. పుణ్య మతిశయించిన స్వర్గలోకసుఖమును పొందుదురు. పాప మధికమైన నరకలోకమును చేరుదురు. గాన జ్ఞానరహితులు తఱచు సంసారచక్రమున పరిభ్రమించుచుందురు. ధర్మరూపులును దయాస్వరూపులును, శ్రద్ధాయుతులును, అసూయారహితులును, సాత్త్వికగుణప్రధానులు నగుసజ్జనులు సత్కర్మలనే యాచరింపుదురు. వారు తేజోవంతులై నిష్కల్మషులై త్రిగుణాతీతులై పరమాత్మ లోకమును బొందుదురు. జీవులు వేరుగా కర్మలు, స్వభావములు, నడతలు గలిగియుందురు. నీ రజనాథుండగు శ్రీహరి వారి కర్మల ననుసరించియు గుణములను బట్టియు కర్మలను చేయింపుచున్నాడు. జ్ఞానముగల సజ్జనుడు తనరూపమును పొందుటకు శక్తుడగును. పరి పూర్ణుడైన కేశవునికి భేదబుద్ధిగాని, నిర్దయగాని లేదు. సృష్టి స్థితి లయములను సమరీతిని నిర్వర్తించును గాన జీవులు తమ కర్మల ననుసరించి పుణ్యపాపఫలములను పొందగలుగుచున్నారు. తోట వేసినవాడు చెట్లకు నీరు ఒకే ప్రదేశమునుండి తెచ్చిపోసి సమబుద్ధితో పోషించినను ఆ చెట్లు వాటిస్వభావమునే పొందును. గాన తోట వేయువానికి విరోధముగాని నైర్ఘృణ్యముగాని భేదబుద్ధిగాని లేదు. మునిశేఖరా! సంపూర్తియైన జ్ఞానమును సంపదగల సజ్జనులకు

స్థితిలయములందు మోక్షము యెప్పుడు కలుగును, అను విషయము నాకు చెప్పుమని సృష్టియగుచున్నది. రక్షణపొందుచున్నది. నాశము నధిగమించుచున్నది. యీ మూడుసమయము లందును ఎప్పుడు మానవుడు ముక్తినిపొందును. విప్రోత్తమా! భగవానుని సచ్చరిత్రము దెలిసికొనగోరితిని. యానతిమ్మని కిరాతుడడిగెను.

శంఖుడు కిరాతునితో నిట్లనెను. ఓయీ! నాల్గువేలయుగములు బ్రహ్మదేవునకు పగలగును. మరి నాల్గువేలయుగములు రాత్రియగును. ఇట్టిరాత్రి పగలుకలసి బ్రహ్మదేవున కొక దినమగును. పదునైగుదినములు పక్షమగును. రెండు పక్షము లొక నెలయగును. రెండునెల లొక ఋతువగును. మూడు ఋతువు లొక ఆయనమగును. రెండు ఆయనములు ఒక సంవత్సరమగును. అట్టి నూరు దివ్యవర్షములు గడచిన బ్రహ్మకు బ్రహ్మకల్పమయ్యెనని యందురు. యీ కాలనిర్ణయము ప్రళయమని వేదవేత్తల యభిమతమైయున్నది. ప్రళయము మూడువిధములుగా నున్నది. మానవులు నశించినప్పుడు మానవప్రళయ మనియు, బ్రహ్మదేవుని కొక దినము గడచినపిదప దినప్రళయమనియు నూరు దివ్యవత్సరముల పిదప బ్రహ్మ యంతరించినపుడు జరుగు ప్రళయమునకు బ్రహ్మప్రళయమనియు యందురు. బ్రహ్మదేవునకు ఒక ముహూర్తమైన మొదల మనువునకు ప్రళయమగును. ఇట్లు పదునాల్గు ప్రళయములు జరిగినపిమ్మట దినప్రళయములు జరుగుచుండును. మన్వంతరమున మూడులోకములు నశించును. చేతనములు మాత్రము నశించి స్థావరరూపములై లోకములు నశింపక పూర్వపురీతినే సీటితో నిండియుండును,

మన్వంతరముపూర్తియైన పిమ్మట చేతనములు తిరిగి జనియించును. దినప్రళయమందు సర్వమును నశించును. బ్రహ్మ నిదురించునపుడు దినప్రళయమగును. అప్పుడు బ్రహ్మలోకము తప్ప

మిగిలిన లోకములు, వాని యధిపతులతోడను, చేతనములతోడను, అధిదేవతలతోడను గూడ నశించును. వేదాంతజ్ఞాన పరిపూర్ణులైన దేవతలు, మునులు, జ్ఞానులు దినప్రళయమందు నశింపక సత్యలోకమున బ్రహ్మదేవునితో గూడ నిద్రింతురు. అట్లు దినకల్పమగు పర్యంతము నిద్రించి, విషయకార్య శూన్యులైయుందురు. బ్రహ్మదేవుడు రాత్రి పూర్తికాగానే మరల పూర్వమువలెనే ప్రపంచమును సృజించును. మునులను, దేవతలను, పితృదేవతలను, భూర్భువాది లోకములను, ధర్మములను, వర్ణములను, దేశములను చక్రధారియగు చెన్నుని యవతారములను సృష్టించెను. వీరందరును బ్రహ్మకల్పాంతమువరకు నివసించియుందురు. ముక్తిని పొందినవారును, న్యాయపాలన చేసిన రాజులును, సిద్ధినిగాంచిన విరాగులును, బ్రహ్మలోకమున బ్రహ్మతో నిద్రించి మరల లేచుచుందురు. వివిధరాజుల యందున్న దేవతలు మునులు, వారి వారికి నియుక్తమైన రీతిని ఆయాగోత్రములందు పుట్టి వారి వారి కర్మలను చేయుచుందురు, కలియుగాంతమున రాక్షసులు, పిశాచులు, లోనగువారితో తమ నరకస్థానమును కలిపురుషునితోకూడ జేరుదురు. పిశాచగణమందున్నవారు వారితో గలసి తమతమ కర్మానుసారముగా పుట్టి తమతమ కర్మలను చేయుదురు. బ్రహ్మాదిదేవతల సృష్టిలయములు కాలవిశేషమును జెప్పుచున్నాను. సావధానుడవై వినుము.

దేవాదిదేవుడైన శ్రీహరి కన్ను మూసిన మాత్రాన బ్రహ్మదేవునకు కల్పమగును. కల్పాంతమందు భగవంతుడు మరల కన్ను తెరచును. తన హృదయమందున్న లోకమును మరల సృజింప వలెనను కోరిక గలుగును. మనస్సున గలవిరియును, సృజియింపదగిన వారును, లింగశరీరులును, లింగభంగులును, లోనగు పెక్కు జీవులను సృజింపవలెనని కోరిక గలుగును. నిద్రించువారును, మేల్కొనిన

వారును, అజ్ఞానులును, పూర్వకల్పమున విధ్యుక్తమైన లింగశరీర భంగముకలవారును పిపీలికాది మానవపర్యంతముగల జీవులును ముక్తినిగాంచినవారును, జీవన్ముక్తులును, బ్రహ్మాదిమానవ పర్యంతము పూర్వకల్పమున ముక్తినిగాంచిన సర్వజీవులును ప్రళయకాలమందు విష్ణుమూర్తియొక్క మానసపద్మమందు ధ్యానమొనరించుచుందురు. వనజగర్భుడు కన్నుదెఱచినంతమాత్రమున, షడ్గుణైశ్వర్యయుతమైన వాసుదేవాది నాల్గు వ్యూహములు గల్గియుండుటవలన దాని ననుసరించి బ్రహ్మకు సాయుజ్య ముక్తినిచ్చును. పిమ్మట కొందరు మహాత్ములకు తత్వజ్ఞానమును, కొందఱకు సారూప్యమును, కొందఱకు సామీప్యమును, కొందఱకు సాలోక్యమును, ప్రభువగు పంకజాక్షుడొసంగును. భగవంతు డనిరుద్ధవ్యూహము ననుసరించి తన కుక్షిని గల సర్వలోకములను జూచును. ప్రద్యుమ్న వ్యూహమునుండి సృష్టినిజేయ సంకల్పించు మాయ, జాయ, కృతి, శాంతి అను నాలుగు శక్తులను, వాసుదేవానిరుద్ధప్రద్యుమ్న సంకర్షణములను నాల్గువ్యూహములం దుండి వరియించెను. శ్రీమహావిష్ణువు పరిపూర్ణమైన గుణములు గలిగి నాల్గు శక్తులతోగూడి సంపూర్ణమైన కోరికలు గల్గియుండి వేర్వేరు కర్మలు, ఉద్దేశములుగల వారినిగా సృజించెను. ఇట్లు బ్రహ్మకు పగలుగానున్న కాలమున సృష్టిజేసి పిదప శ్రీహరి యోగమాయ ననుసరించి కన్నులు మూయగా బ్రహ్మకు రాత్రి యగును. అంత విష్ణువు సంకర్షణవ్యూహమును పొంది చరాచరాత్మకమైన ప్రపంచమును నశింపజేయును. విష్ణువుయొక్క కార్య మిట్లుండును, వాని కర్మలు బ్రహ్మాదిదేవతలకును యోగులకును గూడదెలియ నశక్యము అని పల్కెను.

కిరాతు డడుగుచున్నాడు. మునిశ్రేష్ఠా! భగవంతుని కిష్టమగు ధర్మములేవి? విష్ణుమూర్తి యే ధర్మములవలన దయగలవా

దగును. నీవలన వినగోరితిని. అని యడుగగా శంఖుడు చెప్పుచున్నాడు. మనమున గల దుర్గుణములను తొలగొట్టునది, సజ్జనులకుపకారము చేయునది, యితరులచేత దూషింపబడకుండునది, వేదములందును, శాస్త్రములందును నిర్వచింపబడినది, వాంఛారహితుని జేయునది, లోకమున కనుకూలమైనది యగు ధర్మమే సాత్వికధర్మమని తెలియదగును. బ్రాహ్మణాది వర్ణవిభాగముచేతను, బ్రహ్మచర్యాద్యాశ్రమవిభాగముచేతను, నాల్గు రీతులుగానున్న ధర్మములు నిత్యనైమిత్తిక కామ్యములను మూడు విధములై యుండును. నాల్గు వర్ణములవారు, తమ తమ ధర్మములను చేయుచు, విష్ణుదేవునకా ఫలము నర్పించిన యెడల ఆ ధర్మములు సాత్వికములై శుభప్రదములైన భగవత్సంబంధమగు ధర్మములందురు. శ్రీహరికి సంబంధింపక యితర దేవతల నుద్దేశింపబడినవియు, కోరికలతో గూడినవియు, నగు ధర్మములు రాజస ధర్మములందురు యక్షులు, రాక్షసులు, పిశాచములు మొదలగు దేవతాసంబంధములు, కఠినమైనవి, హింసారూపమైనవి, దూష్యములునగు ధర్మములు తామస ధర్మములందురు. సాత్వికగుణముగలవారు శుభప్రదములును విష్ణుప్రీతికరములు నగు సాత్వికధర్మములను చేయుచు ఫలాపేక్షలేక యుందురు, గాన వారు భాగవతులనబడుదురు. ఎవరి మనస్సు సదా శ్రీహరియం దుండునో నాలుక శ్రీహరి నామమును దలంచుచుండునో, శ్రీమహావిష్ణువు యొక్క పాదము లెవరి మానసమందు నిలచియుండునో వారే భాగవతులనబడుదురు. సదాచారము గలిగి, సర్వప్రాణుల కుపకార మొనర్చుచు యీషణాత్రయములందు మోహమును వదలి యుందురో వారే భాగవతులని చెప్పబడుదురు. శాస్త్రము, గురువు, సజ్జనుడు, కర్మము వీనియందు విశ్వాసముగలిగి విష్ణువు నందు భక్తిగలవారు భాగవతులనం బడుదురు. స్థిరమై, విష్ణు ప్రీతికరముల్తై వేదములచేతను

స్మృతులచేతను చెప్పబడు ధర్మములు శాశ్వత ధర్మములని తెలియం దగును. సర్వపుణ్యప్రదేశములందును తిరుగుటయు, సమస్త పుణ్య కార్యములను చూచుటయు విషయములందు మనస్సును బోనివ్వక సర్వధర్మములను వినుచుండుట చేయవలయును. సుందరమైన వని తలు నపుంసకుని కక్కరరాని రీతిని, ప్రపంచభోగములన్నియు జ్ఞానుల నుపయోగించవు. చంద్రకిరణముల ప్రసారమువలన చంద్రకాంతశిల కరగినరీతిగా సజ్జనుల దర్శనమువలన సత్పురుషుల మనంబులు కరగు చుండును.

మంచి శాస్త్రములను విని సత్పురుషుల మనస్సులు నిర్మల మగుచు విషయవ్యామోహమునందలి యసహ్యతచే సూర్యకిరణ ప్రసారమువలన సూర్యకాంతమణి ప్రకాశించునట్లు మండుచుండును. శ్రద్ధతో కూడియున్నదియు, వాంఛారహితులగుమానవులచే చేయ బడినదియు శ్రీహరికి యిష్టమగునవియు నైయుండు ధర్మములు భగ వత్సంబంధమగు ధర్మములందురు. ఇహపరలోక సుఖముల నిచ్చు నవియు, రమాకాంతునికి ప్రీతికరమగునవియు, రహస్యమైన వియు, సర్వదుఃఖములను పోగొట్టునవియునగు ధర్మము లనేక ములు పూర్వుచే తెలుపంగబడియే యున్నవి. పద్మనాభు డైన లక్ష్మీభర్త రమాదేవికి పాలసముద్రమున వటపత్రశాయియై పరుండి యుండగా సమస్తధర్మములందును వైశాఖ ధర్మము శ్రేష్ఠమని పెరుగును తరచి వెన్నను దీసినట్లు వివరించి చెప్పెను. వైశాఖధర్మము లనగా మార్గమధ్యమున నీడగానుండు విశ్రమ ప్రదేశముల నేర్పరచుట, చలివేంద్రలు పెట్టి జలదాన మొనరించుట, మార్గాయాసమును పొందినవారికి విసనకఱ్ఱలతో వీచి సేద దేర్చుట, ఎండవేడిమికి తపించినవారికి నుపచారము లొనర్చుట, గొడుగు నిచ్చుట, పాదుకలనిచ్చుట, కర్పూరము, మంచిగంధము లొసగు

పరిమళద్రవ్యముల నొసంగుట, ధనప్రసక్తి ననుసరించి దిగుడుబావులను, మాతులను, త్రవ్వించుట, తటాకములను త్రవ్వించుట, సాయం సమయములందు పానకము దానామిచ్చుట, పుష్పాలనిచ్చుట, తాంబూల మొసంగుట పాపహరమగు గోక్షీరము లోనగు వాని నొసంగుట, ఎండవేడిమికి తపించినవారికి ఉప్పుకలిపిన మజ్జిగనిచ్చుట, తలంటి నీరుపోసి అభ్యంగనము చేయించుట విప్రులపాదములను కడుగుట, చాప, కంబళి, పడక లోనగు వానిని యిచ్చుట ఆవునిచ్చుట మధుమిశ్రితమగు తిలలను దానమిచ్చుట సాయంకాలమందు చెఱకుగడలను దానముచేయుట దోసపండ్లను యితరపండ్ల రసములను తినుటకు త్రాగుటకు యిచ్చుట పితృదేవతలను గూర్చి తర్పణములను అంజలులను వదలుట యీమొదలైన వైశాఖధర్మములను చేయుచుండవలెను.

కిరాతుడా! యీ వైశాఖధర్మము లన్నియు సమస్తమగు ధర్మములలోను మిక్కిలి శ్రేష్ఠములని తెలియదగును. మాధవప్రీతికరమైన వైశాఖమాసమున సూర్యుడు మేషరాశియం దుండగా సూర్యోదయకాలమున స్నానమొనరించి విప్రులచే చెప్పబడిన ధర్మములను చేయుచు సంధ్యావందనాది నిత్యకర్మలను జేయుచు శ్రీహరిని పూజింపుచు స్థిరమైన నిర్మలచిత్తముతో వైశాఖపురాణమును వినవలెను. నూనెతో తలనంటుకొనుట కంచమందు తినుట శాస్త్రనిషిద్ధవస్తువుల నారగించుట వ్యర్థప్రలాపము లాడుట, వైశాఖమాసమందు వర్జింపవలెను. ఆనపకాయ, వెల్లుల్లి, నువ్వుపిండి, పులికడుగు, చద్దియన్నము నేతిబీరకాయ వైశాఖమాసమున వర్జింపవలెను. బచ్చలికూర, కొడిశపండు, ములగకాడలు, అపక్వధాన్యములు, ఉలవలు, చిరుసెనగలు వైశాఖమాసమున తినకూడదు. తొడిమలు గల కూరలు కొడిశపండ్లు, ఆళ్ళు, చిక్కుడుకూర, యవ

ధాన్యపుకూర, కుసుమపువ్వులు, ముల్లంగిదుంపలు వైశాఖమాస వ్రతము గలవారు విడవవలెను. మేడిపండు, మారేడిపండు, ౧౬ పండ్లు భుజించుట వైశాఖమున విడువవలెనని విద్వాంసులు చెప్పిరి. ఈ నిషేధింపబడిన పదార్థములందు వైశాఖమాసమున మానవుడు దేని నుపయోగించినను బ్రతికియుండగనే చండాలుడై పిదప నూఱు జన్మముల వఱకు మృగజన్మమెత్తును. ఇందును సందేహము లేదు. ఇట్లు మాధవుని ప్రీతికై వైశాఖవ్రత మాచరించి విష్ణుప్రతిమను చేయించి బట్టను చుట్టి తనశక్తికొలది పూజించి ప్రతిమను దక్షిణ సహితముగా విప్రునకు దానమియ్యవలెను.

వైశాఖమాసమున బహుళ ద్వాదశి తిథియందు పెరుగుకలిపిన యన్నమును జలముతో నిండిన కలశమును, ఫలములు, దక్షిణలు గల తాంబూలమును దానము చేసిన యెడల ధర్మరాజు సంతసించును. యజ్ఞోపవీత మపసవ్యముగా నుంచుకొని, తండ్రి యొక్క గోత్రనామ ముల నుచ్చరించి, పెరుగుతో కలిపిన యన్నము గురువులకును పిమ్మట విష్ణుమూర్తికిని పెట్టిన యెడల పితృదేవతలు ప్రీతులగుదురు. నాశనరహితమగు ఫలము కలుగును. చల్లని నీరును, పెరుగు కలిపిన యన్నమును, ఉత్తమమైన కంచుపాత్రయందుంచి దక్షిణ, తాంబూలము, భక్ష్యములు, ఫలములు లోనగు వానిని బెట్టి విష్ణుప్రీతిగా కుటుంబీకుడగు విప్రునకు యిచ్చి పిమ్మట శక్తికొలది గోదానము చేసినయెడల విష్ణులోకమును పొందును. కపటము లేక యీ రీతిగా వైశాఖమాసవ్రతము నేమానవుడు చేయునో అతడు సర్వపాప వినిర్ముక్తుడై నూఱుతరముల వారిని తరింపజేసి సర్వభూతములు చూచుచుండగా సూర్యమండలమును భేదించి, యోగీశ్వరులకు కూడ పొంద నశక్యమైన విష్ణుసాయుజ్యమును పొందును.

" ఈ విధముగా విప్రోత్తముడైన శంఖుడు శ్రీమహావిష్ణువుచే నిర్ధారణ చేయబడిన వైశాఖమాస ధర్మములన్నియు కిరాతునకు విశదీక

రించి చెప్పు సమయమున అచ్చట నున్న అయిదు కొమ్మలు గల మఱ్ఱిచెట్టు అందఱును చూచుచుండగా భూమిమీదపడిపోగా మిక్కిలి ఆశ్చర్యము కలిగెను. అంతట ఆ చెట్టుతొఱ్ఱలోనుండి పెద్ద దేహముతో భీతినిగొల్పు స్వరమొకటి బయటకు వచ్చి పూర్వజన్మకృత పాపముచే కలిగిన యీ సర్పరూపమును విడచి మానవరూపమును పొంది యీ మునిచంద్రుని ముందల శిరస్సు వంచి నిలచెను. ||

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమందు
నారదాంబరీష సంవాదమున యిరువదవఅధ్యాయము

## ఇరువది యొకటవ అధ్యాయము

శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. శంఖుడా కిరాతునితో గూడిన మానవరూపుని జూచి ఆశ్చర్యముబొంది నీ వెవరవు ? నీ కిట్టి స్థితి యెందుకు కలిగెను ? నీవు యేకర్మచేయుటవలన యిట్టి సద్బుద్ధి కలిగినది ? వెంటనే మోక్షము యెట్లు కలిగెను. దీనినంతయును వివరించి చెప్పుము అని యడిగెను. ఇట్లు ముని యడుగగా దండమువలె భూమి మీదబడి సాష్టాంగ నమస్కారములుచేసి వినయముతో శిరమును వంచి దోయిలిపట్టి యిట్లు పలికెను. నేను పూర్వమందు ప్రయాగ తీరమున నివాసముచేయు కుసీదుడను మునికుమారుడను. ఎక్కువగా మాట్లాడువాడను, సౌందర్యవంతుడను, యౌవనరూపముగలవాడను, విద్యాగర్వముగలవాడను, ధనవంతుడను, విశేషపుత్రవంతుడను, అహంకారముగలిగినందున దూషణకు పాత్రుడను, క్రోధముకూడ గలవాడను, కూర్చుండుట, పండుకొనుట, నిద్రపోవుట, భుజించుట, జూదమాడుట, లోకాభిరామాయణములను చెప్పుకొనుట,

వ్యాపారము చేయుట, లోనగు కార్యములను చేయుచుంటిని. లోక నిందకు భయపడి కపటమైన సంధ్యావందనాది కర్మల నాచరించు చుంటినిగాని శ్రద్ధకర్మలయందొక వ్వడును లేదు. దుర్మార్గపు బుద్ధులు గలిగి చెడువ్యాపారములను చేయుచు కొంతకాలము గడపితిని. అంతట వైశాఖమాసమున జయంతుడను విప్రుడు పుణ్యతీర్థముల యందుగల బ్రాహ్మణోత్తములకు పుణ్యాత్ములైన భగవద్భక్తులకు సంతోషప్రదమగు వైశాఖధర్మములను వినిపించుచుండెను. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాల్గుజాతుల పురుషులును స్త్రీలును వైశాఖమాసమున సూర్యోదయకాలమున స్నానమాచరించి నాశన శూన్యుడైన శ్రీహరిని పూజించి పవిత్రులై యితర ప్రసంగములను వర్జించి ముకుందుని సంబంధమైనవియు, వైశాఖమాసమునకు సంబంధించినవియు ధర్మములయందుత్సాహముగలవారై కల్మషమును యవివేకమును వదలి సదా జయంతునివలన సత్కథలను వినుచుండిరి.

మునిచంద్రా! ఇట్లు కథాకాలక్షేపము జరుగుచున్నంత ఆ సభను జూచు తలంపున చొక్కాయి తొడిగికొని తలకు పాగాచుట్టుకొని తాంబూలమును సేవించుచు సభలోనికిపోయి యొక మహాత్మున కైనను నమస్కరింపలేదు. ఆ కథలను వినలేదు. ఆ వినువారిని ఆ కథలను ఆక్షేపించితిని. యితర ప్రసంగములను జెప్పుచు వారిని కల్లోలపరచితిని. ఒకరిని వస్త్రముచే లాగితిని. ఒకనిని నిందించితిని. ఒకచోట నింకొకనిం జేరి నవ్వితిని ఇట్లు కథ యంతమగువరకు పరిహాసముగావించితిని. అవివేకముతో నేను చేసిన దుష్కృత్యములతో నా యాయుర్దాయము నశించినది. సన్నిపాతరోగము సంభవించినది. వెంటనే మరణించుచు చనిపోతిని. అంతట కాచిపోసిన సీసముపలనను కాచినజలముల చేతను కాలసూత్రవిష మనుభవింపుచు

నరకమందుండి పదునాల్గు మన్వంతరముల నరకయాతనల ననుభ వించి యెనుబదినాల్గులక్షల జీవరాసులయందు క్రమరీతిని జన్మలనెత్తి పిమ్మట నొకపామునై పదియామడలపొడవును నూఱామడలు చుట్టును గల యీ మఱ్ఱిచెట్టునందు ఏడామడల పొడవుగల తొఱ్ఱలో నుండి తామసవృత్తిచే క్రూరకార్యములను చేయుచు పూర్వజన్మ కృత పాపకర్మములచేత బాధింపబడుచు పదివేల వత్సరములనుండి తిండిలేక నివసించుచుంటిని. మునిశేఖరా! మీవలన చెప్పబడిన యమృతసమానమైన హరికథను నానేత్రములతో వినినందున (పాములకు నేత్రములే చెవులు) సర్వకష్టములు దీరి సర్పదేహమును వదలి ఉత్తమమైన పురుషస్వరూపమును పొంది మీకు చేతులు జోడించి నమస్కరించి మీపాదములనే రక్షణములుగా దలంచితిని.

మునివల్లభా! ఏజన్మమున మీరు బంధువులో నాకు తెలి యదు, మేలుచేకూర్చితిరి. నావలన మీకు ఉపకృతి యెన్నడును జరిగియుండలేదు. సజ్జనులు సర్వప్రాణులతోడను సంబంధము కల్గి యుందురు. సర్వభూతసమత్వము, సర్వభూతములయందు దయ, సజ్జనులబుద్ధి పరోపకారసుకృతియం దిచ్ఛ మీవంటి సత్పురుషుల కుండును. నాకు సదా ధర్మబుద్ధి గల్గునట్లుగను, చక్రధారియగు చెన్నునియం దనవరతభక్తి గల్గునట్లుగను నన్ననుగ్రహింపుడు. గ్రుడ్డివానికి కాటుకవలన సర్వమును గనుపించినట్లు ధనమత్తతచే అతిశయించినవానికి దరిద్రమువలన శాంతి కలుగునట్లు సచ్చరిత్ర గల మీ సహవాసమెల్లప్పుడును వుండవలెను. ఇట్లనేకరీతుల స్తుతించి మాటిమాటికి నమస్కరించుచు తలవంచి మునియెదుట యూరక నిలచెను. శంఖుడు ప్రేమతో చేతులనెత్తి కూర్చుండబెట్టి ధర్మ శ్రవణముచే హరింపబడిన పాపములు గల పురుషుని తనచేతితో సర్వావయవములను తాకి ఉత్తమరూపమును బొందియున్న విప్రుని

యందు కరుణకలిగి దయాసహితుడై అతనితో ముందు జరుగు వృత్తాంతమును జెప్పనారంభించెను.

విప్రోత్తమా! వైశాఖమాస ధర్మములను వినుటచేతను, విష్ణుమూర్తి యొక్క కథలును వినుటచేతను సమస్తమైన సంసార బంధములనుండి విడువబడి, సమస్త కల్మషములను పోగొట్టుకొని తరువాత జన్మమున పుణ్యవంతమగు దశార్ణదేశమునందు భూసురుడువుగా బుట్టి వేదశర్మయను పేర వేదశాస్త్రములను చదివి, శుభకరములగు పూర్వజన్మజ్ఞానమును పొందగలుగుదురు. ఋణత్రయములను వదలి శుభవాంఛలను కలిగి, శ్రీహరికి యిష్టమగు వైశాఖ ధర్మములను ఆచరింపగలవు. ఆ జన్మమున శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములచేత విడువబడి కోరికలేనివాడవై, మోహరహితుడవై, గురుభక్తికలవాడవయి, యింద్రియనిగ్రహము కలిగి సదాముకుందుని కథలును వినుచుందువు. సమస్తమగు తాపత్రయ బంధములను వదలి ఫలసిద్ధినిపొంది యాగాది క్రతువుల చేత గూడ బొందనేరని ఉత్తమస్థానమును పొందగలవు. పుత్రసమానుడా! నీకు భయములేదు. నాదయవలన నీకు మేలు కలుగగలదు. హాస్యముచేతగాని, భీతిచేతగాని, క్రోధముచేతగాని, శత్రుత్వముచేతగాని, ఆశచేతగాని, మిత్రత్వముచేతగాని, పాపనాశనమగు పరమేశ్వరుని నామము ఒకమారైనను తలచినయెడల పాపములు చేసినను నాశనములేని నారాయణుని సాయుజ్యమును పొందగలుగుదురు. విప్రోత్తమా! శ్రద్ధావంతులును, క్రోధరహితులును, యింద్రియ నిగ్రహముగలవారును యగు సజ్జనులును దయతో కూడినవారై వందున వైకుంఠప్రాప్తిని పొందకల్గుదురు. సర్వధర్మములను త్యజించి హరిభక్తినే గలిగి, విష్ణుకథలనే వినుచు కొందరు వైకుంఠమును పొందుచున్నారు. భక్తితో కొందరును, క్రోధముతో కొందరును

శ్రీహరిని సేవించి ముక్తినిగాంచుచున్నారు. ఎట్లనగా పూతనయను రక్కసి శ్రీకృష్ణుని ప్రాణములను హరింపనెంచి వచ్చి కృష్ణునిచేత తానే చంపబడి వైకుంఠమును బొందెను. ముక్తినిగోరువారు, సజ్జన సహవాసము, సజ్జనగోష్ఠి, సత్సాంగత్యము యిట్టివి చేయవలెనని శాస్త్రములందు కలదు. శ్లోకమునందు తప్పులుండినను శ్రీహరి నామము కలిగియుండెనేని సజ్జనులు వానిని వినుచు, తలచుచు, పాడుచు, భాషించుచు, తమపాపములను పోగొట్టుకొందురు. మిక్కిలి కష్టమైన సేవగాని, ఎక్కువగు విత్తముగాని, సుందరమగు ఆకారముగాని, యౌవనముగాని, లక్ష్యము చేయక తన నాలుకపై కోరునో అట్టి వైకుంఠవాసుని నామ మొక్క పర్యాయము తలంచినను విష్ణుసాయుజ్యమును పొందును. గాన వేఱుదైవమును కొలచి పొందిన లాభము లేదు. నాశనములేనివాడును, భక్తులయం దనురక్తిగల వాడును అవాఙ్మానసగోచరుండును, జ్ఞానముచే తెలియబడు వాడును, దయాసాగరుండును అగు శ్రీమన్నారాయణుని రక్షకునిగా తలంపుము. బుద్ధిశాలా! వైశాఖమాస ధర్మములను నిర్వహించితివేని మాధవుడు శ్రీఘ్రమే ముక్తి నొసంగగలడు. అని యీరీతిగా శంఖుడు పలికెను. పిమ్మట దివ్యపురుషుడు ఆ మాటలనిన్నియు విని వింత పడి మునితో నిట్లనెను. మునిచంద్రమా! దైవవిధిచేత కష్టమయుండవగు నీవు నన్ననుగ్రహించుటచేత ధన్యాత్ముడనైతిని. నా నీచజన్మము తొలగినది. ఉత్కృష్టమగు విష్ణులోకమును పొంద గలను. అని పలికి దివ్యమూర్తి మునీశ్వరునికి ప్రదక్షిణము గావించి అతని యానతి వడసి స్వర్గమునకు జనెను.

మహారాజా! అంతట సాయంకాలము ఆసన్నమాయెను. కిరాతుడు శంఖునివి అనేక ఉపచర్యలచేత సంతసపఱచెను. మునియును సాయాహ్నికకర్మల నాచరించి మహాత్ములగు దేవతలయొక్క-

రాజులయొక్క కథలను పరమేశ్వరుని దశావతార విలాసములను తాను దిలకించిన యితరపుణ్యాచరిత్రలను చెప్పుకొనుచు రాత్రి గడపిరి. సూర్యోదయకాలమున లేచి మునివల్లభుడు పాదములను కడిగికొని శుచియై నిత్యకర్మలను జేసి మౌనముబూని తారకబ్రహ్మ మతమును జపించెను. వైశాఖమాసమున దివాకరుడు మేషరాశిని ప్రకాశింపుచుండగా సూర్యోదయ కాలమునకు స్నానసంధ్యావందనాది నిత్యకృత్యములను నిర్వర్తించి, సర్వదేవతలను సంతృప్తిపరచి సంతోషితాంగుండై కిరాతునిపై మంత్రజలమును ప్రోక్షించి వేదాధిక్యమైనదియు శుభప్రదమైనదియునగు 'రామ' అను రెండక్షరములను ఉపదేశించెను. నారాయణుని నామ మొక్కటయినను వేదములకంటె శ్రేష్ఠమైనది. విష్ణునామము లనేకములు గలవు. వానిలో వేయినామములు మిన్నయైనవి. అట్టి విష్ణుని వెయ్యినామములలో 'రామ' అను నామ మసమానమైనది. కిరాతుడా! గొప్ప మహాత్తును కలిగిన రామనామమును జపింపుము. ఆమరణాంతము వైశాఖధర్మములను చేయుచుండుము. పిమ్మట నీవు వల్మీకమున పుట్టి వాల్మీకుడను పేర భూమియందు ప్రకాశింపగలవు.

ఇట్లు కిరాతుడు మునివలన ఉపదేశింపబడి వానికి పదేపదే ప్రదక్షిణము చేసి నమస్కరించి. కొంతదూర మాతనితో నడచి సాగనంపి దక్షిణదిక్కుకు ప్రయాణము చేయుటకై పంపెను. ముని జనుట కిచ్ఛలేనివాడై విచారింపుచు వానింజూచి మనస్సున దలచు కొనుచు బహుకష్టముతో వెనుకకువచ్చెను. పిమ్మట ఆమార్గమందు ఒక గొప్పతోటను నిర్మించి చలివేంద్రము నిర్మించి నిర్మలమైన జలమును పిపాసాతప్తుల కొసంగుచు యోగ్యములైన వైశాఖధర్మముల నిర్వర్తించుచుండెను. ఆ తోటలందు ఫలభరితములగు తరువుల నేర్పరచి వెలగ, పనస, నేరేడు, మామిడి ...

ఫలములను ఆకలిబాధచే నలమటజెందువారికి మార్గాయాసమున అలసి సొలసి పడియున్నవారికి ఆహారముగా నొసగెను. పాదుకలను పరిమళగంధములను, గొడుగులను, విసనకఱ్ఱలును, విశ్రమస్థానములను ఛాయాప్రదేశములను సుఖాస్థగణములను బాటసారు లాసీనులగుటకు దగు నేర్పాట్లను గావించుచు చెమటను పోగొట్టి ఉపకారమును జేయుచుండెను. అతడు సూర్యోదయకాలమున స్నానమాడి అహోరాత్రములు రామనామ జపమును చేయుచు కిరాతజన్మమును గడపి తుదకు వల్మీకమునికి తనయుడై పుట్టెను. వల్మీక వృత్తాంత మేమనగా వినుము. పూర్వము కృష్ణుడు అను పేర ఒక ముని గలడు. అతడు యింద్రియముల నరికట్టి సరస్సున బహుకాలము మిక్కిలి తపస్సుచేసెను. అప్పుడు చలనములేక అతడట్లే యుండగా అతని శరీరమునకు చుట్టును పుట్టలు పట్టుటచే వల్మీకముని యని పిలువబడెను.

కొంతకాలమునకు తపస్సు ఫలింపగా వల్మీకముని తపము చాలించెను. వల్మీకముని ప్రపంచవాంఛల దనిలి యింద్రియములు చలింపగా స్త్రీలోలుడై ఒకనాట్యకాంతను ప్రేమించెను. వల్మీకుడు నాట్యాంగనతో రమించగా కిరాతుడు జన్మించెను. అతడు వాల్మీకి యను పేర ముల్లోకములందు కీర్తిగాంచెను. సమస్త కర్మబంధములను నాశనమొనరించు యుత్తమమైన శ్రీరాముని సచ్చరిత్రమును తన కవితాశక్తిచే శ్రీమద్రామాయణమను మహాకావ్యముగా వ్రాసి లోకప్రసిద్ధిగాంచిన మహానుభావు డీవాల్మీకి మునియే.

శ్రుతదేవుడు పల్కుచున్నాడు. మహారాజా! వైశాఖమాస వ్రతధర్మఫలమెంతగలదో కంటివా! క్రూరుడైన కిరాతుడు గూడ దొంగిలించిన పాదుకలను ఎండవేళయందు ధరింపలేని విప్రోత్తమునకు తిరిగి యిచ్చినందున ముల్లోకములందును [illegible]

యుత్కృష్ట జన్మమును పొందెను. కాన వైశాఖ ధర్మములు అత్యు త్తమములై నవనియు సమస్త సంపదల నిచ్చునవియు, నని యెఱుంగ వలెను. పాపనివారణంబును, ఆనందప్రదమును, అత్యుత్తమమును అగు యీ కథ వినినవారలు యితరులకు వినిపించినవారలు తిరిగి మానవలోకమున పుట్టనేరరు.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున ఇరువది యొకటవ అధ్యాయము

## ఇరువది రెండవ అధ్యాయము

మిథిలాధినాథుండగు హేమాంగుడు పల్కుచున్నాడు. ముని చంద్రమా! వైశాఖమాసమునందు ఉత్తమమైన తిథులేవి? దానము లందు ఉత్కృష్టమైన దానము లేవి? యీ మాసధర్మములు ఎవరివలన యీలోకమునందు కీర్తింపబడినవి? యీ విషయము లన్నియు విస్తరించి నాకుజెప్పుము. అని పలికిన హేమాంగునకు శ్రుతదేవుడు చెప్పనారంభించెను. మహారాజా! సూర్యుడు మేషరాశియందుండగా వైశాఖమాసము ముప్పది తిథులను పుణ్యప్రదములే యగుచున్నవి. వానిలో నేకాదశితిథి పరమోత్కృష్టమైనది. ఆదినమున చేయు కర్మలవలన గలిగిన ఫలితము కోటిగుణితమగును. వైశాఖమాసమున ఏకాదశి తిథియందు సూర్యోదయకాలమున స్నానమాచరించిన వారికి సర్వదానములను చేసినందువలన కలుగు ఫలితమును, సమస్త పుణ్యతీర్థములను సేవించినందువలన కలుగు ఫలము చేకూరును ఆ దినమున స్నానము గావించుట, దానముచేయుట, తప

ఆచరింపుట, హోమము చేయుట, దేవతా పూజలను చేయుట, లోనగు మంచిపనులను చేయుట, నారాయణుని కథలను వినుట జరిపినవారికి ముక్తి కరతలామలకము. రోగపీడితుడును, దరిద్రుడును విష్ణుకథలను వినినయెడల సార్థకజన్ముడగును. స్నానము చేయుటకు చెరువులుండగా, తన శరీరము ఆరోగ్యముగానుండగా స్నానమాడక, ధర్మమాచరింపక, శుభప్రదమగు వైశాఖమాసమును వ్యర్థముగా గడపు మానవుడుగా హత్యచేసినట్లు, కృతఘ్నతనుగాంచినట్లు తండ్రిని జంపినట్లు ఆత్మహత్య చేసికొనినట్లు తలంచబడును దేహము నందు స్థిరత్వము లేనప్పుడు పుణ్యవంతమైన వైశాఖమాసమును గురించి మనస్సున తలంపవలయును. సజ్జనులు సమస్తప్రాణుల యందును కరుణవహింతురు. ఉత్తములగు వైశాఖమాసధర్మములను పాటింతురు. మహారాజా! దరిద్రులు, ధనవంతులు, కుంటివారు, గ్రుడ్డివారు, నపుంసకులు, భర్తలేనివారు, భర్తగలవారు, పురుషులు, బాలురు యౌవనవంతులు, వృద్ధులు, రోగులు లోనగువారికందరికిని వైశాఖధర్మములాచరణీయములైయున్నవి. ధర్మములకు కారణభూతమైన శుభప్రదమైన వైశాఖమాసమునందు ధర్మమాచరింపవలెనని ప్రయత్నము చేయువానికంటె మేలును పొందువాడెవడును లేడు. ఇట్టి సులభమగు వైశాఖధర్మములను యే నరుడు చేయకుండునో అట్టివాడు నరకలోకమును సులభముగానే పొందును. పెరుగును తరచి వెన్నను దీసినట్లు వైశాఖమాసవిధులం దుత్తమ తిథిని జెప్పెదను వినుము.

సూర్యుడు మేషరాశియందుండగా పుణ్యవంతమగు చైత్రమాసమున పితృదేవతలకు ప్రీతిని కలిగించు తిథిపాదములను బోగొట్టును. గయలో పిండప్రదానము గావించినపుణ్యము చేకూర్చును. సావర్ణికమనువు పూర్వకాలమున రాజ్యమును పాలించునప్పుడు ఎవా

విషయమై నరకలోకమున ప్రసంగించబడిన పితృదేవతాసంబంధ మైనదియు పుణ్యాకరమైనదియు నగు పురాతనగాథ యొకటి కలదు వినుము. ఇప్పుడి కలియుగములు గడచుటకు పూర్వము సమస్త ధర్మములు నశించినకాలమందు ఆవర్తదేశమున ధర్మవర్ణుడను విప్రుడు కలడు. అతడు కలియుగమందు ప్రథమపాదమున సర్వ ధర్మములను విడిచి జనులందరు పాపములను చేయుచుండుట చూచి పుష్కరతీర్థమందు మునులు మౌనముతో సత్రయాగమును చేయు చుండగా నచటికేగెను. అచ్చట మునులందరును శాస్త్రచర్చలను గావింపుచు పుణ్యకథలను చెప్పుకొనుచుండిరి. కర్మలయందు శ్రద్ధ గలవారై కలియుగము పరమోత్తమమైనదని స్తుతింపుచుండిరి. కలియుగమందు సర్వధర్మములును నశించును. అయినను కలియుగమే పరమోత్తమమైనది.

కృతయుగమునందు సంవత్సరకాలమందు చేసినపుణ్యము విష్ణుప్రీతికరమై త్రేతాయుగమున ఒకమాసమునందు లభించును. ఆ పుణ్యమే ద్వాపరయుగమందు పక్షముదినములందు కలుగును. కలి యుగమందొకమారు శ్రీహరిని ధ్యానించిన పుణ్యము పదిరెట్లు కలుగును. అట్టిపుణ్య మెంత కొంచెమైనను కోటిగుణితమగును. దయ, దానము, ధర్మము, పుణ్యము లోనగునవి నశించిన యీ కలియుగమందు ఏ మానవుడు ధర్మమాచరింపక యున్నను విష్ణు స్మరణమాత్రము గావించునో అతడు కరువుకాలమందు అన్నా తురునకు అన్నమిడిన వానివలె పరమోత్తమలోకమును పొందును. కలియుగము పరమోత్కృష్టమైనదని మునులు పొగడుదురు. ఆ సమయమున బ్రహ్మమానసపుత్రుండగు నారదమౌని యచటకేతెంచి యొకచేత శిశ్నమును మఱియొకచేత నాలుకను పట్టుకొని పిచ్చివాని వలె నాట్యముజేయుచుండెను. సభికులు చూచి నారదమౌనీంద్రా!

మీ యీ పిచ్చినాట్యమని యడిగిరి. బహుబుద్ధిశాలియగు నారదుడు నవ్వుచు నాట్యమును గావించుచు సభాసదులను గూర్చి యిట్లు పలికెను. నాట్యమును జేయించునదియు మీచే పలుకబడినదియు నగు విషయము సంతోషకరమై పుణ్యప్రదమై మాకు ఫలసిద్ధిని కలిగించినది. కలియుగము పుణ్యవంతమైనది. కొంచెముపుణ్య మాచరించినను ఎక్కువ ఫలితము నిచ్చును పాపనాశనమును జేయు పరమపావనుం డగు శ్రీహరినామ మొకసారి తలచిన మాత్రాన గొప్ప సంతసమును పొందుట నిజము.

పుత్రులతో సమానులగు మునులారా! మీకొక విషయమును చెప్పెదను. నేను నాలుకను, శిశ్నమును రెండుచేతులను బట్టుకొనుటకు కారణమున్నది. చెప్పెదను వినుము. యీ కలియుగమున శిశ్నమును, నాలుకను నిగ్రహించుట బహుకష్టము గాన నేను వానిని పట్టుకొని నాట్యమాడుచుంటిని. కలియుగమున యీ రెండును నిగ్రహించినవారు శ్రీహరి యనుగ్రహమునకు పాత్రులగుదురు. గాన మీరీస్థలమున నుండజనదు. ఈ కలియుగమున వేదబాహ్యమైన యీ భరతఖండమును వదలి యేదో యొక ప్రదేశమున నెక్కడైనను మీ కిష్టమైన ప్రదేశమునకు వెళ్ళి అక్కడ మీ యిష్టానుసారము సంచరింపుడు. ఇట్లు నారదముని చెప్పిన విషయమును విని నిష్ఠతో కూడిన వ్రతముగలవారై ఆమునీశ్వరులు తాముచేయుచున్న సత్రయాగమును పూర్తిచేసి తమ కిష్టమగు ప్రదేశములకు వెంటనే వెడలిరి.

ధర్మవర్మ డానారదమహర్షి చెప్పినవిషయమును విని వింతజెంది భూమిని సంచరించుటకు యిష్టముగలవాడై మంచి వ్రతమును బూని యింద్రియములను జయించి దండకమండలువులను ధరించి, జటా వల్కలములను బూని, కలియుగమందు మానవు లాచార హీనులై

యేగతి నడచుదురో చూతమని యుత్సాహముతో సజల భూలోక మునకు వెళ్ళెను. భూలోకమున పాపాచారములయం దాసక్తిగల వారును, దుర్మార్గులును, క్రూరులును, పాపులును అగు మానవులను చూచెను. విప్రులు పాషండులై వేదబాహ్యులైరి. శూద్రులు సన్న్యాసమును స్వీకరించుచుండిరి. సేవకులు తన యజమానుని చంపువారైరి. కుమారులు తండ్రిని చంపువారైరి. విప్రులు శూద్రులతో సమానులైరి. ఆవులు మేకలతో సమానులైనవి నాల్గువేదములు కథలతో సరియైనవి. యాగాది క్రతువులు సామాన్యమగు వ్రతములతో సమానమైనవి. భార్య భర్తను నిందించును. శిష్యుడు గురువును నిందించును. భూతప్రేత పిశాచములు లోనగు క్షుద్ర దేవతలు తమ ప్రతిభచే యచ్చట సంచరింపుచుండును. పాపాసక్తులగు మూఢులు నీచదేవతలనే శ్రద్ధతో పూజింతురు. మానవులందరును భోగములందే బుద్ధికలిగియుందురు. అందులకు తమ ప్రాణములను కూడ త్యజింప సిద్ధపడుదురు. కూటసాక్ష్యములను పల్కుదురు. కపటబుద్ధి గలవారై యుందురు.

కలియుగమున మానవులకు మనస్సున నొకటియు, వాక్కున నొకటియు, కర్మలయం దొకటియు నిట్లు త్రివిధములుగా యాలోచనలుండును. అందఱకును విద్యధనార్జనమున కేగాని పరమార్థచింతన యుండనేరదు. అట్టి విద్యయే రాజసభలందు రాణించును. సంగీతము, నృత్యము లోనగు విద్యలు రాజులకు పరమానందదాయకములై యుండును. నీచులు గౌరవింపబడుదురు. ఉత్తములు హీనులుగా పరిగణింపబడుదు. కలియుగమున శ్రోత్రియులైన బ్రాహ్మణులు పరమదరిద్రులై యుందురు. మానవులు శ్రీహరియందు భక్తిలేక మెలంగుదురు. పుణ్యక్షేత్రములన్నియు పాషండములై యుండును. కలియుగమున శూద్రులు పరమధర్మముల నెరింగినవారై జటలను

ధరించి తపోనిరతులై యుందురు. మానవులందరును స్వల్పాయుర్దాయ వంతులై, దయాహీనులై, పరమమూర్ఖులై అందరును ధర్మప్రశ్న ములనే పలుకుచు, వినుచు వేదాంతులై మెలగుచుందురు. కొందరు మానవులు తమనే పూజించుట కొరకు కాంక్షించుచుందురు. కొందరు అకారణముగా యితరులను దూషింపుచుందురు. కొందరు యితర ఔన్నత్యమును చూచి సహింపలేక ద్వేషబుద్ధితో సంచ రింపుచుందురు.

కలియుగమున సోదరుడు తోబుట్టువులతో సంభోగించును. తండ్రి కుమార్తెతో సంభోగించును. మానవులందరును శూద్రవనిత లను వేశ్యకాంతలను సంభోగమునకు కోరుచుందురు. సజ్జనులను గౌరవించు మానవమాత్రులు కలియుగమున వుండరు. పాపాత్ము లకు అధికగౌరవము చూపుదురు. సత్పురుషులదోషములు లేశ మాత్రమైనను దుష్టులు ప్రకటింతురు. పాపాత్ముల దోషములు సద్గుణములుగానే పరిగణింతురు. కాన కలియుగమున దుర్మార్గులు దోషమునే గ్రహింతురు జలగ,వనితయొక్క చన్నులను బట్టి పాలను గ్రహింపక రక్తమును పీల్చినట్లు దుర్మార్గులు సజ్జనుల గుణగణముల నుండి దోషములనే గ్రహింత్తురు. ఓషధులు తమ సహజశక్తిని వీడి సారములేనివై యుండును., ఋతువులు తమ ఋతుధర్మములను ఋతుకాలములను అతిక్రమించి సక్రమముగా నుండనేరవు. భరత ఖండమున చాలా దేశములందు దుర్భిక్షము సంభవించును. స్త్రీలు యుక్తవయస్సు రాకుండగనే ప్రసవింతురు. కలియుగమున నాట్యము నందును, కళలయందును మానవులకు ఆసక్తి హెచ్చుగనుండును. విత్తవంతులై యజ్ఞానులుగా నుండువారు వేదములయందును, శాస్త్ర సారమగు వేదాంతమునందును అసక్తికలిగిన మానవులను సేవకుల రీతిగా తలంపుచుందురు. విప్రుల యాశీర్వాదవచనములకు బలముకాని,

ఫలముగాని యుండనేరవు. మానవులందరును పితృశ్రాద్ధాదికర్మలను త్యజింతురు. వేదములందు తెలుపబడిన యజ్ఞయాగాది క్రతువులను విడిచియుందురు. ఎన్నడును నాలుకచే నారాయణుని నామస్మరణము గావింపనొల్లరు.

శృంగారమునందే ఆసక్తికలవారై శృంగారప్రబంధములనే చదువుచు మానవులు భోగలాలసులై యుందురు. మానవులు కలియుగమున శ్రీహరిని సేవింపవలెనని గాని శాస్త్రములను చదువవలెననిగాని యజ్ఞయాగాది క్రతువులను చేయవలెననిగాని వేదాంతతత్వవిచారణను సలుపవలెననిగాని తీర్థయాత్రాటనచేసి దానధర్మాదుల నాచరించి తత్ఫలితమును పొందవలెననిగాని మనస్సున బుద్ధి గలిగియుండరు. ఈ రీతిగా సర్వపాపభూయిష్ఠమైయున్న మనుజులను కలియుగమందు చూచి ధర్మవర్ణుడు భయముగలవాడై పరమాశ్చర్యముతో పాపమువలన వంశనాశన మగుచున్నదని గ్రహించి అచ్చటనుండి బయలుదేరి మరియొక ద్వీపమునకు జనెను. జ్ఞానశేఖరుడగు ధర్మవర్ణుడు పరమాసక్తితో సమస్తద్వీపములను సర్వలోకములను అనేకప్రదేశములను సంచారమొనరించి ఒకానొక సమయమున పితృలోకమును చేరెను.

పితృలోకమున భయంకరాకారులును చేసినకర్మల ననుసరించి యమభటులు పెట్టుచున్న బాధలను సహింపజాలక యేడ్చుచు నరకకూపమునబడి క్రమ్మచున్న జీవుల ననేకులను జూచెను. ఆ నరకలోకమున గొప్పదైన చీకటితో నిండియున్న కూపమునబడి దారిగానక గరికిపోచనుబట్టి ప్రాకులాడువారును యాధారము లేకయున్న యిందు పడిపోదుమే యను శంకాసంకులితులై నరకపంకమునబడి పొర్లాడుచున్న దీనులగు తన పితృదేవతలను ధర్మవర్ణుడు చూచెను. ధర్మవర్ణుని పితృదేవతలు తామువట్టి గరికయొక్క భాగము

నలుకచేతిన బడగా మూడు భాగములు నశింపగా చివరి భాగమును యాశ్రయించి కూపమునం బడిపోదుమే యని విచారపడుచు గాఢాంధకారమై ఒడ్డు విరిగిపడినందువలన భయంకరమై బయటకు వచ్చుటకు దారి గానక విచారపడుచు పాప కర్మముచే యిట్టి బాధ లనుభవించుచుంటిమని యేడ్చుచు ఆధారము లేని నరకకూపమునుండి ఏవిధముగా రాగలుగుదుమని యోచన చేయుచు పడియున్న పితృదేవతలను చూచి వింతపడి, కరుణగలిగి వారితో నిట్లు సంభాషించెను.

జీవులారా! మీరెవరు? ఏమి పాపముచేసితిరి? ఈ నరక కూపమున యేలపడియుంటిరి? మీరేవంశమున బుట్టినవారు? మీకు మోక్ష మెట్లు కలుగును. ఈ వివరములన్నియు విస్తరించి నాతో బలికినయెడ మీకు మేలుచేకూరగలదు. అని పలికిన ధర్మవర్ణుని మాటలకు పితృదేవతలు కడుంగడు దుఃఖమునుబొంది ధర్మబాహ్యము కాని శృతులకు వ్యతిరేకముగాని వాక్యములను దీనముగ చెప్పిరి. ధర్మవర్ణా! మేము శ్రీవత్స గోత్రమున బుట్టినవారము. భూలోకమున మావంశమునందు సంతతి లేదు. గాన కలియుగమున శ్రాద్ధాదులు జరుగుట లేదు. మాకు పిండములు లభించుట లేదు. గాన పాపకర్ము లమై యీ నరకకూపమున బడి మ్రగ్గుచుంటిమి. కలియుగ మిట్టి పాపభూయిష్టమగుటచే మావంశము సంతానహీనమై పరిధవిల్లినది. మా వంశము నశించినందువలన మాకు పితృశ్రాద్ధాదికర్మలు లేక పిండము లంతరించినవి. గాన ఆధారములేక యిట్టి నరకకూపమున బడి యుంటిమి. మా వంశమున పరమధార్మికుడైన ప్రఖ్యాతిగల ధర్మవర్ణుడను మహాత్ము డొకడు గలడు. అతడు సంసారమునం దిచ్ఛలేక విరాగియై గృహస్థాశ్రమమును స్వీకరింపక దేశాటనమును చేయుచున్నాడు. ధర్మవర్ణుడను పురుషు డొకడున్నాడను మాత్రము

చేతనే యీ గరికపోచయొక్క స్వల్పాధారమును బట్టి యీ నరక కూపమున యుండగలిగితిమి. ఆయనకు పిమ్మట సంతాన శూన్యమై నందున మాకు యాధారముగానున్న గరికపోచను సదా యెలుక తినుచున్నందున మావంశము నశింపగలదు.

మహానుభావా! మావంశమునందు ధర్మవర్ణు డొక్కడే యున్నందున యాధారభూతమైన గరిక కొంచెము పట్టుతోనున్నది. ధర్మవర్ణుని జీవిత మంతమొందిన పిదప శేషించియున్న మొదలును కూడా యెలుక భక్షింపగలదు. అంతట గాఢాంధకార పరివృతమైన బహిర్గతమగుటకు వీలుగాని నరకకూపమున బడిపోదుము. గాన నీవు మానవలోకమునకు దయయుంచి వెళ్ళి గార్హాస్థ్యము దిచ్ఛలేని వాడును మునిశ్రేష్ఠుడగు ధర్మవర్ణునితో నిట్లు పలుకుము. నీ పితృ దేవతలు బహిర్గతమగుటకు వీలుగాని నిబిడాంధకార పరివృతమైన నరకకూపమునంబడి బలహీనమగు గరికపోచ నాధారముగా చేసి కొని వ్రేలాడుచుండగా నేను చూచితిని. మునిచంద్రమా! గరిక యనగా సదా ఛిన్నముగాని వంశస్వరూపము. ఎలుక యనగా కాలస్వరూపము. వంశస్వరూపమగు సూత్రమును వంశము రహిత మైన కొలది సదాకాలమును యెలుక హరింపుచుండును. కాలక్రమ మున వంశమంతయు నశించినది. నీ వొక్కడవే మిగిలియుంటివి. గాన గరికయొక్క 3 భాగములు నశించి యొక భాగము నిలిచి యున్నది. నీవు యీ మానవలోకమున జీవించియున్నందున మేము నిలచితిమి. ఆస్వల్పభాగమైన గరిక కూడ నీ ఆయుర్దాయము క్షీణిం చిన కొలది ఎలుక తినివేయుచున్నది. నీవు చనిపోయిన పిమ్మట సంతానక్షీణతచేత ఆధారశూన్యమై గాఢాంధకారమగు నరకకూప మున నీవును, నేనును గూడ నరకకూపమున బడియుండగలము.

ఏమానవుడు రమాధవుని, పితృదేవతలను, దేవతలను, మునీశ్వరులను పూజింపకయుండునో అతడు భూలోకమున భారమును

కల్గించుటకును, ఆహారమును భుజించుటకును, ఉపయోగపడు చున్నాడు. పితృదేవతలారా! మీ యానతి శిరసావహింతును, ఆజ్ఞాపింపుడు కాని భూలోకమునకు పోయి పెండ్లి యాడి సంసారము నందు సంచరింపుచున్నను కలియుగమందలి కలిపురుషుని బాధ నాకు కలుగకుండునట్లు మీరు నన్ను కటాక్షింపవలయును. మీకు కుమారు డగు నన్ను భూలోకమున మిమ్ము తలంచి చేయవలగు కర్మలనన్నిటిని గావించెదను. అని శ్రీవత్సవంశమందు పుట్టినవాడును, మహావివేక వంతుడును అగు, ధర్మవంతుడు పితృదేవతలతో పల్కెను. మిథిలాధి నాథా! మహారాజా! పిమ్మట ఆపితృదేవతలు కొంచెము నిదానించి యీరీతిగా పల్కుచున్నారు. కుమారా! మహాభాగులైన నీ పితృ దేవతల స్థితిని చూచితివా! గరిక నాధారము చేసికొని వంశము నశింపగా నరకకూపమున బడుటకు సిద్ధముగా నున్న మమ్ములను నీవు భూలోకమున కేగి పెండ్లియాడి సంతానమును బడసి యీ నరక కూపమునుండి మమ్ములను బహిర్గతులుగా జేయుము, కలియుగమున మానవులు శ్రీహరి కథలయందు చిత్తమును ఆయత్తపరచి రక్తులై యుందురో, ఆచారవంతులై, సదా శ్రీమహావిష్ణునే ధ్యానము చేయు చుందురో, అట్టివారికి కలిపురుషుని బాధ కలుగనేరదు. ఏగృహము నందు సాలగ్రామము సదా పూజింపబడునో, ఏగృహమునందు భారతము, అను పంచమవేదము పఠనగుచుండునో ఆ గృహమందలి వారిని కలిపురుషుడు బాధింపనేరదు. వైశాఖమాసమున చేయదగు ధర్మములయం దాసక్తిగలవారిని, మాఘమాసమున చేయదగు స్నానములం దాసక్తులగు వారిని, కార్తీకమాసమున శ్రీహరిని సన్నిధిని దీపముంచు వారిని కలిపురుషుడు బాధింపనేరడు. ఇంటియందు వైశ్వదేవమును చేయువారిని ఇంటిలో తులసిచెట్టు గలవారిని, గృహప్రాంగణమందు గోవును గలవారిని, కలిపురుషుడు బాధింప

నేరదు. అందువలన కలియుగమందు భూలోకము పాపభూయిష్ఠమై పరిఢవిల్లినను, నీవు యీ కేశాటనము చేయజనదు. వెంటనే నీవు భూలోకమునకు వెడలవలయును. వైశాఖమాసము వచ్చినది. భాస్కరుడు మేషరాశియందు యీ వైశాఖమాసమున ముప్పది దినములును ప్రవర్తించియుండగా నీవు భూలోకమున సమస్త ప్రజలకును ఉపకారములు చేయదలచియున్నావు. వైశాఖమాసమున దివాకరుడు మేషరాశియందున్న దివసములలో ఒకదినమున స్నానము చేసిన పుణ్యము కోటిగుణితమగుచున్నది. అందును చైత్రమాసమందు బహుళ అమావాస్య దినమందు మానవుడుచేయు ధర్మకర్మములకు శ్రీహరి ముక్తి నొసంగగలడు. పితృదేవతలకు అమావాస్యతిథి పరమ ప్రీతికరమైనది. గాన ఆతిథియందు మానవులుచేయు శ్రాద్ధకర్మలకు ఫలితము అధికము గాగలదు. కుమారా! చైత్రబహుళ అమావాస్య దినమున పితృదేవతల నుద్దేశించి, శ్రాద్ధము ననుసరించి, జలసహితముగు జలకుంభమును దానమిచ్చి కర్మల నాచరించువారు నాశనరహితమైన శాశ్వత లోకమును పొందగలరు. అమావాస్యదినమున గయాక్షేత్రమున గావించిన శ్రాద్ధమునకు కోటి రెట్లు ఫలితము గలదు. ఆతిథియందు శ్రాద్ధము నాచరింప శక్తి లేనివారు ఏదో యొక కూరతో శ్రాద్ధకర్మను గయాక్షేత్రమున గావించిన కోటి ఫలితమగుచున్నది.

అందువలన నీవు భూలోకమునకేగి గార్హస్థ్యమును పొంది సంతానమును ప్రభవించితివేని ఉభయతారకమైన పుణ్యలోకప్రాప్తి కలుగగలదు. బహుపుత్రకుడవైతివేని వారిలో నొకడైనను కాశీ, గయ, ప్రయాగాది పుణ్యక్షేత్రములను సేవించి అశ్వమేధాదిక్రతువులను జేసి కపిలవృషభమును ఉత్సర్జనముచేసి పుణ్యలోకప్రాప్తిని మనకు చేకూర్పగలడు. వంశమందొకపుత్రుడైనను వైశాఖమాస

మునగాని, మాఘమాసమునగాని, కార్తీకమాసమునగాని పితృదేవతల నుద్దేశించి ధర్మమునుగాని, దానమునుగాని, కర్మనుగాని, శ్రాద్ధమునుగాని చేయగలడు. అట్లు శుభప్రదమగు కర్మలను చేయుట వలన నరకలోకమునుండి బయలుదేరి పుణ్యలోకమును చేరగల్గుదుము. వారిలో ఒక్కడైనను హరిభక్తిపరాయణుడు కాగలడు. ఒక్కడైనను ఏకాదశీదివసంబున ఉపవసించు పుణ్యాత్ముడు కాగలడు. వారిలో ఒకడైనను పాపనాశనకరమైన పరమాత్ముని పుణ్యకథలను విని గతించిన నూరు తరములను రాబోవు నూరుతరముల వంశీకులను తరింపజేయగలడు. మానవుడు తాను చెడునడతగలవాడైనను కుమారుడు శ్రీహరిభక్తుడగునెడల అట్టివాడు నరకమును బొందనేరడు. మానవునకు అనేకమంది కుమారులు కలిగినను సర్వవ్యాపియైన సర్వేశ్వరుని పూజింపనేరనివారైనచో దయాధర్మశూన్యులగు వారివలన ప్రయోజనములేదు. వంశమున పుత్రుడులేనిచో గతిలేదని శ్రుతి పల్కుచున్నది. కాని గుణవంతుడగు తనయుడే కలుగవలెను. ఇది సర్వవిదితమే. దయ, దానము, ధర్మము, లోనగు సద్గుణములు గల సంతానము సంభవించుట బహుకష్టము. ఈ రీతిగా మేము చెప్పిన వాస్తవమైనవిషయములను ధర్మకర్మునకు బోధించి అతడు పెండ్లియాడి సంసారసుఖమును నిర్వహింపునట్లు యాగాదిక్రతువులను చేయుటయందు ఆసక్తిని కలిగింపుము.

పితృదేవతలవాక్యములను ధర్మవర్ణుడు విస్మయముతో విని వినతుడై వారికి నమస్కరించి అంజలిపట్టి శరీరము కంపమొంద రోదనధ్వనితో యిట్లుపల్కెను. పితృదేవతలారా! మీయుత్తమ వంశమున బుట్టి నిరుపయోగమైన దురాగ్రహమును బూని గార్హస్థ్య విధిని మాని సంచరింపుచున్న ధర్మవర్ణుడను నేనే. కలియుగమున జిహ్వేంద్రియమును, శిశ్నేంద్రియమును నిగ్రహింపలేరని మునివర్ణ

భులచేత నిర్వహింపబడుచున్న సత్రయాగమున నారదమహాముని చేత వఖ్యాణింపబడగా విని భూలోకమున పాపాత్ములగు మానవు లను జూచి సందేహించి దుర్జనసహవాసమువలన భీతిజెంది యీ రీతిగా ద్వీపములన్నియు సంచరింపుచుంటిని. పితృదేవతలారా! కలియుగమున మూడుపాదములు గడచి ఒక్కపాదము మిగిలినది, ఆ పాదమునందును మూడుభాగములకుపైగా సగము గడచినది. మీరు యీ రీతిగా విచారింపుచుండుట నేనెఱుగను. నా జీవిత మంతయు నిరుపయోగముగా గడచినది. నీవంశమందు పుట్టినను పితృదేవతలకు మీయొక్క ఋణమును తీర్చుకొనలేక పోతిని.

చైత్రబహుళ అమావాస్యాదినమున కర్పూరాగరుగంధాది పరిమళద్రవ్యములచే మిశ్రితములై పానకముతో నిండియున్న కలశ మును దానము చేయనివాడు పితృహత్యను చేసిన వానితో సమాను డగును. చైత్రబహుళ అమావాస్యా దినమందు శీతలోదకముతో నిండినపాత్రను దానమిచ్చుటవలన భక్తికలవాడై పితృదేవతలన్ను తరింపజేయు శక్తికలవాడైనందువలన పితృలోకమున పితృదేవతలపై అమృతము వర్షించునట్లు చేయగలడు. చైత్రబహుళ అమావాస్యా తిథియందు నీటితోకూడిన కుంభదానమును చేయుటవలనను పితృ శ్రాద్ధముచేయుటవలనను పితృదేవతలకు అన్నము, పప్పు, నెయ్యి, అపూపములు, పాయసము, లేహ్యములు మొదలగు పదార్థములు పితృదేవతలకు సమృద్ధిగా కలుగును. జ్ఞానశేఖరా! ధర్మవర్ణా! వైశాఖమాసము మిక్కిలి ఫలితముగలది. గాన నీవు భూలోకమున కేగి పితృశ్రాద్ధము నాచరించి ఉదకుంభదాన మొసంగి పిండప్రదానము చేయుము. ఆలశించితివేని మాకు సద్గతికలుగుటకు మార్గములేదు. మా అందరియొక్క మేలుకొరకు నీవు పెండ్లియాడి ఉత్తమసంతాన మును పొంది ధర్మార్థకామముల నాచరింపుము. పిమ్మట మరల మునివృత్తిని బూని యీ ద్వీపములందు నీవు సంచరింపవచ్చును.

అని యీ రీతిగా పితృదేవతలు ధర్మవర్ణునకు ఆజ్ఞాపింపగా మునివల్లభుడు వెంటనే భూలోకమునకు వెడలెను. మేషరాశియందు భాస్కరుడు భాసమానుడై ప్రవేశింపగా చైత్రమాసమున సూర్యోదయకాలమున స్నానముగావించి పితృదేవతలను దేవతలను, మునీశ్వరులను, బ్రహ్మయజ్ఞ పితృతర్పణాది కర్మలచే సంతృప్తిపరచి పాపనాశనకరమైన, జలసహితమైన కలశమును దానమిచ్చి అమావాస్య తిథియందు శ్రాద్ధకర్మ నాచరించి పితృదేవతలకు పునర్జన్మలేని శాశ్వతపుణ్యలోక మొసంగి తాను పెండ్లియాడి యోగ్యమైన సంతానమును పొంది పాపనాశనకరమైన చైత్రబహుళ అమావాస్యా తిథియొక్క ప్రాముఖ్యతను భూలోకమున విస్తరింపజేసి పరమ సంతుష్ట మనస్కుడై భక్తితోకూడినవాడై మరల తపస్సు చేయుటకై గంధమాదన పర్వతమునకు వెళ్ళెను. అందువలన చైత్ర బహుళ అమావాస్య తిథిబహుపుణ్యకరమైనదని శుభప్రదమైనదని అసమానమైనదని లోకమునందు వన్నెకెక్కినది.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమందు
నారదాంబరీష సంవాదమున ఇరువదిరెండవఅధ్యాయము

## ఇరువది మూడవ అధ్యాయము

శ్రుతదేవుడు పల్కుచున్నాడు, మహాదేవా! వైశాఖమాస ధర్మములు పరమోత్కృష్టమైనవి. గాన పాపహరమైన వైశాఖ మాస మాహాత్మ్యమును చెప్పుచున్నాను వినుము.

వైశాఖశుద్ధ తదియ అక్షయ తదియ, అని చెప్పబడును. ఆదినమున సూర్యోదయకాలమున స్నానమాచరించు మానవులు

పాపరహితులై మాధవుని ఉత్తమస్థానమగు వైకుంఠ సదనమును చేరుచున్నారు. దేవతలు, మునులు, పితృదేవతలను గుఱించి తర్పణము చేయువారు గొప్పచదువుగలవారుగాను, యజ్ఞయాగాది క్రతువులను చేసినవారుగాను, అనేక శ్రాద్ధాది పితృకర్మలు చేసినవారుగాను పరిగణింపబడుదురు. అక్షయ తదియయందు శ్రీహరిని పూజించి భగవంతుని సత్కథను వినినవారు ముక్తినిగాంతురు అక్షయ తదియయందు ముకుందుని యానందమునకు శుభకరమగు దానమును చేసినవారు శ్రీహరి యనుగ్రహముచే నాశరహితమైన ఫలమును బొందుదురు. అక్షయతదియ దేవతలకు, మునులకు, పితృదేవతలకు తృప్తిని కలుగజేసిన వారగుదురు. రాజచంద్రమా! అక్షయ తదియకు ప్రసిద్ధి కలిగిన వివరము చెప్పెదను. సావధానమగు మనస్సుతో వినుము.

పూర్వమందు దేవేంద్రునకు బలిచక్రవర్తికి యుద్ధము మైనది. అప్పుడు దేవతలు రాక్షసులు ద్వంద్వయుద్ధము చేసిరి. అందు పాతాళలోకనివాసియైన బలిచక్రవర్తియను రాక్షసుని దేవేంద్రుడు జయించి భూలోకమును చూడవలెనను కోరికతో, భూమికిదిగి, ఉతథ్యముని యాశ్రమమునకు చేరెను. అచ్చట సొమ్మది గల నడకగలదియు, గర్భముగలదియు కదలుచున్న పిరుదులు గలదియు, బంగారు ఒడ్డాణము గలదియు, అనేక అలంకారములతో నిండియున్నదియు, మత్తుపుప్పొడ ఝుంకారములను నిరసించు కంకణ నిస్వనములు గలదియు, అందమైన పలురంగుల వస్త్రమును ధరించునదియు, సుందరమైనదియు, మృదుభాషిణియు, తెల్లని చిరునవ్వుగలదియు అందమైన ఏనుగకుంభస్థలములనుబోలు కుచములతో శోభించునదియు, వికసించినపద్మమువంటి ముఖముగలదియు, ప్రకాశవంతమైనయు నల్లకలువలను బోలిన నేత్రయుగ్మముకలదియు,

మొగలిపూవుల యుదకముతో సమానముగానుండు తెల్లని చెక్కిళ్ళు గలదియు, అలసటచే నిట్టూర్పులు విడుచునదియు, చేపలవంటి కండ్లు గలదియు, మనస్సున కానందమును గూర్చునదియు, పర్ణశాల యొక్క యెదుట శయ్యయందు పరుండిన ఉతథ్యమునియొక్క భార్యనుగాంచి దేవేంద్రుడు మోహపరవశుడై బలవంతముగా నామెతో సంభోగించెను. ఆమె గర్భమందు గల పిండము దేవేంద్రుడు మైథునము చేయుటవలన, భంగము కలిగి పతనము కలుగునను సందేహముచే విచారించినవాడై తనపాదమును యోనిద్వారమందు అడ్డువైచెను. అట్లుచేయుటవలన దేవేంద్రుని వీర్యము ఆమె గర్భమునందు ప్రవేశింపక భూమియందు జారి పడిపోయెను. అందుచేత దేవేంద్రు డామె గర్భమునందు గల శిశువుపై కోపగించెను.

దేవేంద్రు డాశిశువుపై కోపమున కండ్లెఱ్ఱజేసి దురాత్మా! యోనిద్వారమున నీపాదమడ్డుపెట్టి నాకోరికకు భంగము కలిగించి నన్ను తిరస్కరించినందున నీవు పుట్టు గ్రుడ్డివై యుండుమని శపించెను. పాదమునుండి వీర్యము స్రవించెను. దానివలన దీర్ఘతపుడు కాంతివంతుడై పుట్టెను. దేవేంద్రుడు ఉతథ్యమునివచ్చి శపించునని భయముచే పరుగెత్తుచుండగా మునియొక్క శిష్యులు చూచి నవ్విరి. అందువలన దేవేంద్రుడు సిగ్గుపడి మేరుపర్వతకందరమున దాగియుండి కఠినమగు తపమును జేయసాగెను. దేవేంద్రు డిట్లు దాగియుండుట బలిచక్రవర్తి మొదలగు రాక్షసులు గూఢచారులవలన విని దేవతలను బాధించి, దేవేంద్రుని రాజ్యవైభవమును యితర దేవతల యైశ్వర్యమును, బలిచక్రవర్తియు, బలవంతులైన శంబరుడు మొదలగు రాక్షసులును హరించి యనుభవింపుచుండిరి.

దేవతారాజ్యము రాక్షసపాలిత మగుటచేత అగ్నిలోనగు దేవతలు తమ యధిపతియగు యింద్రునిజాడ దెలియనేరక దేవతలకు

గురువును కల్మషరహితుడు నగు బృహస్పతిని యడిగిరి. స్వామీ! దేవేంద్రునిజాడ మాకు తెలియకున్నది. మా ప్రభువైన యింద్రు డెచ్చటగలడు? దేవతల రాజ్యము రాక్షసులచే నాక్రమింపబడి యుండెను. దేవేంద్రుడు వెడలి చాలా కాలమైనది. ఎచ్చటకు వెడలెనో తెలియరాకున్నది. అతడెచ్చటనుండెనో చెప్పినయెడల మేమచటికిపోయి వానిని ప్రార్థించి రమ్మని తీసికొనివత్తుము అని దేవతలు చెప్పగా బృహస్పతి వారితో యిట్లు చెప్పెను. దేవేంద్రుడు పూర్వకాలమందు పాతాళలోకమున కేగి బలిచక్రవర్తిని జయించి భూలోకమునకు వచ్చి ఊతథ్యమునీశ్వరుని పర్ణశాలకు జని వాని భార్యతో బలాత్కారమున భోగించి మునిశిష్యులచే నవమానింపబడి సిగ్గుతో స్వర్గమునకు రాజాలక మేరుపర్వతకందరమున ప్రవేశించి భార్యతో గూడ నచ్చటనే యుండి తన దుష్కార్యమునకు విమోచన మెట్లని యాలోచించుచుండెను. యీ వాక్యమును అగ్నిలోనగు దేవతలు బృహస్పతివలన విని తమ అధిపతియగు యింద్రుని జూచి ప్రార్థించి రమ్మని పిలుచుటకై వెంటనే మేరుపర్వతకందరమునకు జనిరి.

మేరుపర్వతకందరమం దున్న దేవేంద్రుని జూచి దేవతలు, ప్రశస్తిగాంచిన యతని ప్రతాపమును దెలియజేయు స్తోత్రములచేత స్తుతించిరి ఇంద్రుడా! అందఱి దేవతలకు అధిపతివగు నీకు మా నమస్కారము. నీవు ప్రభుత్వము వదలినందున రాక్షసులచేత బాధింపబడి మిక్కిలి దుఃఖించుచున్నాము. శత్రునాశనకారుడ వగు దేవేంద్రా! మా స్థానములను వదలి దేశదేశములందు సంచరింపుచుంటిమి గాన నీవువచ్చి శత్రువులను సంహరింపుము. దేవతల చేత యీ రీతిగా నుతింపబడి దేవేంద్రు డామేరుపర్వతకందరమునుండి బయటకువచ్చి సిగ్గుతో తలను వంచుకొని నేలను జూచుచుండెను.

దేవేంద్రు డట్లు మాటాడక నిలచియుండి కొంతవడికి గద్గద స్వరముతో పలుక జొచ్చెను. దేవేంద్రుడు భీతుడగుట గని బృహస్పతి వానితో నిట్లనెను. దేవేంద్రుడా! నీవేమియు సందేహింప వలదు. జగమంతయు కర్మాధీనమైయున్నది. గౌరవము, అవమానము, సుఖదుఃఖములు, లాభనష్టములు, జయాపజయములు లోనగునవి పూర్వజన్మమందు చేయబడిన పుణ్యపాప కర్మలను బట్టి కలుగును. జీవుడు కర్మల ననుసరించి సుఖదుఃఖములను పొందుచున్నాడు. కాలానుసరణముగా భగవంతునిచేత నవి నిర్ణీతములగుచునే యుండును. ఇంద్రుడా! తమయొక్క ప్రారబ్ధవిశేషములనుబట్టి కలిగిన సుఖదుఃఖములకు బుద్ధిమంతులు విచారింపరు, సంతసింపరు. నీకు యీవిచారము నీయొక్క ప్రారబ్ధకర్మవలన కలిగినది. దేవేంద్రా! నీవు దుఃఖింప నవసరములేదు. అని దేవగురువగు బ్రహస్పతి పలుకగా దేవేంద్రుడు ధైర్యము వహించి దేవతలతో నీరీతిగా పలికెను.

పరస్త్రీలతో రమించుట వలన బలము, తేజము. కీర్తి, ప్రతిష్ఠ మంత్రశక్తి, ఆయుధశక్తి లోనగునవి సారహీనములై అసమర్థతను కలిగించును. దేవతలును, బృహస్పతియు దేవేంద్రుని మాటలు విని, అతనికి బలము సమర్థత కలుగుటకై రహస్య ప్రదేశమున మంతనముచేయగా విజ్ఞానులలో నుత్తముడగు బృహస్పతి కరుణాపూరితుడై వారితో నిట్లనెను. వైశాఖమాసము విష్ణుప్రీతికరము. ఆ మాసమందలి తిధులన్నియు విష్ణుప్రీతికరములగుటవలన పవిత్రములును, పుణ్యప్రదములునైయున్నవి. ఆ తిధులలో వైశాఖ శుద్ధ తదియ అక్షయతదియయందురు. ఆరోజున శ్రద్ధావంతుడై శుచియై స్నానమాడి దానధర్మములను చేసినవానియొక్క పాపరాసులన్నియు భస్మమగును. గొప్పదైన బలము, ధైర్యము, సంపదలను బొందుచున్నారు. గాన అక్షయ తదియ దినమున దేవేంద్రు

నకు శుభము చేకూర్పదలచి, బలిచక్రవర్తి విరోధియగు దేవేంద్రుని చేత మనమందఱము స్నానము, జపములోనగు సత్కర్మలను చేయింపవలెను. అట్లు గావించిన, విద్య, మంత్రము, శస్త్రము, బలము ధైర్యము కీర్తి లోనగు నవి తమంతట తామే సారవంతములై యుండును. అని బృహస్పతి, దేవతానీకముతో యాలోచించి విష్ణుప్రీతికరములైన ధర్మములను యింద్రునిచేత చేయించెను. అక్షయ తదియయందు భుక్తిని ముక్తిని కూడ యిచ్చునట్టి వైశాఖధర్మములను చేసి ఇంద్రుడు పూర్వమువలెనే బలధైర్యములు కలిగియుండెను.

పరస్త్రీ రతివలన సంభవించిన దోషము, అప్పుడే నశించెను. దోషముక్తుడగుటవలన దేవేంద్రుడు రాహుముక్తుడైన చంద్రునివలె ప్రకాశమానుడై, దేవతలనడుమ నుండు దేవదేవునివలె విరాజిల్లెను. పిమ్మట దేవేంద్రుడు దేవతలతో గూడుకొని, స్వర్గలోకమునకు వెడలి రాక్షసులను ఓడించి అక్షయతదియయొక్క ఆధిక్యతవలన మిగుల భాగ్యశాలియై శంఖము లోనగు వాద్య విశేషములతో అమరావతీ పురమును జేరెను. దేవేంద్రుని యానతి ననుసరించి దేవతలందరు వారి వారి గృహములకు జనిరి. పూర్వమువలెనే దేవతలు తమ హవిర్భాగములను స్వీకరింపుచుండిరి. పితృదేవతలు పూర్వమందువలెనే పిండములను పొందుచుండిరి. మునులు వేదాధ్యయనము గావింపుచు సంతసింపుచుండిరి. రాక్షసులు పరాజితులైరి. అప్పటినుండి మానవలోకమున అక్షయతదియ దేవతలకు పితృదేవతలకు మునులకు సంతుష్టిని కలిగించునదియై మూడులోకములందును గూడ కీర్తిగాంచినది. అందువలన అక్షయతదియ మానవులకు పుణ్యమునిచ్చును. సంపదకలుగ జేయును. సర్వవిధకర్మబంధములను సమయించును. భుక్తిముక్తుల నొసంగును.

ఇది స్కాందపురాణాంతర్గతమగు వైశాఖపురాణమున
నారదాంబరీష సంవాదమున ఇరువదిమూడవ అధ్యాయము

# ఇరువది నాల్గవ అధ్యాయము

శ్రుతదేవుడు చెప్పుచున్నాడు. మహారాజా! పుణ్యవంతమగు వైశాఖమాసమున ముప్పదిదినములందును శుద్ధద్వాదశీతిథి సమస్త పాపహారమని చెప్పబడినది. ఎవరు ద్వాదశీవ్రతమాచరింపరో వారు అనేకదానములు గావించినను తపములాచరించినను ఉపవాసము లొనరించినను వ్రతములు జేసినను యజ్ఞయాగాది క్రతువులు చేసినను తటాకాది జలనిలయముల నేర్పరచినను ప్రయోజనము కొంచెమైనను లేదు. గ్రహణములయందు గంగానదీతీరమున వేయి గోదానములను చేసినందువలన కలుగు ఫలితము రమాకాంతుని కిష్టమగు దినమందు సూర్యోదయకాలమున స్నానమాచరించినవారు పొందగలరు. శుభప్రదమైన వైశాఖశుద్ధ ద్వాదశియందు యోగ్యుడైన విప్రున కన్నదానము చేసినయెడల అట్టి యన్నదానమున గల మెతుకునకు కోటివిప్రుల కన్నమిడిన ఫలితము కలుగును. ద్వాదశీ దినమున నువ్వులు తేనెగల పాత్రను దానమునిచ్చువాడు సంసార బంధముల నుత్యజించి వైకుంఠమున వాసము చేయును. వైశాఖశుద్ధ ఏకాదశీదినమున రాత్రియంతయు హరినామకీర్తనము చేయుచు జాగరణము చేసినయెడల మానవుడు బ్రతికియుండగనే ముక్తిని బొందును. దేవతలు సంతోషింతురు. కోటిచంద్ర గ్రహణముల యందును సూర్యగ్రహణములయందును సర్వతీర్థములయందు స్నానమాడినందువలన కలుగు ఫలితము విష్ణుప్రీతికరమైన దివసమందు ప్రాతఃకాలమున స్నానముచేసినవారికి లభించును. ద్వాదశీతిథి యందు మృదువైన తులసిదళములచేత శ్రీహరిని పూజించువారు ఏడుతరములవరకు తన వంశమును తరింపజేయుటయేగాక విష్ణుసాయుజ్యమును పొందగలరు. వైశాఖశుద్ధద్వాదశియందు యమునిగుఱించి

పితృదేవతలనుగుఱించి గురువులనుగుఱించి దేవతలనుగుఱించి శ్రీహరిని గుఱించి దక్షిణతో కూడిన నీటిపాత్రను పెరుగుతో కలిపినయన్నమును దానము చేయువారికి ప్రయాగ తీర్థమందు సదా కోటిసూనవులకు వస్త్రసోపేతమైన భోజనము వత్సరపర్యంతము పెట్టినందువలన కలుగు ఫలితము కలుగును. వైశాఖమాసమున శుద్ధద్వాదశియందు సాలగ్రామదానమును చేసినవారు సర్వపాపములచేతను ముక్తిని పొందుదురు. వైశాఖశుద్ధ ద్వాదశియందు శ్రీహరిని పాలను అభిషేకము చేసినవారు, గంగానదీతీరమందు రాజసూయాశ్వమేధ యాగములను జేసినందువలన కలుగు ఫలితమును పొందుచున్నారు. రమాధవునికి పంచామృత స్నానము చేయించువారు, తమవంశమందున్నవారిని తరింపజేసి వైకుంఠమును చేరగల్గుదురు. ద్వాదశియందు సాయంకాలమున విష్ణుమూర్తికి సంతసమును కలిగించుటకై పానకమును యిచ్చినవారు పాము కుబుసమును విడచినట్లు పాపములను త్యజింతురు సాయంసమయమందు దోసపండ్లరసమును యిచ్చినందువలన కలుగు ఫలము వలన సంసారరూపమైన కర్మబంధముల నుండి విడువబడి ముక్తిని పొందును. చెఱుకుగడలను, మామిడిపండ్లను దానమిచ్చువారియొక్క వంశము నూరుతరములవరకు నశింపకుండ వృద్ధిని పొందగలదు. వైశాఖ శుద్ధ ద్వాదశియందు సాయంసమయమున సుగంధమును పూసినవాడు, బాహ్యపాపముల నుండి విడువబడును.

మహారాజా! వైశాఖ శుద్ధ ద్వాదశీదినమున యెంత స్వల్ప పుణ్య మొనరించినను అది శాశ్వతమైన ఫలము నిచ్చుచున్నది. ద్వాదశీతిథి సర్వజనులయొక్క సమస్తపాపములను హరింపజేసి సర్వశుభములను చేకూర్చును గాన దీనికి లోకమున ప్రశస్తి కలిగిన కారణగాథను వివరింతును వినుము. పూర్వము కాశ్మీర దేశమున

దేవవ్రతుడను విప్రుడుకలడు. ఆయనకు మాలినియను సుందరమగు నందనకలదు. మాలినిని బుద్ధిమంతుడగు సత్యశీలుడను విప్రున కిచ్చి వివాహ మొనరించెను. సత్యశీలుడు మాలినిని పెండ్లాడి తనయు వనదేశమున కేగెను. మాలినియు సుందరవతియై యౌవనవతియై యుండెను. మహారాజా! ఆ సత్యశీలుడు మాలినియందు మనసులేని వాడై కఠినచిత్తుడై యుండెను. అతడు యితరులతో విరోధములేక భార్యయందే విరోధము కలిగియుండెను. మాలినియు, తనయందు భర్తకుగల కోపమును గ్రహించి, అతనిని తన వశపరచుకొనుటకై, పూర్వమందు తన భర్తచేత విడువబడిన స్త్రీలను యుపాయములు యాచించెను. అంతట నావనితలు నామెతో నిట్లనిరి. మాలినీ! మామాటవినుము. నీభర్త నీకు వశుడగును. మేమును మాభర్తలను వశపరచుకొంటిమి. అందుల కవరసమైన మందు నుపయోగించితిమి. ఒక సన్యాసివనితకలదు. ఆమె కడకేగి యడిగిన భర్త భార్యకు స్వాధీనమగు యౌషధము నీయగలదు. మేము బలికినరీతిగా నీవాచరించితివేని నీ భర్త నీకు తప్పక సేవకుడగును. అని ఆవనితలు పలుకగా, రాజాదుర్మార్గపు నడతగల యామె వారి మాటలను విని యుపాయమునకు సంతసించి వెంటనే నూటు స్తంభములుగల యా సన్యాసిస్త్రీ యున్న గుడిసెకు వెళ్ళెను.

విశాలమై శోభావంతమై వచ్చి పోవు జనులుగల గుడిసె యందుగల సన్యాసిస్త్రీని కాషాయవస్త్రధారియైయుండుటగని మాలిని ప్రార్థించెను. ఆ సన్యాసి పొడవైనజడలతో, రాణింపుచున్నది. పరిచర్యలుచేయు పలువురు వనితలు పరివేష్టించియుండిరి. స్ఫుటముగాని మెల్లని చూపులు గలిగియుండెను. చేతిలో జపమాలను ధరించి యుండెను. ఆ సన్యాసి తనకు వశమైనట్టి నమ్మికము కలిగించునట్టి మంత్రరాజము నుపదేశించెను. మాలిని

సన్యాసినికి నమస్కరించి వజ్రమాణిక్య సమన్వితమును మెఱుఁగుఁ గాంతి గలదియు మృదువగు బంగారముచే చేయబడినదియు సూర్యకాంతిచేత ప్రకాశించునదియు నగు యుంగరము నా సన్యాసిని పాదములందు సమర్పించెను. పిమ్మట ఆ సన్యాసిని తన కర్పించిన యుంగరమును గాంచి సంతసించెను. ఆ సన్యాసిని మాలిని యొక్క మనోవేదనను గుర్తెఱింగి యామెకు తగురీతి నిట్లు చెప్పెను. మాలినీ! నీకు సర్వభూతములు వశమగు చూర్ణమును యంత్రమును యిచ్చుచున్నాను. యీ చూర్ణమును నీ భర్తచే సేవింపజేసి యీ యంత్రమును నీగళమందు దాల్పుము. ఇట్లు చేసినయెడల నీ భర్త నీకు స్వాధీనమగును. వేరొక వనితతో రమింపడు. నీతో సర్వదా సంతోషముతో సంభాషించును. నీవు చెడునడత గలిగియున్నను నీయందే మక్కువగలిగియుండును అని చెప్పెను.

మాలిని సన్యాసిని తనకిచ్చిన యంత్రమును చూర్ణమును తీసికొని తనయింటికి వెళ్ళి సాయంసమయమున ఆ చూర్ణమును పాలలోగలిపి భర్తకు త్రాగుటకిచ్చెను. ఆ యంత్రమును తన కంఠమందు దాల్చెను. అయోగ్యమైన పనియని తలంపలేదు. భర్తయు చూర్ణముతో గలిపిన పాలను త్రాగెను. ఆ చూర్ణము సేవించుట వలన మాలిని భర్త క్షయరోగముచేత క్రమముగా క్షీణించుచుండెను. ఆసనమందు రణములు సంభవించి పురుగులు కలిగెను. కొన్నిదినములకు మాలినిభర్తకు శరీరమందు సుఖములేకుండెను. మాలిని వ్యభిచారిణియై చెడునడతగలిగియుండెను. మాలిని భర్తకు శక్తితగ్గినందున యింద్రియములు చలించి రాత్రింబవళ్ళు మాలిని నుద్దేశించి యేడ్చుచు కాంతా! నేను నిన్నుతప్ప యితరులను గోరను. నా తప్పు క్షమింపుము. నన్ను రక్షింపుము. నీకు దాసుడను అని పలికెను. భర్తమాటలను విని తనభర్త తనకు వశుడయ్యెనని తలచి

యాతని యందిష్టము లేకున్నను మరణించినచో తా నలంకార హీనయగుదునను తలంపుచేత మరల నా సన్యాసినివద్దకు మాలిని వెళ్ళి తన వృత్తాంతమునంతను చెప్పెను. సన్యాసిని యాతని రోగము తగ్గుటకై రెండవమందును యిచ్చెను. ఆ మందును తెచ్చి మాలిని భర్తకొసంగెను. వెంటనే అతఁడు జాయామధమును సేవించి రుగ్మతలేక సుఖముగా నుండెను.

ఒక జారుఁడు మాలిని గృహమందు సదా పనిచేయు మిష చొప్పున సంచరింపుచుండెను. అనేకులు సదా వచ్చుచు పోవుచు అనేకవర్ణముల విటగాండ్రు మాలినిగృహమును ప్రవేశింపుచుండిరి. మాలినియొక్క నడతను చూచియు సహింపలేనివాడైనను భర్త మాలినివలన సన్యాసినియొద్దనుండి తేబడి యుపయోగింపబడిన చూర్ణముయొక్క మహిమవలన మాటాడజాలకుండెను. అనేకులతో రమించుటవలన మాలిని మాలిన్యమునుపొంది మానావయవములందు రోగములు జనించి క్రిములచే బాధపడుచుండెను. ముక్కు, నాలుక తినివేయబడెను. రెండుచెవులు తినివేయబడెను. స్తనములు వ్రేళ్ళు కూడ నశించి కొంతకాలమునకు మరణించి నరకలోకబాధలను పొందుచుండెను. ఆ మాలిని నరకలోకమున రాగిపాత్రయందు బసి అనేకవేల సంవత్సరములు యాతన ననుభవించెను. చాలాసారులు కుక్కజన్మల నెత్తెను. ఆ జన్మలయందు చెవులుపోవుట, ముక్కు పూడుట, శిరస్సున పురుగులుండుట, తోకవిచ్ఛిన్నమగుట, కాళ్ళు లేకుండుట, యింటింట ప్రవేశింపుచు వారి సన్మానములను పొందుచు కాలము గడపగా కొంతకాలమునకు సౌవీరదేశమున పద్మబంధువను విప్రునకు దాసిగానున్న యామె గృహమందు ఆడకుక్కయై పుట్టి మిక్కిలి కష్టపడుచుండెను.

ఆజన్మమందును గూడ, చెవులు, ముక్కు, తోక, పాదములు మొదలగు యవయవములేకుండ విచ్ఛిన్నమగుటచేతను, శిరస్సు

నందును, మర్మస్థానమందును, పురుగులుపట్టుటచేతను మిక్కిలి బాధపడుచుండెను కుక్కజన్మ ముప్పదివత్సరములు గడచెను. ఆ కుక్కయొక్క భాగ్యవశముచేత యొకప్పుడు సూర్యుడు మేషరాశి యందుండగా వైశాఖ శుద్ధ ద్వాదశీదినమున పద్మబంధుని పుత్రుడు నదికి స్నానమునకై పోయి స్నానమాచరించి శుద్ధుడై తడిబట్ట లతోనే యింటికి వచ్చి చేరెను. తులసి యడుగు సమీపమందున పాద ములను కడుగుకొనెను. అంతకు పూర్వమే పద్మబంధుని యింటిలో ప్రాచి పనిచేయుటకా దాసి సూర్యోదయమునకు ముందే వచ్చెను. దానితోకూడ నీ కుక్కవచ్చి యచ్చట తులసి యడుగు క్రింద పండుకొనెను. విప్రుడు పాదములను కడిగిన నీరు కుక్క క్రిందకు పోయి యది తడిసిపోయెను. కుక్కయొక్క పూర్వజన్మకృతమైన సర్వ దోషములు వెంటనే నశించి పూర్వజన్మజ్ఞానము కలిగెను.

కుక్క, పూర్వజన్మసంచిత పాపములను తెలిసికొనినందున విచారపడి దిక్కులేక మునిచంద్రమా! నన్ను రక్షింపుమని దీన ముగా ప్రార్థించెను. పిమ్మట తన పూర్వజన్మమందలి తన వృత్తాంత మును జ్ఞప్తికి తెచ్చుకొని, విప్రునితో నిట్లు పలికెను. విప్రోత్తమా! భర్తను వశపరచుకొనుటకు, దురుపాయముల నాలోచించు స్త్రీ వ్యర్థ ధర్మాచారములు కలదియై నరకమున రాగిపాత్రయందు యాతనల ననుభవించును. గాన భర్త వనితలకు పరమ దైవతము. భర్తయే గురువు. భర్తయే యుత్తమమైన దేవత. పూజనీయుడైన భర్తను దూషించి యపకృతి గావించిన వనిత సుఖమును బొంద నేరదు. మరణించిన పిమ్మట నీచజన్మలనంది పురుగులతో గూడినదై యగుచుండును. గాన వనితలు భర్త యానతి ననుసరించి నడుచుకొన వలయును. నేను పూర్వజన్మమందు చేసిన పాపకృత్యములవలన ఘోరమగుచుపడియున్న రూపముతోనున్న నన్ను కరుణించి తరిం

చేయుము. లేనియెడల నరక బాధలను పొందుదు. వైశాఖమాసమున శుక్లపక్షమున నీవు సంపాదించిన పుణ్యమును నాకు యిచ్చి పాపు రాలనగు తన్ను తరింపజేయుము. పుణ్యప్రవర్ధన కరమైన వైశాఖ శుద్ధ ద్వాదశీ దినమున స్నానమాచరించుట, దానము గావించుట, భోజన మొసంగుట, లోనగు సత్కృతులవలన నీవు సంపాదించిన పుణ్యమును నాకు యిచ్చితివేని నే నీ పాపమునుండి ముక్తనగుదును. వైశాఖ శుద్ధ ద్వాదశీ తిథియందు సూర్యోదయ కాలమున యింటి యందు స్నానమాచరించినను, సర్వతీర్థములను సేవించిన ఫలము గలుగుచున్నది. వైశాఖ శుద్ధ ద్వాదశియందు గావించిన తపస్సు, హోమము, దానము, దేవతలను పూజించుట, లోనగు సత్కార్య ముల వలన గలుగు ఫలము స్థిరమైనదైనందున క్రమరీతిని నీకు గలుగు ఫలము నాకు యిమ్ము. ఆరోజున యుపవసించి త్రయోదశి యందు పారణచేయుటవలన గలుగు ఫలము అధికముగా ముక్తిని కలిగించును. మహాభాగా! అనాధరక్షకా! విప్రోత్తమా! దిక్కు లేని నాయందు దయచూపుము. దీనరక్షకుడును, జగదీశ్వరుడును అగు శ్రీహరి మీకు రక్షకుడై ప్రసన్నుడగును. రాజును బట్టి జను లుందురన్నట్లు భగవద్భక్తులగు మీరు భగవానునితో సమానులు. పాపనాశన మొనర్చి యమలోక ముక్తిని గావింప శక్తిగల మహాను భావా! నేను కష్టపడుచుంటిని గాన నన్ను కరుణింపుము. కుక్క జన్మనెత్తి నీ యింటి ద్వారము కడ కావలియున్న దీనురాలనగు నన్ను కరుణింపుము.

శుభమైన వైశాఖ శుద్ధ ద్వాదశీ తిథియందు చేయు సత్కృ తులవలన వేయి గోవులను చంపిన పాపమును, వేయిమంది విప్రు లను జంపిన పాపమును, అయుక్త కార్యములను చేసినందువలన గలుగు కోటిపాపములు కూడ నశించును. అట్టి విశేషపుణ్యమును

నాకిచ్చి విపత్సముద్రమందున్న నన్ను విముక్తను గావింపుము. విప్రు డవైన నీకు నమస్కారము అనిపలికెను. ఆ కుక్క మాటలను విప్రకుమారుడు విని దానితో నిట్లనెను. శునకమా! ప్రతిప్రాణియు, పూర్వజన్మమందలి పాపపుణ్యముల ననుసరించి తరువాత జన్మ మందు సుఖదుఃఖముల ననుభవింపుచుండును. నీవు పాపాత్మురాలవు, నీచురాలవు, యంత్రము, మంత్రములను ప్రుపయోగించి నీ భర్తను వశపరచుకొన్న పరమ దుర్మార్గురాలవు. సజ్జనులను బాధించిన వారికి పాపము మిక్కుముగా గల్గును. సజ్జనులకు చేసిన సత్కృతివలన పాపములనుండి ముక్తులగుదురు. పాపాత్ములకు చేసిన యుపకృతి వలన పుణ్యము నశించును. యిహపరలోకసుఖము లంతరించును. పంచదారతో కలిపిన పాలను పామునకు త్రావుట కొసంగినమాత్ర మున దానికి విషము వృద్ధియగునేగాని నశింపనేరదు. అట్లే పాపు నకు జేసిన సత్కృతి పాపవృద్ధినే గావించును.

అని మునికుమారుడు దయాశూన్యుడై పలికినంత ఆయాడు కుక్క మిగుల విచారమును పొంది ఆకాశమున కత్తెత్తి యఱచుచు విప్రకుమారునితో యిట్లు పలికెను. పద్మబంధూ! నీయింటికి కావలి యుండి మీ యుచ్ఛిష్టమునే దినుచు బ్రతుకుచున్న నన్ను కరుణిం పుము. కాకులు కుక్కలులోనగు నీచప్రాణులకు సహితము గార్హస్థ్య విధి నెఱపువారు బలిభోజనాదులచేత కరుణింపవలయును. గృహస్థులు తమ రక్షణలోనున్న జీవులను తరింపజేయుట ధర్మమైయున్నదని వేదవిదులగు పండితోత్తముల యభిప్రాయమై యున్నది. రోగములు లోనగు వానిచేత నశక్తుడైన వానిని రక్షింపనివాడు తప్పక నరక మును పొందగలడు. యిది నిస్సందేహమని శ్రుతులందు దెల్ప బడెను. జగత్తులకు సృష్టించు జగన్నాథుడు సంసారరూపమైన భార్యాపుత్రాది తాపత్రయములను కల్పించి, ఆ సంసార చక్రమును

పరిభ్రమింపజేయు నాధారభూతు నొకని నిర్మించి, తానే మూలాధారుడై చక్రమును ద్రిప్పుచుండును గాన యజమానుని యాజ్ఞాబద్ధులై యను సరణులుండవలయును. అట్టి యనుచరులు తమ విధిని నిర్వర్తింపక, వ్యతిరేకించిరేని, దైవమునకు ద్వేషులై నరకమున బడియుందురు. గాన దయాశూన్యుడవైన ముని కుమారా! నీవు యీ యుపకృతి చేయదగిన సమర్థుడవు నేను నీ వలన యీ యుపకృతిని పొందదగిన దీనురాలను గాన నన్ను తరింపజేయుము. అని పలికిన శునకముయొక్క వచనములను విని పద్మబంధువులోనుండి బయటికి వచ్చి పుత్రునిజూచి శునకముయొక్క వృత్తాంతమును దెలిసికొని వింతపడి విప్రునితో నిట్లనెను. శ్రేష్ఠమైన ముఖవర్చస్సుగలవాడా! కుమారా! నాకు పుత్రుడవైయుండి యిట్టిపలుకులు నీవాడుట తగునా? యిట్టి యవకాశమున నీవీరీతిగా బ్రవర్తించుట భావ్యముగాదు. పాపాత్ములు తమ స్వోపకృతిని దలంచుకొని పరుల కుపకారము చేయక పాపులగుచున్నారు. సజ్జనులు తమ సంగతిని వదలి పరుల కుపకారమునే చేయుచుందురు. గ్రహించితివా? చంద్రుడు, సూర్యుడు, వాయువు, భూమి, అగ్నిహోత్రుడు, జలము, మంచిగంధము, చెట్లు, సజ్జనులు, యీ మొదలైన వన్నియు యితరుల కుపకారము చేయుటయందే బుద్ధినికలిగియుండును. రాక్షసులు పూర్వము మిక్కిలి బలముగలిగి దేవతలను బాధించునప్పుడు దేవతల యుపకారమునకై దధీచియను మహాముని తన శరీరమందలి యెముకను దయతో కూడినవాడై దానమొసంగెను. భాగ్యవంతా! పూర్వమందు శిబిచక్రవర్తి పావురమును రక్షించునిమిత్తము క్షుద్బాధాపీడితమైన డేగకు తన శరీరమునుండి మాంసమును కోసియిచ్చెను. భూలోకమందు జీమూతవాహనుడు కరుణామయుడై తనజాతివారిని రక్షించునిమిత్తము

గరుత్మంతునకు హారముగా జనెను. గాన దయాస్వరూపమును పర
మార్థజ్ఞాన విదులగు విద్వాంసులు గలిగియుండవలెను.

పవిత్రులైన ప్రాణులను పరమేశ్వరుడు కరుణించును. పవిత్రత
లేని పరమదుర్మార్గులను రమావల్లభు డనుగ్రహింపడు. పవిత్రత లేని
పరమచండాలుర యింటియందు కూడ చంద్రుడు ప్రకాశింపు
చుండును. గాన తరచుగా ప్రార్థింపుచున్న యీ శునకమునకు నే
జేసిన పుణ్యమునుండి పాలొసంగి పంకమందు దిగబడిన పశువును
రక్షించినరీతిగా కాపాడుదును. అని బహుప్రతిభాశాలియైన పద్మ
బంధువు కుమారుని తిరస్కరించి ప్రతిజ్ఞచేసెను. పద్మబంధువు
వైశాఖశుద్ధ ద్వాదశియందు తానుచేసిన సత్కృత్యులవలన కలిగిన
పుణ్యమును దానముచేసి శునకమా! నీ పాపములన్నియు నశించి
నవి. నీవు విష్ణులోకమునకు వెళ్ళుము అని పల్కెను.

మిథిలాధినాథా! శ్రుతకీర్తీ! వినుము. ఆ విప్రవల్లభు డగు
పద్మబంధు వీరీతిగా నాయాడు కుక్కతో బలుకగా అది తన శరీర
మును విడచి శ్రేష్ఠమైన దేవతాస్వరూపమును దాల్చి ప్రకాశ
వంతమైన యలంకారభూషణములు గలదియై శతాధిక భాస్కర
ప్రకాశమానమై అపరసావిత్రివలె నలరారుచు విప్రుని యానతివడసి
దశదిశలను భాసమానముగ జేయుచు స్వర్గమునుగూర్చి వె
ఆమె స్వర్గమందనేక భోగము లనుభవించి మరల భూలోకమున
నరనారాయణాంశమువలన యూర్వశియను పేర ప్రభవించెను. ఆ
వరానన వైశాఖశుద్ధ ద్వాదశీమాహాత్మ్యమువలన దేవతల కత్యంత
ప్రేమాస్పద యగు దేవవేశ్యగా పుట్టెను.

శునకరూపమును విడిచి దేవతాస్వరూపమును బొందిన యా
వనిత యోగుల కనుభవయోగ్యమైనదియు, జ్ఞానులు సహితము
చలించి మోహపరవశులగు సౌందర్యమును, గల పరమార్థ స్వరూ

